# చతుర

జులై 2011
రూ. 10/-

ENTERED

★ డా. బోయ జంగయ్య
పుట్టుమచ్చ ..6

# ప్రపంచప్రఖ్యాతి గాంచిన కేరళ ఆయుర్వేద వైద్యశాల వారి ప్రత్యేక చికిత్సలు!! (ఆపరేషన్‌లు లేకుండా)

## H.I.V / A.I.D.S. H.I.V / A.I.D.S. వ్యాధిగ్రస్థులకు శుభవార్త!!

H.I.V / A.I.D.S లు నయముకాని వ్యాధులని అనుకుంటున్నారా? దక్షిణ కాలిఫోర్నియా యూనివర్శిటీ వారి పరిశోధన ప్రకారం 'మానవ శరీరంలోని A.P.O.B.E.C-3G అనే ఎంజైము ఉంటుంది. H.I.V శరీరములోనికి ప్రవేశించిన వెంటనే దాన్ని అడ్డుకునే సామర్థ్యం కల్గిన ఎంజైము శరీరములోని ప్రతి కణములోను ఉంటుంది.' శరీరములోని ప్రతికణములో ఉన్న బలహీనపడిన A.P.O.B.E.C-3G ఎంజైమును శక్తివంతం చేస్తే అది H.I.V ని నాశనం చేస్తుంది. మా మందులు వైరల్ లోడ్‌ని తగ్గించి CD-4 కౌంట్ పెరిగి సాధారణ స్థితికి వస్తుంది. H.I.V సోకిన వ్యక్తిని A.I.D.S నుండి కాపాడవచ్చు. H.I.V A.I.D.S లు ప్రాణాంతకాలు కావు. డాక్టర్ సలహా మేరకు మందులు వాడి CD-4 కౌంట్ (Immunity)ని 800 నుండి 1500వరకు పెంచుకొని పూర్తి జీవితకాలం ఆరోగ్యముగా జీవించవచ్చును. ఎలాంటి ఆహార నియమాలు లేవు. ఆల్కాహాల్ సేవించరాదు

## కేన్సర్ - CANCER కేన్సర్ - CANCER - వ్యాధిగ్రస్థులకు శుభవార్త!! (ఆపరేషన్‌లు లేకుండా)

* మెదడు * నోరు * థైరాయిడ్ గ్రంధి * స్తనములు * ఊపిరితిత్తులు * అన్నవాహిక * జీర్ణాశయము * పసరుతిత్తి * కాలేయము * పాన్‌క్రియాసిస్ * మూత్రపిండములు * ప్రొస్టేటుగ్రంధి * మూత్రకోశము * జీర్ణ కోశము * ప్రేగులు * గర్భాశయ కంఠము (సెర్విక్స్) * గర్భాశయము * అండములు * పురుషాంగము * వృషణములు * న్యూరోబ్లాస్టోమా * కండరములు * ఎముకలు * చర్మము * లింఫ్ గ్రంధులు ఎంతో మంది క్యాన్సర్ వ్యాధిగ్రస్థులకు చికిత్స చేస్తున్నటువంటి కేరళ ఆయుర్వేద వైద్యశాల. రేడియేషన్ థెరపి. కీమోథెరపి. హార్మోన్ థెరపి. బయోలాజికల్ థెరపి. మరియు ఇతర వైద్యపద్ధతులను తీసుకుంటున్న వారు కూడా మా ఆయుర్వేద మందులు వాడవచ్చును.

## షుగర్ (DIABETES MELLITUS) అతి మూత్రము (DIABETES INSIPIDUS) వ్యాధి బాధితులకు శుభవార్త!!

అన్ని వయసుల వారికి ఎన్ని సంవత్సరముల నుండి షుగర్ వ్యాధి ఉన్నా (TYPE - II DIABETES. NON INSULIN DEPENDENT DIABETES MELLITUS. (NIDDM) 3 నెలలలో నియంత్రణలోకి వస్తుంది. (TYPE -1 DIABETES. INSULIN DEPENDENT DIABETES MELLITUS. (IDDM) 6 నెలలలో రోజులలో నియంత్రణలోకి వస్తుంది. కోర్సు అయిన తరువాత పంచదార, బెల్లం, తేనె, ఖర్జూరము లాంటివి తీసుకుంటూ వ్యాధిని తగ్గించుట ఈ మందు యొక్క ప్రత్యేకత. షుగర్ పేషంట్లకు మానని పుళ్ళు, గాయములు, గాంగ్రీన్ లాంటివి 30 రోజులలో మాన్పించవచ్చును. (PER MONTH Rs.3000/-) TYPE - II COURSE 6 MONTHS. TYPE - 1 COURSE 12 MONTHS.

## సంతానం లేని (Infertility-Sterility) దంపతులకు శుభవార్త!! (ఆపరేషన్‌లు లేకుండా)

[illegible] (OLIGOSPERMIA) [illegible] (MOTILITY) [illegible] (Azoospermia) [illegible] (Varicoseviens) (Per month Rs.5000/-) Course : 3 months. [illegible] (Fallopian Tubes Block), [illegible] (Acid) [illegible] (PCOD) - [illegible] (Per Month Rs.5000/-) Course : 3 months

## ఆల్కహాల్ - స్మోకింగ్ - గుట్కా - డ్రగ్స్ మానండి! త్రాగే వారికి తెలియకుండా మాన్పించండి!! Per Month Rs.2000/-) Course : 2 months.

**నూతన యవ్వనశక్తికి : నపుంసకత్వము - శీఘ్రస్కలనము - నరాల బలహీనత** (IMPOTENCY) అంగస్తంభన గట్టిగా లేకపోవుట - లైగిక వాంఛ లేకపోవుట (LIBIDO) - రతి మధ్యలో అంగము మెత్తబడి చిన్నగా ముడుచుకొని పోవుట-వృషణములు శుష్కించిపోవుట (ATROPHY OF TESTIS) రతిలో పాల్గొనక ముందే వీర్యము బయటికి వచ్చుట - నిద్రలో వీర్యము పోవుట - శృంగారమంటే భయం - శృంగారములో తమ సామర్థ్యము మీద తమకే నమ్మకం లేకపోవుట - శృంగారపరమైన సమస్యలను నివారించి - మగువదగ్గర మృగరాజులా రెచ్చిపోయే శృంగార సామర్థ్యము - 60లో 20లా యవ్వనాన్ని తరగనీయదు - శరీరము వజ్రమంత దృఢముగా, శక్తివంతముగా - వృద్ధాప్యాన్ని రానీయని మహత్తర ఆయుర్వేద ఔషధము. (Per Month Rs.5000/-) Course : 3 months.

**సుఖవ్యాధులు:** గనేరియా - సిఫిలిస్ (per month Rs.2000/-) Course : 3 Months. హెర్పిస్ సింప్లెక్స్ (HERPES SIMPLEX) (Per month Rs.4000/-) Course : 3 months

లివర్ వ్యాధులు - లివరు గట్టి పడుట (Cirrhosis) - లివర్‌లో పుండు (Abscess) - లివర్ వాపు, నొప్పి (Hepatitis) (Per month 5000/-) Course: 3 Months

మూర్ఛ (Fits) అపస్మారకము (Epliepsy) - సోరియాసిస్ (Psoriasis) - బొల్లి (Leucoderma) - PROSTATE ENLARGE - THYROID - KIDNEY STONES (Per month Rs.4,000/-) Course : 3 month స్త్రీల శరీరంపై వచ్చు అవాంఛిత రోమములు (UN WANTED HAIR) తిరిగి మొలవకుండా చేయుటకు (Per month Rs.4,000/-) Course : 1 month స్థూలకాయము (Obesity) - బరువును - లావును తగ్గించుటకు (No Diet, No Exercise) - సన్నగా బలహీనముగా నుండు వారు, బరువు - లావుపెరుగుటకు - (21సం॥లోపు) వారు ఎత్తు పెరుగుటకు) - నత్తిని తగ్గించుటకు (Stammering) - జ్ఞాపకశక్తిని పెంచుటకు - నిద్రపట్టకపోవుట (Insomnia) MAIGRANE - T.B - PSYCHOLOGICAL PROBLEMS Per month Rs.3000/-) Course 3months

## స్త్రీల స్తనముల సైజు పెంచుటకు - స్త్రీల పొత్తికడుపు మీద (SCRATCH MARKS) చారలు, గీతలు పోవుటకు (Per month Rs.1500/-) Course : 3 months

కీళ్ళు కండరాల నొప్పులకు - ఎనీపెయిన్ - నడుమునొప్పి - వెన్ను నొప్పి మెడనొప్పి - PILES - FISSERS - GAS - TROUBLE - ACDT - ULCER (Per month 1200/-) Course: 3 Months) - ఊంటినొప్పి (SCIATICA) - FITULA (Per month 3000/-) Course: 3 Mo[illegible]

## బట్టతల!! Baldness! నెరిసిన జుట్టు!! Grey Hair! చుండ్రు, జుట్టు రాలుట, పేను కొరుకుడు, జుట్టును నల్లగా ఒత్తుగా, పొడవుగా పెంచి బట్టతల నెరిసిన జుట్టును నివారించును.

Kerala Herbal Hair Tonic (Oil) 100ml Rs.600/-, 250ml Rs.1300/-Herbal Hair Capsules 60 - Rs600/- (Per Month Rs.1200) Course : 6 Months.

## ఉబ్బసం (Asthma) ఎలర్జీ (Allergy) వ్యాధులకు ప్రత్యేక చికిత్స!!

[illegible] (Sinusitis) [illegible] (Eosinophilia) [illegible] Asthama Sanjivini 400ml / TAB / CAP (Per month Rs.1000/-) Course : 9 months

# కేరళ ఆయుర్వేద వైద్యశాల

ఫోన్:6552610 9392355590 9866155109

సప్తగిరి థియేటర్ ప్రక్కన, 2 nd బిల్డింగ్, 1 Floor R.T.C X Roads BUS STOP హైదరాబాద్-20.

అన్ని రకముల దీర్ఘకాల వ్యాధులకు సంప్రదించండి మాకు మరెక్కడా బ్రాంచీలు లేవు



9 A.M. 9A.M. TO 9P.M. 9 P.M.

Note : పోస్ట్ ద్వారా కూడా చికిత్స కలదు. ఉత్తరాలద్వారా మీ సమస్యలను తెలియచేసి, మీ దగ్గర ఉన్న రిపోర్టు పంపి ఫోన్ ద్వారా సంప్రదించి చికిత్స పొందవచ్చును. మందు ఖరీదు మరియు ఏపీలో పోస్టల్ కొరియర్ చార్జీ రూ॥ 100/-. ఇతర రాష్ట్రాలవారు రూ.250/- కలిపి మనియార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా పంపువారు Kerala ayurveda vaidyasala పేరు మీద ఇక్కడ రాసినట్లుగా వ్రాసి పంపవలయును. మీ ఫోన్ నెంబరుతో సహ పంపించండి. ఫోన్ ద్వారా సంప్రదించువారు 9 A.M. - 9 P.M. Sunday 9 A.M to 2 P.M

# ముఖచిత్రంగా మీ ముఖారవిందం!




క్యూట్ క్యూట్ బేబీస్, యూత్‌ఫుల్ లేడీస్‌కు ప్రాధాన్యం
అందం, ఆకర్షణ, తగిన డ్రస్‌సెన్స్ ఉంటే చాలు..
మీ అభిమాన చతుర / విపులకు
మీరే ముఖచిత్రం అవుతారు
చేయాల్సిందల్లా- పోస్ట్‌కార్డ్ సైజ్ క్లోజప్పులు రెండు.
అదే సైజ్ 3/4 ఫొటో ఒకటి వెంటనే మాకు పంపండి.
ఫొటోలు మెయిల్ కూడా చేయొచ్చు

**నోట్ :** ఫొటోల ఎంపికలో తుది నిర్ణయం సంపాదకులదే.
ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు, వాదవివాదాలకు చోటేలేదు.

- ఫొటోలు పంపేవారు విధిగా తమ మరియు తమ తల్లిదండ్రుల అంగీకార పత్రంతోనే ఫొటోలు పంపాలి.
- మీరు బాగున్నా, ఫొటోలు క్వాలిటీగా లేకుంటే మేమే ఫొటోగ్రాఫర్‌ను పంపుతాం.
- ప్రచురణ తర్వాత ఫొటోలు తిరిగి కావాలనుకునేవారు తగిన పోస్టేజి స్టాంప్‌లంటించిన స్వంత చిరునామాగల కవరును జతపరచాలి.

చిరునామా : సంపాదకులు, చతుర/విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్- 500082 ఈ మెయిల్ : vipula.chatura@eenadu.net









సంపుటి -34, సంచిక - 6
402వ సంచిక, పేజీలు : 132
జులై 2011

# చతుర



'సంసారులు సానులయ్యారేకానీ రివర్స్ జరగలే' అంది ఓనరమ్మ. 'నేనట్లాంటిదాన్ని కాదు. నన్నొదిలేయ్' అంది గంగ వేడుకోలుగా. 'మొదట్లో అందరూ అంతే అంటరు. మళ్లీ కలుస్తా' అందామె వెళ్తూ. ఆ రాత్రే టక్ టక్ శబ్దం. తలుపు తీస్తే ఎదురుగా ఓ మగాడు. 'మీరెవరు? ఏం కావాలి?' అడిగింది గంగ భయంగా. 'ఎవరైతేనేం అమ్మలేదా?' అడిగాడు ఆ శాల్తీ. 'ఏ అమ్మ గురించి అడుగుతున్నరు?' అంది గంగ బెదురుతూ. 'ఇంకే అమ్మ? కంపినమ్మే' అంటూ గంగవైపే ఓరగా చూశాడు. ఇంతకీ కంపినమ్మంటే ఎవరు? ఆమె పనేంటి? సంచారజాతి కుటుంబాలకు చెందిన ఓ పడతి జీవనపోరాటాన్ని ఆవిష్కరించిన సుప్రసిద్ధ రచయిత **డా. బోయ జంగయ్య** సరికొత్త సామాజికాభ్యుదయ నవల **పుట్టుమచ్చ** పేజీ ...6

బొమ్మలు: బాలు

ENTERED



# 2011లో ఇంప్రింట్‌వారి భారతదేశంలోని తీర్థయాత్రలు పుణ్యభూముల సందర్శనం



## శృంగేరి యాత్ర
గోకర్ణము, మురుదేశ్వర్, మూకాంబిక, ఉడిపి, ధర్మస్థల, హోరనాడు, శృంగేరి
4 రోజుల యాత్ర , రూ. 4000/- బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1,11/2,11/3,8/4,13/5,10/6, 8/7,12/8,9/9,7/10,11/11,9/12

## తమిళనాడు దర్శన్
వెల్లూర్, తిరుత్తని, కంచి, పాండిచ్చేరి, నవగ్రహ దేవాలయాలు, తిరువెంకాడ్, తిరుచ్చి, మధురై, కుర్తాళం, రామేశ్వరం, కన్యాకుమారి, శుచేంద్రం, త్రివేండ్రం.
7 రోజుల యాత్ర . రూ.11500/- రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1, 18/2, 18/3, 15/4, 20/5, 17/6, 19/8,16/9,14/10,18/11,16/12

## మహారాష్ట్రా దర్శన్ అష్ట గణపతులు
షిరిడి, తుల్జాపూర్, కొల్హాపూర్, అక్కల్‌కోట్, 4 జ్యోతిర్లింగాలు
7 రోజుల యాత్ర , బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 12500/-
యాత్ర తేదీలు : 21/1, 24/2, 25/3, 22/4, 27/5, 24/6, 22/7, 26/8, 23/9, 21/10, 26/11, 22/12

## హిమాలయ దర్శన్
బాగేశ్వర్, బైద్యనాథ్, పాతాళభువనేశ్వర్, బేరినాగ్, జాగేశ్వర్, రాణీకేత్, నైనితాల్, ఈ క్షేత్రములయందు సాక్షాత్తు దేవతలు ప్రత్యక్షమగును.
రైలు, బస్సు, 10 రోజుల యాత్ర, ఖర్చు రూ. 16000/-
యాత్ర తేదీలు : 11/1, 18/2, 18/3, 15/4, 20/4,17/5,15/6, 19/7, 16/8,23/9,21/10,26/11,16/12

## గుజరాత్ దర్శన్ సోమనాథ్, నాగేశ్వర్
పంచద్వారకలు, గోపితలాప, మాతృగయ, జామ్‌నగర్, పోరుబందర్
7 రోజుల యాత్ర , బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 11000/-
రాజ్‌కోట్ వరకు రైలు అక్కడ నుండి బస్సు, యాత్ర తేదీలు :
11/1,25/1,22/2,8/3,22/3,5/4,19/4,10/5,24/5,7/6,21/6,5/7, 19/7,9/8,23/8,6/9,20/9,4/10,18/10,8/11,22/11,6/12,20/12

## కేరళ యాత్ర
కాలడి, చోటాకినారా, రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల దేవాలయాలు గురువాయూరు, అలిపి, మున్నార్, త్రివేండ్రం, కన్యాకుమారి
9 రోజుల యాత్ర , రైలు, బస్సు ఖర్చు రూ. 18000/-
యాత్ర తేదీలు : 28/1, 25/2, 25/3, 21/4, 26/5,28/6,28/7, 28/8, 28/9,19/10,23/11,22/12

## ఉజ్జయిని ఓంకారేశ్వర్ యాత్ర
ఉజ్జయిని, హర్షవర్ధినిదేవి (శక్తిపీఠం), ఓంకారేశ్వర్, మహేశ్వర్, జ్యోతిర్లింగములు, ఆంజనేయస్వామి దేవాలయం, పార్వతి దేవాలయం
4 రోజుల యాత్ర , రైలు, బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 5500/-
యాత్ర తేదీలు : 22/1,12/2,26/2,12/3,26/3,9/4,23/4,14/5,28/5,11/6,25/6,9/7, 23/7,13/8,27/8,10/9,24/9,8/10,22/10,12/11,26/11,18/12,24/12

## సంపూర్ణ నేపాల్ యాత్ర
లుంబిని, పోక్రా, ముక్తినాథ్, మనోకామ్న, పశుపతినాథ్, దక్షిణకాశీ, జనక్‌పురి, చిన్నమస్త, కోసిదామ్, ఖాట్మండ్,
రూ. 42,000/- ఒక్కరికి
(ప్రయాణ భోజన వసతులతో సహా)

## ఒరిస్సా, బెంగాల్, అస్సాం దర్శన్
పూరీ, సాక్షిగోపాలం, కటక్, భువనేశ్వర్, గిరిజాదేవి, కాళీమాత దేవాలయం, గంగాసాగర్, చందాసాగర్, తారకేశ్వర్, పక్షేశ్వర్, శాంతినికేతన్, బ్రహ్మపుత్రానది, ఉమానందా దేవాలయం, పీకాక్ ఐలాండ్ , కామాఖ్యా దేవాలయం.
12 రోజుల యాత్ర, రూ. 18000/- , రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1,25/2,25/3,22/4,27/5,24/6, 22/7,26/8,23/9,21/10,25/11,23/12

## కాశీ, గయ, ప్రయాగ
కాశీయందు పిండప్రదానం చేయు వారికి ఆంధ్రప్రదేశ్ తూర్పుగోదావరి జిల్లాకు చెందిన ఋత్వికులచే తీర్థ కార్యక్రమాలు జరుపుకొనే సౌకర్యం కల్పించబడును. 6 రోజుల యాత్ర, రూ. 5,500/- (భోజనములు కాక) రైలు, బస్సుప్రయాణం. యాత్ర తేదీలు : ప్రతీరోజు

## చార్‌ధామ్ యాత్ర
హరిద్వార్, హృషీకేశ్, యమునోత్రి, గంగోత్రి, కేదార్‌నాథ్, బదరీనాథ్.
13 రోజుల యాత్ర, రూ. 20000/- రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 3/5,20/5,27/5,3/6,17/6,24/6,1/7,22/7, 29/7,5/8,19/8,26/8,2/9,16/9,30/9

## ద్వాదశ జ్యోతిర్లింగ యాత్ర
శ్రీరామేశ్వరం, శ్రీశైలం, భీమాశంకర్, శ్రీ త్రయంబకేశ్వర్, ఘృష్ణేశ్వర్, పర్లీవైద్యనాథ్, శ్రీనాగేశ్వర్, శ్రీసోమనాథ్, ఉజ్జయిని, శ్రీ ఓంకారేశ్వర్, శ్రీ కేదార్‌నాథ్, వారణాసి. 23 రోజుల యాత్ర, రైలు, బస్సు ప్రయాణం.
రూ. 32000/- యాత్ర తేదీలు : 27/1,24/2,24/3,26/4, 23/5,21/6,25/7,22/8,20/924/10,24/11,22/12


వివరాలకు :

Imprint

దంటు నాగార్జున శర్మ, ఇంప్రింట్ ట్రావెల్స్ & టూర్స్
ఫ్లాట్ నెం. 504, సంయుక్తా అపార్ట్‌మెంట్స్, అంబాలికా ఫర్నిచర్ పైన, రాజా డీలక్స్ ఎదురుగా, ముషీరాబాద్,
హైదరాబాద్ - 20. ఫోన్: 040 – 2754 7708/2754 7709, సెల్: 98850 89092

'ఏ తప్పు చేయకున్నా అందమైన గంగను ఆమె పుట్టిన కులం పుట్టుమచ్చలా జీవితాంతం వెంటాడింది. అందరు తల్లులు పిల్లల బాగోగుల్ని కోరుకుంటే ఆమెతల్లి మాత్రం గంగ బతుకులోకి నిప్పులు పోయాలనుకుంది.

పెళ్లాడాలి.. అందరిలో గౌరవంగా బతకాలి అన్న ఆమె ఆశల్ని ఆసరా చేసుకుని ప్రేమించినవాడు గర్భవతిని చేసి ఎటో పారిపోయాడు.

అయినా ధైర్యంగా సాగిందామె జీవిత గమనం.

ఏటికి ఎదురీదిన ఆమె సమస్త నారీలోకానికి స్ఫూర్తి ప్రదాతగా నిలిచింది.

ఈ పయనంలో ఆమె చేసిన నిర్విరామ జీవన పోరాటం ఎలాంటిది? తనకెదురైన ఆటంకాలను ఎలా ఛేదించిందామె?

సుప్రసిద్ధ రచయిత

**డా॥ బోయ జంగయ్య**

సరికొత్త సామాజికాభ్యుదయ నవల

# పుట్టుమచ్చ





ఓ రోజు సాగర్ జలాశయం వెన్నెల గి న్నెలాగ తొణికిసలాడుతుంది. దాని ఒడ్డున ఉన్న హిల్ కాలని జనంతో కిటకిట లాడుతుంది. గెస్ట్‌హౌస్‌లన్నీ నిండిపోయి రైట్ బ్యాంకులోను ఖాళీల్లేవు. వాళ్ళ వాళ్ళ హోదాలను బట్టి గెస్ట్‌హౌస్‌లను కేటాయిం చింద్రు. వంటలు వార్పులకోసం కళాశాల మైదానంలో ఒకచోట అందరూ తినేటట్టు ఏర్పాటు. ఖాళీస్థలాలలో డేరాలువేసి కార్య కర్తలను, సేవాదళంవాళ్లను వుంచింద్రు. దేశం నలుమూలల నుండి రాజకీయ కార్య కర్తలు అక్కడికి వచ్చి చేరింద్రు.

పొద్దంతా సభలు, సమావేశాలు జరుపు తూ రాజకీయ పాఠాలు చెపుతున్నరు రాజ కీయ పండితులు. రాత్రి కాగానే ఎవరి బసలో వాళ్ళ విశ్రాంతి. అప్పుడు సీసాల మూతలు ఎగిరి పడగా బ్రాందీ విస్కీలు గ్లాసుల్లోకి పారి గొంతుల్లోకి జారుతుం టాయి. వచ్చిన అతిథులకు అన్ని సౌకర్యా లనూ చూడడానికి సేవాదళ్ కార్యకర్తలను నియమించింద్రు. స్త్రీలకు స్త్రీలనూ నియ మించి ఏ ఇబ్బంది కలగకుండా చూస్తు న్నరు. కాని రాత్రివేళ కొందరు అటు ఇటు తిరిగేవాళ్ళు.

వాళ్ళల్లో మోతి ఓ ప్రత్యేక ఆకర్షణ. సీతాకోకచిలుకలా తిరుగుతూ వుండేది. ఉత్తర భారతం నుండి వచ్చిన వాళ్ల కళ్లన్నీ ఆమె మీదనే. మోతి నవ్వితే మల్లెలు రాలినట్టుండేది. అందరూ ఆమెకే పని చెపుతూవుండేవాళ్లు. అలసట లేకుండా ఆ పనులు చేస్తుండేదామె. కార్య క్రమాలు ముగిసి దీపాలు వెలిగేవేళల్ల ఆమెను ఎక్కువగా పిలుస్తూ వుండేవాళ్లు. పిలిచిన వాళ్ల దగ్గరికి వెళ్లి గ్లాసులు నింపి అందిస్తుండేది. అప్పుడు చూపులు కలిసే వి, గ్లాసుమీద వేళ్ల మధ్యకు వేళ్లు చొచ్చుకు పోతుంటే రాజకీయ మేధావులు వెర్రి వెంగళప్పల్లా చూపులను నిలేసుకునేవాళ్లు. ఇట్లా ఇట్లా తెల్లవారిందాక ఎందరికో నిద్ర లేమిని కల్పిస్తూవుండేది. ఏదో ఓ పదవికి చేరాలని ఆమె ఆశ.

మోతి నలిగిన పూలను తీసిపారేసి తల వెంట్రుకలను సరిచేసుకుని, పయిటను భుజంమీద సర్దుకుంటు ఓ గదిలో నుండి మరొక గదివైపు నడుస్తోంది. సరిగ్గా అప్పుడే నీళ్లకూజాతో ఎదురైంది గంగ.

"పొద్దున కనబడి మధ్యాహ్నం మాయ మైనవు" అందామె.

"నీవు ఎవరి రూమ్ దగ్గరున్నవు" అని అడిగింది మోతి.

నేను ఓ నాయకురాలి దగ్గరున్న. ఆ మెకు తెలుగురాదు.. నాకు హిందీ అంతగ రాదు" అంది నవ్వుతూ గంగ.

"సైగలతోనే సరిపోయిందా? "

"చాల మంచామే"

"పద అట్టపోయి ఆ మెట్ల మీద కూర్చొని మాట్లాడుకుందాం" అంటూ ఇ ద్దరూ వెళ్లి వెన్నెల్లో కూర్చున్నరు.

"నీ పేరు"

"గంగ" అంది.

"ఊరు"

"ఈ ఊరె" అంది

"నా పేరు మోతి. సూర్యాపేట దగ్గర తండా మాది"

"మీ వాళ్లు వేసుకునె డ్రస్ నీవు వేసు కోవా? " అని అడిగింది గంగ అసక్తిగా.

"మొన్నటివరకు వేసుకున్న. ఈ రాజకీ యాలలోకి చేరినాక చీరె కడుతున్నా.. బాగలేనా? "

"బాగెందుకు లేవు. బంగారు బొమ్మలా గున్నవు. పెద్ద పెద్ద కళ్ళు, గోడ పెట్టినట్టు ఆ ముక్కు" అంది.

"నువ్వూ అందంగానే వున్నవు" అంది మోతి చిన్నగా నవ్వుతూ.

గంగ ఉదాసీనంగా నవ్వింది.

"ఎందుకట్లా పేలవంగా నవ్వుతవు. ఈ

ఊరు దానివి ఎంత ఇదిగా వుండాలి? ఇంకా చెప్పు" అంది మోతి గంగ చేతులపై తన చేతులనుంచుతు.

"పెళ్లి అయ్యిందా? " అడిగింది మళ్లీ తానే గంగ కళ్ళలోకి చూస్తూ.

నాయుడు గుర్తొచ్చి మౌనంలోకి వెళ్ళింది గంగ.

మోతి తనేదో అర్థం చేసుకున్నట్టు చూస్తూ- "అర్థమైంది. అందుకే నేనూ పెండ్లి చేసుకోలేదు, తెలుసా? రాజకీయాలలో మా గిరిజనులు తక్కువ. అందునా ఆడవాళ్లు లేనేలేరు. పదో తరగతి అయిపోగానే చదువు ఆపి ఈ బాట పట్టిన. ఈ బాటలో అన్నీ ముళ్లూ రాళ్లే. అది వేరే విషయం. పరికిణి ఎరుపెక్కకముందే పని పట్టిరి. పాయె చూస్తుండగానే ముప్పయి ఏళ్లు ముంచుకొచ్చె. ఊట నీళ్లు తాగిందాన్ని, చెట్టు మీద మాగిన పండ్లు తిన్నదాన్ని. నెమిలోలె ఆడిందాన్ని. పెండ్లి చేసుకుంటె- ఇల్లు ఇంటాయనతో వుంటె రాజకీయాలు కుదరవని పెండ్లిని మరిచిపోతి. ఇంటిల్లిపాది మొత్తుకున్నా ఒంటరి తనాన్ని ఎన్నుకున్న" అంది.

"నిన్నెవరు ఏం అనలేదా పావురంలాగున్నవు" అని అడిగింది మోతి మళ్లీ తానే.

"అన్నరు నీవు బాగానే ఉన్నవు.. బాగున్నవాళ్లు బాగానే బతుకుతరట! పదవులు కావాలంటే పెదవులు నలగక తప్పదు అని కూడా అన్నడు ఒకాయన"

"అవును మరి అంతే" అంది మోతి.

"నేను, రాజకీయాల్లోకి రావటం లేదు కదా? ఏదో రోజుకింతిస్తం.. మహిళ నాయకురాళ్ల మంచి చెడ్డలు చూడడానికి రమ్మంటె వారం రోజులె కదా అని వచ్చిన.. ఇంటి దగ్గర పాప లేదూ" అంది గంగ.

"పిచ్చిదానా! రాజకీయాలంటే ఏదో పాప కూపం అనుకుంటున్నవు. దాని మజా తెలియదు నీకు. పదవులు వరిస్తయి, అంతస్తులు పెరుగుతయి. ఆపైన దండలు దండాలే చూస్తంలే" అంది మోతి అదో మాదిరిగ చూస్తూ.

"నీవంటె మొదటినుండీ అందులో వున్న దానివి. నేను అట్లాకాదుగద" అంది గంగ.

"కాకున్న, నీ చిరునవ్వు చాలు ఎదుటి వాళ్లు చిత్తయిపోడానికి. ముడి ఇప్పకుండానే మురిపించొచ్చు" అంది మోతి.

ఆలోచనల్లో పడింది గంగ.

"ఎక్కువ ఆలోచిస్తే ఏదీ దక్కదు. నాతోపాటు నడువు. అన్నీ సజావుగానే నడుస్తయి. పదవులొస్తయి, పైసలొస్తయి. మంచి బతుకువస్తది" అంది మోతి చిటిక వేస్తూ.

"ఏ రంగంలోనైనా ఆడది గెలవాలంటే కొన్ని చిట్కాలు ఉంటయి. మా అమ్మమ్మ చెప్పింది మొగోన్ని ఎంత మొరటోనివి అనాలంట ఇక చూడు వాడు ఉక్కుమనిషి అవుతాడట. వద్దు వదిలై అంటే వెంట పడివస్తాడట. కన్నుకొడితే చాలు కరిగిపోతాడట. ఇట్లాంటివి చాలా చెప్పింది. వీటిని పాటిస్తే ఎంతటివాని ముందైన గెలుపే కాని ఓటమి ఉండదట.

పోతే నీ బిడ్డను పెంచడము పెద్ద ఇదేం కాదు. ఆలోచించుకో.. రాజకీయాల్లో కొస్తె అన్నీ వాటంతట అవే సర్దుకుపోతయి. మనకు మనమే బతుకుబాటలు వేసుకోవచ్చు. ఈ మగ రాజకీయ నాయకులు చూడు. అధికారం, పదవులు, డబ్బు వాళ్ల చుట్టూరే. మనమూ వాటిని సాధిస్తే వాళ్లలాగె మనమూ జీవితాన్ని అనుభవించొచ్చు. మనకంటె వాళ్లకు ఏం ఎక్కువ? " అంది మోతి ఏదో ఉపదేశించినట్టు.

"ఏ కులం అన్నవు? " తర్వాత అడిగింది మోతి.

చెప్పింది గంగ. ఆ తర్వాత "ఆ కులంలో పుట్టినకానీ ఆ కులమని చెప్పుకో

వటం నాకు నచ్చదు"

"మీవాళ్ళ వృత్తీ..? " అని ఆగింది.

"అదే అనుకో, కాని నాకు మొదటి నుండి ఆ వృత్తి ఇష్టం లేదు" ఆ వృత్తి అనే పదం ఒత్తిపలుకుతు, చేతి గాజులను సవరించుకుంటు గతంలోకి వెళ్ళింది గంగ.

★ ★ ★

అప్పటికి ఆనకట్ట పూర్తి అయ్యి హైడ్రో ఎలక్ట్రిక్ ఉత్పత్తి హౌస్ నిర్మాణం మొదలు కావడంతో కూలీల అవసరం అయ్యింది. ఎంకమ్మత్త అక్కడ మొదట స్థిరపడగానే తమ్ముడు, మరదలు అక్కడికి చేరారు.

ఒక రోజు...

"గంగా బడికి పోవడం మానేసెయి"

**కొత్తగాలి...**

**ఓట్లువేసిన ప్రజలు**
**ఎండల్లోన**
**గెలిచిన నేతలు**
**ఏసీల్లోన**

– కందాళై రాఘవాచార్య, నిజామాబాద్

అంది తల్లి రంగి.

"ఎందుకు? "

"ఎందుకని ప్రశ్నిస్తే నేను తల్లిని కాను, నీవు బిడ్డవు కావు" అంది.

గంగకేమీ అర్థం కాలేదు. అదే విషయం ప్రశ్నించినట్టు చూస్తూ, తన ఈడు వాళ్ళందరు పోంగ తనెందుకు పోకూడదు అనుకుంది మనసులో.

"ఏంది ఆ చూపులు? చెప్పినగ బడికి బందని" అంది తల్లి.

ఈసారి కర్కశంగా అనగానే గంగ మనస్సు గిజగిజలాడింది. కళ్ళముందు బడిగేటు మూసుకుపోయినట్టు, తోటి పిల్లలంతా తనవైపే చూస్తున్నట్టు అనిపించింది. నేనెందుకు పోకూడదు అనుకుంది.

"ఎందుకో చెపితే-"

బడికి పోవద్దు అనగానే వళ్ళు చల్లబడ్డ దామెకు.

"నీకేంది చెప్పేది? పద్నాలుగేళ్ళొచ్చినయి గామాత్రం అర్థంకాదా? " గద్దించింది తల్లి.

ఆ గద్దింపుకు గుడిసె ముందు పడుకున్న పంది కదిలింది. దానిమీద అంతవరకు పడుకున్న పిల్లలు దిగి నాల్గు మూలలకు నడిచినయి. పంది గుర్రుగా పిల్లలను చూస్తు గునుస్తూ వుంది.

"సరె, బడికి బందు, ఆ తర్వాత ఏం చేయాలి? " వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటుంటే తమ ఇళ్ళల్లో ఆడపిల్లలను బడికి ఎందుకు పంపరో కొంచెం కొంచెంగా అర్థం కాసాగింది గంగకు.

"అక్కేం చేస్తోందో తెలీదూ? "

తల్లి మాటలకు మంటల్లోకి తోసినట్టు అనిపించి ఒళ్ళంతా చెమటలు పట్టినయి గంగకు.

"అమ్మో నాతోని కానిపని" అంటూ ఎడమ చేత్తో నుదిటి చెమటను అద్దుకుంది. గుండెలో పుట్టిన గుబులు సుడులు తిరిగి ఎదపై భాగంలోకి తన్నుకొచ్చి కళ్ళు తిరిగి పడిపోయింది.

తల్లి నీళ్ళు తెచ్చి ముఖాన చల్లి నులక మంచం వాల్చి పడుకోబెట్టింది. కళ్ళు తిరగడం, దుఃఖం తన్నుకొస్తూ బడి- అక్క, అక్క-బడి పదేపదే గుర్తుకు రాసాగినాయి.

తల్లి రాతెండి చెంబునిండా నీళ్లు తెచ్చిచ్చింది. అవి తాగి చెంబు కింద పెట్టింది. ఎదురుగా కూర్చున్న కుక్క తన వంకే చూస్తూ వుంది. కంచెడు నిండా ఉప్పు కలిపిన గంజిని తెచ్చి ఇచ్చింది తల్లి. తాగబుద్ధికాలేదు. వద్దన్నది. అప్పుడు అక్క పక్క గుడిసెలో చీరె మార్చుకుంటోంది.

# స్పామర్ల శత్రువు?

ఇంటర్నెట్‌లో స్పామర్లని (ఆహ్వానించని ఉత్తరాలు పంపేవారిని) నియంత్రించడానికి ఓ బాక్స్‌లో లెటర్స్‌ని టైప్ చేసే పద్ధతి వచ్చింది. ప్రకటనదారులు తమ ఉత్తరాలని అంతకుముందు చాలా ఈమెయిల్స్‌కు సింగిల్ కమాండ్‌తో పంపేవారు. కాని లెటర్స్‌ని టైప్‌చేసి పంపాలనే పద్ధతి వచ్చాక స్పామింగ్ బాగా తగ్గిపోయింది. కార్నెజీ మెల్లన్ యూనివర్సిటీలో ఈ విధానాన్ని కనిపెట్టారు. దీనిపేరు 'కాప్ట్‌చా' అంటే 'కంప్లీట్‌లీ ఆటోమేటెడ్ పబ్లిక్ ట్యూరింగ్ టెస్ట్ టు టెల్ కంప్యూటర్స్ అండ్ హ్యూమన్స్ అపార్ట్'




కాప్ట్‌చాలో అస్పష్టంగా ఉండే అంకెలు లేదా అక్షరాలు ఉంటాయి. ఓ వెబ్‌సైట్‌లోకి వెళ్లబోయే ముందు ఈ కాప్ట్‌చాని టైప్ చేసి వెళ్లాలన్న నిబంధనవల్ల మనుషులు తప్ప కంప్యూటర్ ద్వారా వాటిలోకి యంత్రాలు ప్రవేశించలేవు. అయితే ఇంటర్నెట్‌ని ఉపయోగించేవారు క్యాప్ట్‌చాని ఇష్టపడటం లేదు. ఎందుకంటే ఆ అక్షరాలు సగటు మనిషి చదవలేనంత అస్పష్టంగా ఉంటాయి. వాటిని తప్పుగా టైప్ చేస్తే, మరోసారి టైప్ చేయమని కొత్తఅక్షరాలు ప్రత్యక్షమవుతాయి. దాంతో సమయం వృధా. సగటున ఇంటర్నెట్‌యూజర్ నాలుగోసారే వాటిని సరిగ్గా టైప్ చేయగలడట. అలాగే ప్రతి పది అక్షరాల్లో రెంటిని గుర్తించడం కష్టం. వాటిని అర్థం చేసుకోవడానికే పది క్షణాలు పడుతుంది. రోజూ వేలాది పని గంటలు వృధా అవుతున్నాయి. ఇందువల్ల వెబ్‌సైట్‌లోకి వచ్చే ట్రాఫిక్ కూడా తగ్గిపోతోంది. ఫేస్‌బుక్, ట్విట్టర్‌లాంటి పాపులర్ వెబ్‌సైట్లు కాప్ట్‌చాని ఉపయోగిస్తున్నాయి. ఈ విధానాన్ని ఛేదించడం స్పామర్లకు చాలా కష్టమవుతోంది.




# దేవుళ్లకు చుక్కెదురు!

ఇటీవల బాంబే కోర్టులో హిందూ దేవుళ్ళ తరపున ఓ కేసు దాఖలైంది. ఆ దేవుళ్ల పేరిట షేర్లు కొనే అవకాశం ఇవ్వమని ఆ కేసు. తమ పేరున ట్రేడింగ్ అకౌంట్, బేంక్ అకౌంట్ తెరవడానికి అనుమతించమని గణేష్, లక్ష్మీదేవి మరికొన్ని దేవతల పేర్లమీద పిటిషన్లు దాఖలయ్యాయి.




ప్రైవేట్ రిలీజియస్ ట్రస్ట్‌వారు తాము నిర్వహించే ఆలయాల్లోని దేవుళ్ళ తరపున ఈ పిటీషన్లు దాఖలు చేశారు. మహారాష్ట్రలోని సాంగ్లీ జిల్లా రాజకుటుంబీకులు ఈ ట్రస్ట్ మెంబర్లు. ఇప్పటికే వారు ఆ దేవుళ్ళ తరపున పాన్‌కార్డులు సంపాదించి బ్యాంక్‌లో సేవింగ్స్ ఖాతాలు తెరిచారు. కానీ షేర్ల వ్యవహారం చూసే నేషనల్ సెక్యూరిటీస్ డిపాజిటరీస్ లిమిటెడ్ మాత్రం ఇలా దేవుళ్ళ పేరుమీద ట్రేడింగ్ అకౌంట్ తెరిచేందుకు అనుమతినివ్వలేదు. 'ఏదైనా నేరాలు జరిగితే దేవుళ్ళ మీద చర్యలు తీసుకోలేము కదా?' అని వారు నిరాకరించారు.

బాంబే కోర్టు ఈ కేసుని కొట్టివేస్తూ తీర్పులో ఇలా స్పష్టంగా పేర్కొంది- "దేవుళ్ళు ఆలయాల్లో పూజించడానికే ఉద్దేశించడమైనది తప్ప ఇలా వ్యాపార లావాదేవీల్లోకి లాగడానికి కాదు"

"నా మాట విను. కులవృత్తి మాని మనం బతుకలేము. తరతరాల నుండి వస్తున్నది ఇప్పుడు వద్దంటె ఎట్లా? అయినా చదువుకుని చేసేదేముంది? మన కెవరన్న నౌకరిస్తరా? అప్పుడూ ఈ పనే చేయాలి" అంది తల్లి.

"చేసేది చెయ్యనిది అప్పుడు ఆలోచించొచ్చు ఇప్పుడు అయితే చదవనీ" అంటు చేతులు జోడించింది గంగ. కనురెప్పలు నీటిచుక్కలను వొదులుతున్నయి. చదువుకు, చదువుకునే బడికి దూరమైపోతూ, వాటి స్థానంలో వ్యభిచారమా? అక్క ఎంత అవస్థపడేది చూస్తూనే వున్నది గంగ.

"అట్టేమి కుదరదు. నిన్ను చదివించడానికి నీ అయ్య ఏం సంపాదిస్తలేడు. పది పందులను చూస్కుంటే ఇల్లు గడవదు? నీవు చదువు మానేయాల్సిందే. ముందే సంవర్త అయితే ఇంటికి ముప్పు. కాబట్టి సంవర్త కాకముందే కన్నెరికం జరగాల్సిందే" తల్లి ఖరాకండిగా చెప్పంగనే మళ్ళీ వళ్ళు తిరుగసాగింది. మంచంలో అట్టనే పడుకున్నది. పొద్దు కూకెటపుడు తల్లి కల్లుతెచ్చి, తాగమని గోల చేసింది. తాగక తప్పలేదు. కల్లు తాగడం ఆ ఇండ్లలో కొత్తేమీ కాదు. కాని బాధలో ఉన్నప్పుడు తాగితే అదే బాధ ఇంకా ఎక్కువ అవుతదని ఆమెకు అప్పుడు తెలిసింది. దీపాలు ముట్టిచ్చే వేళకు తండ్రి తూలుకుంటూ వచ్చిండు. వచ్చినోడు ఉన్నడా అంటే లేడు. 'నేను పెద్ద దానింటికి పోతున్న' అని చెప్పి చివరి గుడిసెవైపు నడిచిండు.

నదిలోని నీళ్లు వెండి మెరిసినట్టు మెరుస్తున్నాయి. అంతటా పిండారపోసినట్లు వెన్నెల. వెళ్ళి ఆ నీటిలో కలిసిపోతే ఈ బాధలు ఉండవనుకుంది గంగ.

తండ్రికి ముగ్గురు భార్యలు. ఒకామె పెళ్ళి భార్య. గంగ తల్లిని మనుం కట్టుకుండట. మరొకామెను ఉంచుకున్నడట. ఎవరి గుడిసెల్లో వాళ్లుంటరు. మొదటామెకు పిల్లలు లేరు. అక్కను సాదుకుంటున్నది. ఉంచుకున్నామెకు పిల్లలు కాకుండా పసరు పోపిచ్చిండట. ఆమె వయస్సు గంగ తండ్రికి ఓ అదును, ఆదాయం. పొద్దంతా తాగుడు.. పనిలేని తిరుగుడు.

ఆ రాత్రి గంగకు నిద్రపట్టలేదు. తెల్లవారుజామున ఎటన్న పారిపోవాలనిపించింది. పారిపోతే మాత్రం తల్లి వదులుతదా? పట్టి తెప్పించదూ? సినిమాల్లో ఈ పనిచేయించేవాళ్లు ఎట్లా చేసేది చూస్తలేం. పోలీసులు, రౌడీలు వాళ్లవైపేనన్నది గుర్తొచ్చి పారిపోయే ఆలోచనను విరమించుకుంది. అయినా పోతే ఎక్కడికి పోవాలి?

గంగ తెల్లతెల్లవారంగ గుడిసె ముందు పడుకున్న అమ్మ కాళ్లు పట్టుకొని బతిమిలాడింది. తల్లి ఎదమీద తల వాల్చుకుని ఏడ్చింది. అట్లా ఇద్దరూ పేగు బంధంతో కాసేపు వుండి, ఒకరి కన్నీరు ఒకరు తుడ్చుకున్నరు. గుడిసె ముందు పడుకున్న కుక్క కళ్లు తెరిచి గునిసి మళ్లీ కళ్లు మూసుకుంది. అవును ఈ ఆచారాలు ఎందుకింత దారుణంగా ఉన్నయి. పోగా ఆడపిల్లలకే ఇన్ని అవస్థలు ఎందుకు?

"ఏడవకు, ఆడదాని బతుకే అంత. ఏడిస్తే ఏమొస్తది?" అంటూ తల్లి లేచి పందుల తొట్టివైపు నడిచి, అందులో ఇన్ని నీళ్లు పోసింది. తర్వాత గుడిసెలోకి నడిచి, చేటతో తౌడు తెచ్చి పోసి కల్పింది. అది చూసి పంది గుర్ గుర్‌మంది. చుట్టుపక్కల వున్న తన గున్నలు వచ్చి తొట్టిలో మూతులను ముంచి గుర్, గుర్‌మని తాగుతూ తోకలను ఆడిస్తున్నయి. వాటిని చూసిన కుక్క గునుస్తూ 'రాత్రంతా కాపల వుంటె నాకింత గంజిలేదు. ఎక్కడెక్కడో తిరిగొచ్చిన వాటికి కుడితా?' అనుకున్న

ట్టుంది. కాని అవి ఆదాయాన్ని తెచ్చిపెట్టె సంగతి దానికి తట్టదుకదా? గునుస్తూనే కళ్లు మూసుకుంది.

గుడిసె పక్కన ఓ కానుగచెట్టు. అది చిక్కగ, పచ్చగా వుంది. అది ఎండ వానలకు గొడుగులాగా పనిచేస్తుంది. దానికిందనే కట్టెల పొయ్యి. ఆ పొయ్యిమీదే మంచి కడవ. అందులో నీళ్లుపోసి కింద మంట ఏసింది. ఎండుకంప కట్టెపుల్లలు భగభగ మండుతున్నయి. ఆ సర్కార్ కంపచెట్లు పేదోళ్లకు మహామంచి వంట చెరకు. కడవలో నీళ్లు సలసల మసులుతున్నయి గంగ మనసులాగ. బడి గుర్తొచ్చినపుడల్లా దుఃఖం ఆగడం లేదు. ఆ రాత్రి నిద్ర సరిగా లేదు. భయంకరమైన కల! ఓ అడవిలో చెట్టుకింద కూర్చున్నది గంగ. ఎక్కడి నుండో ఒక కొండముచ్చు వచ్చి మీద పడి జాకెట్‌ను చింపింది. పరికిణి గుంజేసింది. అది చేసిన గాయానికి రక్తమే రక్తం. భయంతో కళ్లు తెరిచి చూడగా ఎదురుగా ఏమీలేదు. అయినా ఒంట్లో వణుకుపోలేదు. కాని తన ఒంట్లో వచ్చిన మార్పును చూసి నవ్వుకుంది. అమ్మ చూస్తే ఇంకేమన్న ఉందా? లేచి పరికిణి మార్చుకుని పడుకున్నదన్నమాటే కాని పూర్తిగా నిద్రకు దూరమయింది.

పొద్దునే అందరి బట్టలు తీసుకుని ఏట్లోకి పోయింది. పొద్దు బారెడెక్కింది చలిపోయి నులి వెచ్చతనం అంతట ఆవరిస్తుంది. సరిగ్గా జమున అప్పుడే ఎక్కడి నుండో వస్తుంది. ఆమె ముఖం పొద్దుతిరుగుడు పూవులా వుంది. కాని జుట్టు చెదిరింది. నుదుట బొట్టు తడిసి అటు ఇటు పిగిలి ఎండిపోయింది. నిద్ర సరిగ్గా లేనట్టుంది. ముఖం అంతా గుంజుకపోయినట్టుంది. నలిగినట్టున్నా ఎంత అందంగా వుందీ? పుత్తడిబొమ్మలాంటి జమునను అమ్మే పాడుచేసింది. తననూ అట్టానె చేయాలని చూస్తూ వుంది. ఏమన్న అంటె కులవృత్తి కులవృత్తి అంటది. రాత్రి సంగతి తెలిస్తే రాసి రంపాన పెడుతది అనుకుంది. అంతలో అక్కకు జరిగిన అన్యాయం గుర్తొచ్చింది.

ఆ రోజు దగ్గరి చుట్టపక్కాలు, అమ్మలక్కలు వచ్చిండ్రు. ఆడమగ కలిసి కానుగ చెట్టుకిందనే సారాను తాగుతూ కాల్చిన పంది వార్లను తిన్నరు. మధ్యాహ్న భోజనాలు అయినాక గుడిసెలో చాప పరిచి, అందర్కి బొట్టు పెట్టిండ్రు. మధ్యన చిన్న పీట మీద జమునను కూర్చోపెట్టిండ్రు. అప్పటికే తలంటు స్నానం చేయించి జడలో పూలు, మెడకింద గంధం అద్దిండ్రు. ఒళ్ళో కొత్తబట్టలుంచిండ్రు. దోసిటిలో బట్టలుతో లేచి చుట్టూర చూస్తూ దండం పెట్టింది. అందరు చేతులెత్తి 'సరె' అన్నట్టు చూసారు. పక్కగుడిసెలోకి తీసుకెళ్లి కొత్తబట్టలు కట్టించి కాళ్లకు పసుపు పెట్టి, పాదాలకు కుంకుమ చారలు గీసి మళ్ళీ తీసుకొచ్చింది మేనత్త. అందరు మట్టి కంచుల్లలో మరోసారి సార తాగిండ్రు. అంతకు ముందే కానుగు చెట్టు కింద మేనమామను తీసుకొచ్చి ఆయన పాదాలకు పసుపుపెట్టి ఇద్దరి మీద తలంబ్రాలు చల్లి, ఒకరి కాలు మరొకరితో తొక్కించగానే అందరు లేచి నిలుచున్నరు.

## కొత్తగాలి...

**ప్రభుత్వం**
**మంత్రులకు గుప్తనిధి**
**అధికారులకు కామధేనువు**
**ప్రజలకు తెల్లఏనుగు**

– ఇంద్రగంటి నరసింహమూర్తి,
కాకినాడ

అంతే! మనువు అయిపోయిందంటూ బయటికి నడిచింగ్రు. ఈ తతంగం పూర్తి అయ్యేసరికి పొద్దు పడమటికొంగింది. గుడిసెలో నుండి బయటికొస్తున్న వాళ్ల తల్లి రాత్రికి ఇంటికి రానున్న పెద్దమనిషి గురించి చెపుతుంటె విని 'అదృష్టం, అదృష్టం' అంటు ఆడ మొగా తలలాడించింగ్రు. కులపెద్ద చేతిలో తల్లి కొంత పైకం వుంచగానే నవ్వు ముఖంతో అతను కదిలిండు. అతని వెంట అందరు కదిలింగ్రు. వాళ్ల వెనకాల మామ కూడ. అప్పటిదాకా అక్కడే అటు ఇటు తిరిగిన తండ్రి తన మొదటి భార్య ఇంటి దగ్గర బాగా తాగి ధ్యాసలేకుంట పడుకుండట.

దీపాలు పెట్టేవేళ ఓ మనిషి- అతని వెనకాల బుట్టలతో, బట్టలతో మరో నడీడు మనిషి. అన్నీ తెచ్చి గుడిసెలోని నులక మంచం మీదుంచి అతను వెనుతిరిగిపోయిండు. అప్పటివరకు కానుగుచెట్టుకింద నిలుచున్న వ్యక్తిని తల్లి గుడిసెలోకి తీసుకెళ్లింది. అతని వయస్సు జమున వయస్సుకంటే మూడింతలు ఎక్కువే అనిపించింది. అతని వెనకాలే గంగ వెళ్లి గుడిసెలోకి తొంగిచూసింది. జమున ఏడుస్తూ కూర్చుంది. ఆమె ఒడిలో కొత్తబట్టలు, రూపాయలకట్టలు. పండ్లు, మిఠాయి. పక్కన నుండి తొంగి చూసె గంగను కసిరి అమ్మ "మేనత్తోలింటి దగ్గర పడుకోపో. నేనూ అక్కడికే వస్తున్న" అన్నది. అంతేకాదు అక్కడి నుండి కదిలిందాక వదలలేదు.

అట్టా ఆ రాత్రి గడిసింది.

పొద్దున్నే కన్నీటి చారలు కట్టిన చెంపలు. చిందర వందరైన జుట్టు, గింజలు నలిచిన కంకిలాగ ఉంది. అందరికి మొదటి రాత్రి మధుర రాత్రి అయితే కులపు ఆడపిల్లలకు రాక్షస రాత్రి. కాట్లు గీట్లతో శరీరం పుండైపోతుంది. ఆరోజు నుండి జమున మకాం పక్క గుడిసెలోకి మారింది. పెళ్లి చేసుకుని అత్తగారింటికి వెళ్లాల్సిన ఆమె అక్కడే ఏడుస్తూ ఆ గుడిసెలోనే ఉండిపోయింది.

ఇదంతా గుర్తొచ్చేసరికె దుఃఖం తన్నుకొచ్చింది గంగకు. నేలన కట్టెపుల్లతో గీతలు గీస్తూ కూర్చుంది.

"లే జాలారిలోకి నడువు" అంది తల్లి.

గంగ లేవలేదు.

జుట్టుపట్టి గుంజి లేపి, జాలారిలోకి నెట్టి మేనత్తను పిలిచింది తల్లి. అంతకుముందే ఆమెకు చెప్పివుంచినట్టుంది.

"ఏందే పిల్లా.. తలంటుపోసుకునెదానికి" అంటు వచ్చి భుజాలమీద చేతులుంచి జాలారివైపు తీసుకుపోయింది మేనత్త. మూడు వైపుల పాతరేకులు, ఒకవైపు పాత చాప, నిల్చుంటే బయటివాళ్లకు కనిపిస్తరు. కూర్చుంటె తల కనిపిస్తది. అది ఆ జాలారి. బలవంతంగా గంగను అందులో కూర్చుబెట్టింగ్రు. చివరిగుడిసెలు కనుక జనం రాకపోకలు తక్కువ. వచ్చే వాళ్లు వచ్చే వేళకు వచ్చిపోతూనే వుంటరు.

జాలారిలో అత్త గంగ బట్టలన్నీ ఊడదీసింది. రెండు చేతులతో ఎదభాగాన్ని కప్పుకుని గువ్వలా ముడుచుకు కూర్చుంది గంగ. ఒళ్ళంతా నలుగు రుద్దుతుంటె సిగ్గుతో మెలికలు తిరిగిపోతున్నది. తడిక

## కొత్తగాలి... 

**నాటి గాంధీజీది**
**విదేశీవస్తు బహిష్కరణ**
**నేటి గాంధీలది**
**విదేశీవస్తు ఆవిష్కరణ**

– *రావి రంగారావు*, మచిలీపట్నం

దగ్గర ఏదో చప్పుడైతే పరికిణిని గుంజుకుని మీద కప్పుకున్నది.

"ఎందే అంత ఉలుకు! పంది తడికను రాసుకుంది అంతే" అంది అత్త.

"ఆ ఇండ్లల్లో ఆడవాళ్లంతా బరిబత్తలనె స్నానం చేస్తుంటరు. అప్పుడు ఒక స్త్రీని మరొక స్త్రీ నిలువెల్ల చూడక తప్పదు, చూస్తా వుంటారు. వీపురాస్తుంటె ఏం అనిపించలేదు కాని ఎదభాగాన చేతులను కదలిస్తుంటె చెప్పలేని సిగ్గు. అప్పుడు అత్త ముఖంలోకి చూసింది గంగ. ఆమె పెదవులు అదురుతున్నయి. ఆమె చేతులు అక్కడే తచ్చాడుతూ, "ఏమే గంగ ఇంత వొల్లు చేసినవు. అందుకే మీ అమ్మ తొందర పడుతుంది. బంగారంలాగ మెరిసిపోతున్న నీవొల్లు ఈ ఇంట్లో లక్ష్మీదేవినీ తెచ్చి నిలిపేటట్టుంది" అంటూ రెండు చేతుల వేళ్లను తలకు ఆనించి మెటికలను ఇరుచుకుంది. ఆమె తొడలవైపు చూసి అయింది గుర్తుపడతదేమో అని భయమేసి "అత్త తొందరగ కానీయి చలి పెడుతుంది" అన్నది గంగ.

"ఈ పసుపు ఊడొద్దే" అంటు ముంతెడు నీళ్లు గుమ్మరిచ్చి బుగ్గలను అదిమి ముద్దు పెట్టుకుంటూ "నీ అమ్మ గూడ వయస్సులో ఇట్లాగే వుండేది. నీలాగే దాని పెదవులు లావుగా ఉండేవి. అది తమలపాకు వేస్తే ఎర్రగా పండేది. ఆ పండిన పెదవులు చూసిన మగాడు మరీ ఇదైపోతడే గంగా. రేపు నీవు.." అని ఆగింది. గంగ లేచి నిలుచోగ "తొడలను పిక్కెలను తోముకో" అంది. బతికిచ్చినవు తల్లి అనుకుంటు గబాగబా తోముకుంటున్నప్పుడు మరో ముంతెడు గుమ్మరిస్తునే గంగను నిలువెల్ల చూస్తువుంది అత్త.

"అయ్యిందా వొదినా? " అన్న మాట విని "ఇక పద" అంది అత్త.

ఆమె అందించిన పాతచీరె గుడ్డను చుట్టుకొని బయటికొచ్చింది. గుడ్డ మరో కొనసు గుండెల మీద పరుచుకున్నది. గుడిసెముందున్న నులక మంచంమీద గంగను కూర్చోపెట్టి నెత్తిని పొడిగుడ్డతో తుడిచి జుత్తును మరో గుడ్డలో వుంచి తాడులాగ పేనింది అత్త. అప్పుడు ఆ తడిని గుడ్డగుంజుకుంటుంది.

పొద్దు బారెడెక్కింది.

సూర్యకిరణాలు వంటిమీద పడి కొలిమి నిప్పుల్లో బంగారం మరింత కాంతిగ కనిపించినట్టు కనిపిస్తున్నదని ఆడపడుచు చెప్పగానే, పొయ్యి దగ్గరికి నడిచి రొట్టె పెంకు మసిని చూపుడు వేలుకు అంటించుకుని తెచ్చి బుగ్గమీద చుక్కలాగుంచి, రెండు చేతులతో గంగ బుగ్గలను తాకి తన నెత్తికి ఆనించి మెటికలను ఇరుచుకుంది తల్లి.

"ఇది కుందనపు బొమ్మే" అంది అత్త.

గంగ వెళ్లి సూర్యునికి ఎదురుగా నిలుచున్నది.

"ఏం కుందనపు బొమ్మో పుటుక్కున సంవర్త అయ్యేనా రేటు పడిపోతదొదిన. ముందే అయితే కలిసొస్తది. బడికి పోతుంటె రోజూ చూస్తు గుటకలు వేసే ఒకాయన మొన్న పిలిపించి అడిగిండు. నీవు వూ అంటే నేను రెడి అన్నడు. పెద్ద కాంట్రాక్టర్. కులం తమిళ కోమటి. మనిషి కాస్త మెత్తగుంటడు. నలబై దాటినట్టుంది" అంది రంగి.

గంగకు ఆ మాట వినగానే వంట్లో వణుకు వచ్చింది. మొన్న రాత్రి పరికిణి తడిసింది తల్లికి తెలియదు. తెలిస్తే ఇంకేమైనా వుందా? ఆ మూడు రోజులు ఆమె చూపులను తప్పించుకోవడం ఎంత కష్టమైంది. ఆ రోజుల్లో గంగకు రొమ్ములు నొప్పి పెట్టినయి.. చెప్పాలనుకున్నా చెపితే ఏంగోల చేస్తదనే చెప్పలేకపోయింది. వయస్సు వస్తుంటే ఆడపిల్ల శరీరంలో

వచ్చే మార్పులు ఎన్నో! వాటిని దాయడం కుదురదు. ఎంత దాచినా ఏదో ఒకటి బయటపడుతూనే ఉంటది.

"దాటితె దాటె. ఏమన్న పెళ్లా ఈడు జోడు చూడడానికి? ఒకపూట ఒప్పందానికి అవన్నీ మనకెందుకు? ఎంతిస్తడేమి" అడిగింది ఆడపడుచు.

"బాగానె ఇస్తనండు, బంగారం పెడతన్నడు. తనతోనే ఉంటే అడిగినంత అన్నడు, చచ్చిందాక సాదుతన్నడు" అంది.

"రేపో మాపో అయెటట్టుంది. దాని ముక్కు చూసినవా ఎరుపెక్కుతుంది" అంది అత్త తన అనుభవాన్ని జోడిస్తూ.

> **కొత్తగాలి...**
>
> **ఎన్నికలప్పుడు ఓటుగొడవ**
> **ఎన్నికయ్యాక సీటుగొడవ**
> **అసెంబ్లీలో బహిష్కరణగొడవ**
> **ఎప్పుడు పట్టేది ప్రజలగొడవ**
>
> – పట్ల యాదగిరి, గుండాల, నల్గొండ జిల్లా

"రాత్రికి ఏర్పాటు చేద్దాం అంటే.. లేదు పగలె కావాలన్నడు. తనకు పాలు, పండ్లు వద్దట. బీర్లు పెట్టమన్నడు. తను కొత్త బట్టలు కొనుక్కుంటడట. నాకు మీ తమ్మునికి బట్టలు తీసుకున్నడట. గంగ మెడలో బంగారు గొలుసు ఏస్తనన్నడు. ఎంతైన పెద్ద కాంట్రాక్టర్. డబ్బులున్నోడు. మన గంగ అదృష్టవంతురాలే" అంది తల్లి.

"అదట్టా రాసుకుని వొచ్చింది. నన్నైతే ఓ పల్లెటూరోనితో కల్పింద్రు. కొంగున ఓ రాగిపైస కట్టినట్టు గుర్తు" అంటు తన గతాన్ని తల్చుకున్నట్లు ముఖం పెట్టింది ఎంకమ్మ.

అప్పుడే రెండు ఊరపిచ్చికలు వచ్చి జాలారీ రేకుమీద వాలి కిచకిచ శబ్దం చేస్తున్నయి.

"నాకు మాత్రం, మనయే అద్వాన్నపు బతుకులు" అంది రంగి.

"అప్పుడు ఆ కన్నె పడే బాధ ఆ ముఖం మీద కదులుతుంటే చూస్తూ మురిసిపోవడం అదీ మగబుద్ధి. ఆడది అట్టాకాదు మొగ్గ పూవు అవుతున్నప్పుడు తుమ్మెద వచ్చి చుట్టుతిరిగి వాలి సప్పరిస్తది కదా. ఓ యువతి గూడ అట్టాటి కలయికనే కోరుకుంటూ బతుకంతా గుర్తుపెట్టుకుంటుంది. కాని బలవంతపు కన్నెరికాలతో ఓ మాదిరి భయం జొరబడి ఆ కార్యాన్నే అస్సయించుకుంటు వుంటది. ఏదో పొట్టకోసం బట్టలు ఇప్పుకుంటున్నం. బలవంతంగా పడుకుంటున్నం. లేచి కూర్చోగానే అతను వెళ్లిపోతడు. అతనితోపాటు అతని జ్ఞాపకాలు గడప దాటుతయి, అంతే. మనతో బతుకా ఏమన్ననా? మన దగ్గరికొచ్చే ప్రతి ఒక్కడూ తన కోరిక తీర్చుకుని పోతాడే, మనకు కోరికలుంటయని వానికేం తెలుసు. ఒకవేళ ఉన్నవని తెలిసినా వాడెందుకు పట్టించుకుంటడు. ఎవడో ఒక్కడు వర్షంలో మెరుపు మెరిసినట్టు మనసార కల్సినపుడే కదా తృప్తి చెందేది. పోనీ మన గురించి మనం ఆలోచిస్తే వొచ్చేదిలేదు, వొరిగేది లేదు" అంది ఎంకమ్మ భారంగా.

★ ★ ★

ఒకరోజు గంగ, జమున ఫైలాన్ బస్టాండుకు వెళుతువున్నరు. ఫైలాన్ చౌరస్తలో ఓ పక్కన చెత్రంజీ పర్చి దాని పక్కన అటు రెండు కర్రలు ఇటు రెండు కర్రలపైన ఒకదానికి మరొకటి కట్టి కత్తెరలాగ, నిల్చోపెట్టి ఒకదానికి మరొకదానికి ఓ తాడును కట్టివుంచింద్రు. ఓ నలుబదేండ్ల వ్యక్తి దాని ముందు కోతితో ఫీట్స్ చేయించి ఆ తరువాత తన ఏడేండ్ల కొడు

కుతో గంతులు వేయిస్తున్నడు. ఆయన భార్య డోల్ వాయిస్తుంది. ఆ చప్పుడుకు జనం అక్కడికి చేరుతున్నరు.

"ఏం కాంతం, ఎందుకలా డోల్ వాయిస్తున్నవు" అడిగిండు భర్త.

"జనం మన ఆట చూసేందుకు" అంటూ మరింత గట్టిగా వాయించింది భార్య. అప్పటి వరకు తండ్రి చాటున నిలుచున్న ఓ పదేళ్ల అమ్మాయి అడ్డంగా గంతులేస్తు వచ్చి చెత్రంజీలో నిలుచున్నది. బక్క పలుచగ, ఎర్రగా వుంది. తన పిల్లికళ్లను అటు ఇటు తిప్పుతు చుట్టూర వున్న జనానికి చేతులెత్తి దండం పెట్టింది. తన పరికిణి మోకాళ్లవరకు గోచి బిగించింది.

డోల్ మోగుతుంది. తండ్రి వచ్చి తన బిడ్డవెన్నున చేయివుంచిండు. అంతే. ఆ పిల్ల ధనుస్సులాగ వంగి, వెనుకనుండి తన కాలి బొటనవేలును పట్టుకుంది. తండ్రి ఆమెను ఓ రింగులో చేయివేసి పట్టుకున్నట్టు పట్టుకుని తన చుట్టు తిప్పి ముందుకు వుంచిండు. అప్పటి వరకు గంతులేసి నిలుచున్న చిన్నోడు వచ్చి ఎగిరి అమ్మాయి కడుపుమీద నిలుచున్నడు. జనం 'అయ్యో పాపం' అంటూ చూస్తువున్నరు. కొంచంసేపటి తరువాత చిన్నోడు కిందకు దూకిండు. తండ్రి చిన్నోణ్ని తన చేతుల్లోకి తీసుకుని వాని బొడ్డు దగ్గర ఓ ఇనుపబిళ్ల వుంచి, ఆ బిళ్లకు ఓ కర్రను పెట్టిలేపి, తన ఎదమీదుంచుకుని, పైకి చూస్తూ చేతులను చాపి బేలన్సు చేస్తూ ఓ సారి చుట్టు తిరిగొచ్చిండు.

డోల్ శబ్దం మారింది. అమ్మాయి మళ్ల గంతులేస్తూ వచ్చి చెత్రంజీలో నిలుచుంది. తండ్రి వెళ్లి అమ్మాయిని తన చేతుల్లో నిలుచోపెట్టుకుని పైకిలేపి, అంతకుముందు నిలబట్టిన కర్రల దగ్గర్కి తీసుకెళ్లి ఓ కొన ముడిమీద నిలుచోపెట్టి పొడువాటి కర్రను అందించిండు. ఆ కర్రను అందుకున్న అమ్మాయి తన చేతుల్లో అడ్డంగ పెట్టుకొని ఓసారి బేలెన్స్ సరిచూసుకుంది.

డోల్ శబ్దం మారింది. అమ్మాయి ఒక కొననుండి మరొక కొనకు నడుస్తుంది. జనం ఊపిరి బిగపట్టి చూస్తున్నరు. తాడు ఊగుతూవుంది. కర్రతో బ్యాలెన్సు సరిచూసుకుంటుంది పిల్ల. ముందుకు నడవడమే కాకుండ వెనక్కు కూడా ఆమె నడుస్తుంటే జనం గుడ్లప్పగించి చూస్తున్నరు.

గంగ ఊపిరి బిగబట్టి అక్క భుజంపట్టి ఊపుతున్నది కాని అక్క తన వైపు చూడలేదు. తాడుమీది అమ్మాయిమీదే చూపు లుంచి నిలుచుంది. సరిగ్గా ఎదుటి వరుసలో ఉన్న ఓ పోకిరి అక్కవైపే రెప్పవాల్చకుండ చూస్తున్నడు. 'అక్కను ఓసారి చూసిన మొగోడు మరిమరి చూడవల్సిందే. అక్క మంచి అందగత్తె. అచ్చం అమ్మలాగే వుంటుంది. బహుశ అమ్మ గూడ ఆ వయస్సులో అట్లాగే వుండొచ్చు' అనుకుంది గంగ. తమ గుడిసెల్లో స్త్రీలు అందంగా వుంటరు. పొడుగ్గా పెద్ద పెద్ద కనుగుడ్లు, లావాటి పెదవులు, అమర్చినట్టె పలువరుస. 'ఇంట్లో ఇద్దరికీ అమ్మ పోలికలే. అంత చక్కని అక్కను మగాళ్లంత కళ్లలో పెట్టుకుంటరు. ఆట చూడటానికి గుమిగూడిన జనంలో ఎంతోమంది కళ్లు అక్కమీదే, తన మీదే! ఎదురుగా వుండి అక్కను చూసిన కొందరు తాము నిలుచున్నవైపు వచ్చి పక్కనే నిలుచోని భుజాల్ని రాసుకుంటు నడుం దగ్గర చేయి తాకిస్తున్నరు'. గంగకు కొంచెం చిరాకు వొచ్చినా జమునకు రాలేదు. కొందరు కన్నుకొట్టినా ఆమె అదోమాదిరి నవ్వేది. 'ఎక్కడుంటవు?' అని అడిగితె, 'పక్కన్నే' అంటు వోణి సరిచేసుకున్నది. అప్పుడు ఎదుటి వాని చూపులు అక్కణ్నే నిలిచేవి.

ఆట ముగిస్తున్నట్టు డోల్ శబ్దం.

అతను నిలబెట్టిన కర్రలను తొలగించి,

వాటిని ఒక్కోచోటికి చేర్చి తాడును చుట్టు తున్నడు. అమ్మాయి, బాబు గిన్నెలను చూపుతూ పైసలు అడుక్కుంటున్నరు. బడిపిల్లలు ఐదు, పది పైసలు గిన్నెల్లో వేస్తూవున్నరు. అంతేకాదు అప్పటివరకు వాళ్ళతో వున్న కోతిగూడ ఓ గిన్నె పట్టు కొని మనిషి మనిషిని అడుగుతున్నట్టు గిన్నెను చూపుతుంది.

మొత్తం మీద ఆట ముగిసింది. అనుకు న్నంత కాకున్న కొన్ని డబ్బులు పోగైనయి. భార్య చైత్రంజీని మడత పెట్టింది. అతను కావడిలో అన్నీ సర్ది భుజానికి ఎత్తుకు న్నడు. అక్కడి నుంచి మరోచోటికి వెళ్లడా నికి కదిలారు. సంచార జాతులుకదా దేశ మంతా తిరుగుతూనే వుంటరు.

అక్క చెల్లెళ్లు ఇద్దరు బస్‌స్టాండ్‌వైపు నడుస్తున్నరు.

"వాళ్ళు మన కులస్తులేనట. మిగతా కులాలకు ఉన్నట్టు కుదురుగా మనకు ఓ వృత్తంటు లేదు కదా? " అన్నది జమున.

"మన కులస్తులా? అయితే వీళ్ల బతు కుదెరువు కొంత ఫరవాలేదు" అంది గంగ.

"ఇందాక ఆ గుంపులో ఎందరు కాళ్లు తొక్కిండ్రు. ఎందరు భుజాలను రాసు కుండ్రు" అంది మళ్ళీ తానే.

"అది మామూలే. ఇప్పుడు నీవు ఇంకా వోణీ వేయలేదు. కాస్త పెద్దగై వోణీ వేస్తే సందు దొరికితె చాలు కాళ్లు తొక్కడమె కాదు.." అని ఆగింది జమున.

"అంతేనంటవా? అందుకే అమ్మ కుల వృత్తి అంటుందా? నాకు అర్థంకాక అడు గుత అదెట్లె మనవృత్తి అవుతదక్క" అడి గింది గంగ.

"అదంతే. ఆల్లట్ల చేసింద్రు మనల! చూస్త వుగ" అంది కనురెప్పలను మూస్తూ. బహుశ అప్పుడు ఆమె కనురెప్పలకింద ఎన్ని అవమానపు దృశ్యాలో?

"నీవు పెళ్లి చేసుకుంటె బాగుండేది"

"పెళ్లా. మన ఇళ్లల్లో అదంత సులువు కాదు. పోగ అమ్మ పెళ్లిచేస్తదా? " అంది జమున బాధగా.

"అంటె నీకు పెళ్లిచేసుకోవాలని ఉండెనా? "

"ఎందుకుండదు? పెళ్ళి చేసుకోవాలి, పిల్లల్ని కనాలి.. భర్తతో సుఖంగా బతకా లని ఎవరికుండదు? మన కులంలో భార్య లుగా బతకడం తక్కువ" అంటూ నిట్టూ ర్చింది జమున.

గంగ మౌనంగా నడుస్తున్నది.

అక్కకు తెలిసిన వ్యక్తి ఎదురై "ఏయ్ జమున ఎక్కడ నుండి? " అన్నాడు.

"స్తంభం దగ్గర నుండి" అంది జమున నవ్వుతూ.

"అట్టా అరనవ్వు నవ్వుతవు.. మనసార నవ్వరాదె. కండ్ల సంబూరంగ" అన్నడు అ తను నవ్వుతూ.

"ఎవళక్క ఆయన? "

"శివ అని సినిమా టాకీసు మీదుం టడు.. చూడలేదా ఎప్పుడు? "

"అమ్మ నన్ను సినిమాకు పోనిస్తేనా? "

అతను నవ్వుతూ వాళ్లతో కల్సి నడక సాగించిండు.

ఇద్దరు ఇల్లు చేరేసరికి దీపాల వేళ యింది. గుడిసె ముందు ఎంకమ్మత్త ఆందోళనగా నిలుచుంది. వీళ్లను చూడ గానే "ఎటు ఎల్లింద్రే ఇక్కడ గుడిసెలు తగలబడుతుంటే" అంది ఆతురతగా.

"ఏమైందత్త? " జమున అడిగింది.

"ఏమైందా మీ పెద్దమ్మను తగలపె ట్టింద్రు"

ఇద్దరు అర్థంకానట్టు చూసింద్రు.

"ఒంటిగంటకు ఇద్దరు, సార సీసాతో వచ్చి పూటంతా తిని తాగింద్రు, తాగిం చింద్రు. ఒకరెనుక ఒకరు ఐదు వరకు గుడిసెలనే గడిపి, ఇక పోతం అన్నరట. పోతం అనంగానే మీ పెద్దమ్మ పైసలు

అడిగిందట. 'మాతోపాటె తాగి తింటివి ఇంక పైసలెక్కడివి' అన్నరట. 'అట్టెట్ట' అని ఆపిందట. అంతే పడేసి తొడల మధ్య సిగరెట్లతో కాల్చిండ్రట. కేక లేయం గనే అందరం వస్తనేవున్నం. వాళ్లు కనప డకుంటపోయిరి"

"మరిప్పుడు పెద్దమ్మ ఏది? దవాఖా నాకు తీసుకపోయిండ్రా? "

"దవాఖానాకు తీసుకెల్తె పోలీసు కేసైత దని ఆరెంపి ఇంటికి తీసుకపోయిండ్రు" అంది ఎంకమ్మత్త.

జమున కళ్లు చెమ్మగిల్లాయి. తడయిన ముక్కును వోణితో తుడ్చుకుంది.

"ఏం బతుకులో దిక్కులేని బతుకులు" అంది గంగ విస్తుబోతూ.

గిందుకే తాను ఈ వృత్తిలోకి దిగను అనుకుంది గంగ మనసులో దృఢంగా.

★ ★ ★

గంగ బడిమానేయంగానే తల్లి వృత్తిలోకి దిగమని బలవంతపెడుతూ ఉండేది. దిగ కపోతే కూడు గుడ్డకు కష్టమైతదని వొర్లుతూ ఉండేది. అంతేకాదు తామెట్లా బతకాలని అడుగుతుండేది. ఆ ఇండ్లల్లో ఆడపిల్ల పుడితె పండుగే చేసుకుంటరు. బాతు బంగారు గుడ్డునిస్తదని మురుస్తరు. మచ్చుమరక కాకుండా పెంచుతు వస్తరు. నాజూకు నడకను నేర్పుతువస్తరు. గంగను అట్లానె పెంచిండ్రు.

"నా బడిని మానిపించిండ్రుకదా నేనైతె కులవృత్తి చేయ. కావాలంటె కూలిచేసి తేగలను" అన్నది గంగ.

"రోజు కూలి ఎంతొస్తదే? అర్ధ, పావలే ఐదు పద్దైతే రావు కదా" అంది తల్లి.

అయినా గంగ కూలికే పోతున్నది. చదువుకున్నది కనుక మొరటుపని మాలు కలపడం, రాయిని మోయడం చేయలేకపో వడం చూసిన కంట్రాక్టర్ నాయుడు దయ తలచి 'నీవు బరువుపనులు ఏంచేయ్యొద్దు, చేసిన సిమెంట్ మీద నీళ్లు చల్లుతువుండు' అని అలకటిపనిలో పెట్టిండు. కూలి ఇచ్చె టపుడు ఒకటి అర ఎక్కువ కూడా ఇస్తుంటే 'కూలి డబ్బులు ఎక్కువొస్తు న్నయి' అంటె 'అట్టానా అయితె వుంచుకో' అంటు నవ్వుతుండేవాడు. అతను నవ్వితే పచ్చిపాల నురుగులాగుండేది. ఆ నవ్వును కాసేపు చూసి సిగ్గుతో తలవంచుకునేది గంగ. రానురాను అతని నవ్వులో ఏదో మత్తు కమ్ముకొని వుండేది. అప్పుడతని కళ్లు ఏదో సైగ చేస్తుండేవి. చెట్టు పెరు గుతూ ముదురుతుంటె ఆ చెట్టు తాలూకు రుచి, వాసన ఆకుల్లో కొమ్మల్లో కొట్టినట్టు గంగలోను కన్నెతనపు సిగ్గు, ఆకర్షణ కలు పుకుని పెరుగుతున్నయి. గాలికి ఆకులు, కొమ్మలు కదిలినట్టు ఇష్టమైన మగవాని చూపులకు వంట్లో కొత్త కోరికలు కది లేయి. సరిగ్గా అప్పుడే ఓసారి సిమెంటు గోదాములో నాయుడు గంగను కౌగిలించు కుండు. అప్పుడు గుర్తొచ్చి అతనితో "నాకో షేప్ బాడీ తేవా? " అన్నది, సిగ్గును మెల్లగా మెల్లగా వదులుతూ.

## కొత్తగాలి...



**అటు పెట్రోమంట**
**ఇటు 'బండ'**
**ఎండతో పాటు**
**బాదుడు**

– ఎస్. సూర్యకుమారి,
సికింద్రాబాద్

"సరె" అని మూలిగినట్టన్నడు.

మగవాని కౌగిలిలో కన్నెపిల్ల ఉంటే అంత మత్తు ఉంటుందని మొదటిసారి తెలుసుకున్నది గంగ. మరునాడు షేప్ బాడి తెచ్చి సిమెంట్ గదిలోకి పిలిచి

"చేతులు పైకెత్తమని" తానె బాడిని తొడిగి వెనక హుక్స్‌ను పెట్టిండు. అట్లా ఇద్దరి మధ్య దగ్గరితనం పెరిగింది. ఓరోజు పువ్వులు, ఓరోజు స్వీట్స్ అదో ఇదో తెస్తూ వుండేవాడు. రోజులు నెలలు గడుస్తున్నయి. నీళ్ల చెంబులోనూ, తినే పళ్ళెంలోనూ, పైన మబ్బుల్లోనూ, ఆఖరికి చందమామలోనూ అతని ముఖమే! అతని నవ్వులే కనిపిస్తున్నయి గంగకు.

తల్లి ఆరాటం ఆగనేలేదు.

"రోజంతపోయి పావల పరక తెస్తే ఎట్లెల్లుతది? " అంటూ గులుగుతూవుండేది. 'వాడంతిస్తడు.. వీడింతిస్తడు' అని ఊరిస్తూండేది. ఎవరెవరికో ఏమేమో చెప్పి గుడిసెదాకా తీసుకొచ్చేది. చీకట్లో ఈమె అని జమునను చూపించి డబ్బు గుంజుతుండేది. అందరికి మొదటిరాత్రి ఒక్కటైతే జమునకు లెక్కలేనన్ని. మగవాడు తాగి తడిపిస్తడు. అదే అదును. ఏముంది గ్లాసేడు పాలు పండ్లేకదా? బట్టబాత వాడే తెస్తుండే.

గంగను వృత్తిలోకి దించాలని తల్లి చేస్తున్న ప్రయత్నం ఇంతా అంతా కాదు. ఆరోజు అత్త స్నానం చేయించి, నెత్తిన పేలుచూసి ఏరి కుక్కింది. 'తీపి నెత్తి' అని ఓ ముట్టికాయె గూడ పెట్టింది. నెత్తిని చలిగంజితో తడుపుకుంటున్నందుకో ఏమో నెత్తిన పేలుండకపోతే ఏముంటయి? వారానికోసారన్నా నూనె అద్దుడు లేదాయె! అప్పుడప్పుడు తుంగ ఏర్లను దంచి నెత్తికి మేగుతు వుండేది. అట్లా మేగితే పేలు పడవంటరు కాని వాళ్లకు అట్టేమి అనిపించలేదు. పేలు పడుతూనే వుండేవి.

ఓ రోజు తల్లి, అత్త మాట్లాడుకునేది గంగ చెవిన పడ్డది.

"అవును వదిన ఆ నూనె దాని మాడుకు రాసినవా? "

"ఆ, రాసినా"

"ఇక దాని రోగం కుదురుతది. ఆన్నే తలుచుకుంటూ ఆని చుట్టే తిరుగుతది"

"అంతేనంటవా? "

"అంతేమరి. ఆ నూనె ఎట్లా తయారుచేసిననుకున్నవు.. నీళ్లలో తిరిగే పురుగును తెచ్చి కొత్తగురిగిలో మాడ్చి, పొడిచేసి ఆ మొగోని మూత్రం పట్టుకొచ్చి అందులో కలిపి, గురిగిని ఏడురోజులు భూమిలో పాతివుంచి, మక్కినంక నూనెలో కలిపి నీకిచ్చిన, దానిని మాడుకు రాస్తే ఇగ వాని చుట్టే తిరుగుడు సుమా" అంది.

"ఏమో చూడాలి మరీ.. నీవిచ్చిన నూనె అయితే దాని మాడుకు మర్ధన చేసిన"

"ఇగ చూసుకో మరీ.. అది ఈకలు పీకిన చిలకే అనుకో"

ఈ మాటలు వినగానే గంగ గుండెలో గుబులు జొరబడింది.

'అమ్మ రాక్షసి! ఎంత పని చేసినవే' అని అరవాలనిపించింది. కాని అయిపోయినంకా అరిచితే ఏమొస్తది. 'మరుగు మందు ఉంటదా' అని పెద్దమ్మను అడిగింది. 'ఉంటదటా' అంది. అట్టనే చిన్నమ్మను అడిగింది. 'ఉంటది' అంది. 'అది పెట్టేకదా మీ అయ్యా నన్ను లోబరుచుకున్నది' అంది. ఇక చూడు గంగ ఆలోచనలు అన్నీ ఈ మరుగుమందు మీదనే. ఆలోచించి ఆలోచించి ఎట్లా కావలసింది

## కొత్తగాలి...

**కాగితం పూలు**
**అందానికి, ఆకర్షణకి**
**సాఫ్ట్‌వేర్ ఇంజినీర్**
**జీతానికి, హోదాకి**

– సి హెచ్. గోపీకళ, నిజామాబాద్

అట్టయితదని మొండిధైర్యం తెచ్చుకున్నది.

తల్లి, అత్త ఆరోజు తయారుచేస్తువుంటే గంగ కడుపులో భయం జొరపడుతూనే వుండే. అది ఇది అంటుండగానే ఓ తమిళ కాంట్రాక్టర్ రానే వచ్చిండు.

అతన్ని చూసి ఎదురుగా కుడితి తొట్టి దగ్గర పడుకున్న పంది 'గుర్‌గుర్' అంటులేచి పక్కకు పోయింది. దాని వెను కాల దాని గున్నలు. అప్పుడు కుక్కలేదు. ఆ కుక్కది ఓ పనిలేని పరుగు రుచిలేని నాకుడు! ఎక్కడ పోయిందో వాడంతా దానిదేనాయే.

అతని వెనకాల లాంచనాలతో మరో మనిషి వాటిని అక్కడుంచి వెళ్ళిపో యిండు. అతను నల్లగ నలభై ఏళ్ళ వయ స్సువాడు. ఆకు నవలడంవల్లా అతని పళ్ళు, పెదవులు గారపట్టి అసహ్యంగా కని పిస్తున్నయి. వాల్చిన నులకమంచంమీద కూర్చోని గంగను మింగేటట్టు చూస్తువు న్నడు. మధ్య మధ్య పళ్ళిగిలిస్తున్నడు. ఎరువు, నలుపు కలిసిన ఆయన నోటిలోని చిగుర్లు చూడడానికి అసహ్యంగా ఉన్నవి. అది ఆయనకు తెలుసో తెలియదో అయినా మాటి మాటికి ఇగిలిస్తూనే వున్నడు. అప్పుడు నాయుడు పలువరస గుర్తొచ్చి గంగ ముఖం మీద నవ్వు పూసింది. అది చూసిన ఆ తమిళ మనిషి ఆకులు తెమ్మని అమ్మను బయటికి పంపిండు. చుట్టుచూసి దగ్గరికొచ్చి భుజా లమీద చేయివేస్తే ఎలుగ్గొడ్డులాగ కనిపిం చిండు. దగ్గరికొస్తు ఇగిలిస్తుంటే తోడేలు మీద పడ్డట్టు అనిపించి గంగ చేతులను ఎదమీద బిగించుకొని పక్కన నిలుచు న్నది. అయినా అతను తననే చూస్తు న్నడు. లుంగి పైకని నిలుచుంటే పాదాల పైనుండి పిక్కలు దాటి మడతల వరకు నరాలు తేలి ఉండడం చూడగానే వంట్లో వణుకొచ్చి కళ్ళు మూసుకొని నాయుడును గుర్తు చేసుకుంది.

సరిగ్గా అప్పుడే గుడిసెముందు సైకిల్ మోటార్ హారన్ మోగింది. పరుగులాంటి నడకతో వెళ్ళి దాని వెనక కూర్చున్నది. అంతే! అది పరుగెత్తి పరుగెత్తి ఎత్తిపోతల దగ్గర ఆగింది.

బండి దిగి నాయుడు ఎదమీద వాలిపో యింది గంగ. ఎత్తిపోతల నీటినురుగు లాగె వాళ్ళ ఎదలో సంతోషపు పొంగులు! బండిని అక్కడుంచి ఆ అడవిలో ఇష్టమొ చ్చినట్టు తిరిగిండ్రు. పొద్దు పడమటికి వంగేటప్పుడు ఓ గిరిజన దేవత గుడి ముందు ఆగి, మొదట గుడిచుట్టు తిరి గారు. పందిట్లో నిలుచోని గుడిలోని దేవ తకు దండం పెట్టుకున్నరు.

ఆ గుడిలో దేవత వాళ్లవైపు చూస్తు న్నట్లు అనిపించింది. మరొకసారి దండం పెట్టుకున్నరు.

"ఆ మరుగుకు పోదాం పద" అన్నడు నాయుడు.

"మూడు ముళ్ళు పడనీ"

"అయితె అదెంతసేపు" అని అక్కడ దేవత ముందు కంచుడిలో వున్న కుంకు మను తెచ్చి గంగ నుదుట పెట్టిండు. పందిరికి వేలాడుతున్న దారాన్ని తెచ్చి మెడలో మూడు ముళ్లు వేసిండు. ఆ మాత్రం కూడ నోసుకోని తన కులపు కన్యలు గుర్తురాగా ఎత్తిపోతల నీటి అలల చప్పుడు తన తలపై తలంబ్రాల గుమ్మ రింతలా, అక్కడి పక్షుల కిలకిలలు మంగ ళవాయిద్యాల చప్పుళ్లుగా మారుమోగి నయి! అంతే ఇక అతను ఏది చేసినా కాద నలేని స్థితికి చేరుకుంది.

ఆ రోజు ఆకాశం అందంగా ఉంది.

వెన్నెల వెండిలాగ కనిపించింది.

చుక్కల సంగతి చెప్పనక్కరలేదు.

చీకటి ముదురుతున్నది గుర్తేలేదు. అడ విలో అదురు బెదురులేని చేతలు. లేళ్ళు

కుందేళ్ళు బెదిరిపోతున్నయి. కంచెలో కౌంజుల్లా తిరిగింద్రు.

"నాలో ఏం నచ్చింది" అడిగింది గంగ.

"అన్నీ" అన్నడు.

"అన్నిటిలో ఏదో ఒకటి రెండు చెప్పొచ్చుగ" అన్నది.

"నీ షేప్!"

ఆ మాట అనగానె సిమెంటు గదిలో బాడి తొడిగింది గుర్తొచ్చి అతని ఎదను చేతులతో అదిమి, "ఇంకా" అని అడిగింది.

"నీ సన్నని నడుం, కింద ఆ ఎత్తులు" అని అంటున్నప్పుడు అతని నోరును చేత్తో మూసేసింది. ఆయన ఆగకుండా ఆమె శరీరంలోని తనకిష్టమైన భాగాలను వేలుతో తాకి చూపిస్తుంటే ఎదమీద వంగిపోయింది. అతను పైకి లేపి పట్టినప్పుడు ఆమె పాదాలు భూమిని వొదిలి గాలిలోకి లేచినయి!

ఆ తరువాత మాచెర్లకు వెళ్ళి ఓ ఇల్లు కోసం ఆరాతీస్తే గంగను చూసి 'ఈమె నీ భార్యేనా?' అని ఒకరు, 'లేపుకొచ్చినవా!' అని మరొకరు పొడిసి పొడిసి అడిగింద్రు. ఇద్దరి మధ్య వున్న ఇరవై ఏళ్ళ తేడా ఎవ్వరినీ నమ్మించలేకపోయింది.

అట్లా రకరకాల ప్రశ్నలు. చివరికి ఓ గది కుదిరింది. ఆ ఇంటికి రెండు దర్వాజలున్నయి. ఒకటి రోడ్డువైపు మరొకటి వెనుక సందువైపు. రోడ్డువైపు వున్న గదిని వాళ్ళకిచ్చింది.

'ఉండాల్నా? పోవాల్నా?' అన్న ఆలోచన.

'సరె పోవాలంటె పోవచ్చు ఉండాలంటే ఉండొచ్చు' అనుకుని కొంత అడ్వాన్సు ఇచ్చి ఆ రాత్రే దిగింద్రు. ఆ గదిలోనుండి బయటికి పోవడానికి ఓ తలుపు ఉంది. దానికి అవతల గొళ్ళెం పెట్టి వుంది. వీళ్లు లోపలి నుండి గొళ్ళెం పెట్టింద్రు. నాయుడు ఓ తుంగ చాప, చెంబు, బకెట్ తేవడానికి బజార్‌కు వెళ్ళిండు. గంగ ఒక్కతే కూర్చోని జరగబోయేదాన్ని ఆలోచిస్తువున్నది. అవతలి గదిలో ఏదేదో శబ్దం వినిపిస్తుంది. మెల్లగా వెళ్ళి తలుపు సందులోనుండి చూసింది.

ఆమె నవ్వుతు వుంది. అతను నవ్వుతు ఉన్నడు. ఆ ఇద్దరిలో భాషకు చోటులేదు. పరవశం తప్ప! నాయుడు వచ్చిండు. ఆ తర్వాత ఈ గదిలోను అదే.

తెల్లారి నాయుడు వంటపాత్రలు, కిరాణం తెచ్చిండు. ఆ పూట హోటల్లో పూరీలు తెచ్చి తిన్నరు. నాయుడు పనికెళ్ళి పోయిండు.

ఇల్లుగలామె వచ్చి కూర్చుంది. తాను సంపాదిస్తున్న సంపాదనకు సాక్ష్యం అన్నట్టు తన నగలను మాటిమాటికి కంట పడేటట్టు ఆమె కదలికలు!

మెల్లగ ఈ మాట ఆ మాట మొదలుపెట్టింది. తాను చేస్తున్న వ్యాపారం బాగ సాగుతుందని, నీకు నాయుడుకు ఈడు జోడు సరిగా లేదంది. మీరిద్దరు భార్యాభర్తలు కాదని ముఖం మీదే చెప్పేసింది. ఎట్లయితేనేమి రెండు నడుపుకుంటోల్లు లేరా కానీయి అంది. 'నీవు ఊ అంటే వేల రూపాయలు నీ పాదాల దగ్గర కుమ్మరిస్త' అంది.

గంగకు చిరాకేసి "నేను అట్లాటిదాన్ని కాదు. నాయుడు నన్ను మనుమాడిండు. ఆయనకు ద్రోహం చేయలేను" అన్నది.

"మొదట అందరు అట్లానె అంటరు. నా తల వెంట్రుకలు ఎన్ని వున్నయో అంత మందిని సూసిన. సంసారులు సానుల య్యింద్రే కాని సానులు సంసారులు కాలేదు" అందామె.

గంగకెందుకో ఆ గదిలో ఊపిరి సల్లలేదు. పెనంలో నుండి పొయ్యిల బడ్డానా అని ఆలోచిస్తున్నది.

"సరె, ఆలోచించు మల్లొస్త" అంటు కది

# అందరినీ అలరించే ఆట!




పిల్లలు, పెద్దలకు అమెరికాలో చాలా ఇష్టమైన ఆట జిగ్సాపజిల్స్. ఓ బొమ్మని అడ్డదిడ్డంగా కట్‌చేసి పెడితే, వాటిని మళ్ళీ సరిగ్గా ఆ బొమ్మ ఆకారం వచ్చేలా కూర్చడమే జిగ్సా పజిల్. అనేక ఆకారాల్లోని చిన్న అట్టముక్కలపై ఆ మొత్తం బొమ్మ తాలుకు చిన్న భాగాలు ముద్రితమైవుంటాయి. వాటన్నిటినీ సరైన స్థానాల్లో అమర్చితే మొత్తం చిత్రం తయారవుతుంది.



లండన్ మ్యాప్‌మేకర్ జాన్ పిల్స్‌బరీ 1760లో చెక్కపలక మీద రంగులతో గీసిన బొమ్మని జిగ్సా పరికరంతో ముక్కలు చేసి అమ్మసాగాడు. నేడు పిల్లలకి బహుమతులిచ్చే మొదటి పది ఆటవస్తువుల్లో జిగ్సా పజిల్స్ ఒక్కటి.

జిగ్సా పజిల్స్ అమెరికా మార్కెట్లోకి 1900లో వచ్చాయి. 1908 నాటికి అవి లక్షల్లో అమ్ముడు పోయాయి. ఈ రోజుకీ అమెరికాలో జిగ్సా పజిల్స్ ఆటవస్తువుల షాపుల్లో అధికంగా అమ్ముడవుతున్నాయి. పెద్దవాళ్ళకు కూడా ఇవి లభిస్తున్నాయి. 500, 750, 1000 ముక్కల సెట్లుగా దొరుకుతాయి. ఇంత దాకా వ్యాపారపరంగా విడుదలైన పెద్ద పజిల్‌లో 18,000 ముక్కలున్నాయి. ప్రతి పజిల్ అట్టపెట్టెపైన అది ఏ వయసు వారికో, దాన్నెంత సేపట్లో కూర్చవచ్చో వివరాలు ముద్రించి ఉంటాయి. అలాగే అది పూర్తయితే పజిల్‌లోని బొమ్మ ఎలా కనిపిస్తుందో కూడా ఉంటుంది. అమెరికా అధ్యక్షుల నుంచి, ఆటోరిక్షా డ్రైవర్లదాకా అన్ని వర్గాల వారిని జిగ్సా పజిల్స్ అలరిస్తున్నాయి.

---

లిందామె. ఆమె వెనకాల ఓ నల్ల పిల్లి!

గంగ తలనిండా ఆలోచనలే. నాయుడు రాగానే ఈ గది కాళీచేసి మరో ఇల్లు చూసుకోవాలి. అతికష్టంగా ఆ పొద్దు గడిచింది. వచ్చెటోడు పోయేటోడు ఒక్కటే సందడి.

సాయంత్రం నాయుడు రాగానే విషయం చెప్పింది. 'మనం ఈ ఇల్లు కాళీ చేసి వేరే ఇల్లు చూసుకోవాలి' అన్నది. 'సరే' అని తల పూపిండుగానీ అంతగా పట్టించుకున్నట్టు అనిపించలేదు. ఆ రాత్రంత నిద్ర పట్టలేదు. పక్కగదిలో అన్నీ రంకు మాటలే! నాయుడు కాస్త మందు పట్టించినట్టుండు. తన మత్తులో తానుండు.

'టక్ టక్' తలుపుకొట్టిన శబ్దం.

తలుపు తెరిచింది గంగ.

ఎదురుగ ఓ మగోడు.

మళ్లీ తలుపును దగ్గరేస్తు నాయున్ని పిలిచింది.

"ఎవరు? ఏం కావాలి?" అని అడిగిండు నాయుడొచ్చి.

"ఎవరైతే ఏం? అమ్మ లేదా?"

"ఏ అమ్మ" అడిగిండు నాయుడు.

"కంపినమ్మ" అని చటుక్కున నాలుక కరుచుకొని వెనుక దర్వాజవైపు నడిచిండతను.. పోతూ పోతూ గంగవైపే చూస్తూ వెళ్ళిండు.

"చూశావా మనం ఈ ఇంట్లో ఉండొద్దు. వేరే ఇల్లు చూసుకోవాలి" అన్నది గంగ.

అనుకున్నట్టే ఊరి చివరన ఓ సాయబు ఇంట్లోకి మారింద్రు. ఓ గది, దానికి ఆనుకొని వంటగది. ఇద్దరికి సరిపోను బాగానే ఉంది. నాయుడు ప్రాజెక్టు దగ్గరికి వెళితే తోడు ఇంటావిడ, ఆమె ఇద్దరు పిల్లలు! పొద్దు బాగానే పోయేది. ఆమె భర్త

పొద్దున్న పోతే రాత్రికొచ్చేది.

నాయుడు సాయంత్రం మల్లెపూలు, పండ్లు అవి తీసుకొచ్చేవాడు. ఒక్కోసారి బిరియానీ తెచ్చేవాడు. నాయుడు ఒక్కో రోజు రాకపోయేవాడు. ఆ విషయం ఉదయమే చెప్పిపోయేవాడు, రాత్రి షిఫ్ట్ రానని. ఇంటివాళ్ల అమ్మాయిని తోడుకు పిలుచుకుని పడుకునేది. ఇల్లుగలామె ఓ తోడపుట్టిన చెల్లెలులాగ చూసుకునేది గంగను.

ఎట్ల పసికట్టిందో కంపినమ్మ వచ్చి ఇంటావిడతో మాటకల్పి ఏమో ఏమో చెప్పిందట. వీళ్లు భార్యాభర్తలు కారని, మొదట ఇది మా కంపెనీలో ఉండేదని, దీనిని దీని భర్త మూడువేలకు అమ్మేసిండని! మూడు రోజులు కూడా గడవక ముందే ఓ రాత్రికని బుక్ చేసుకున్న నాయుడు తెల్లారిగట్టా అందరం నిద్రలో ఉన్నది చూసి మా కంపెనీనుండి లేపుకొచ్చిండని చెప్పిందట. 'మీరు ఖాళీ చేయించండి. లేకపోతే పోలీసులకు దరఖాస్తు ఇస్త!' అని వార్నింగ్ కూడా ఇచ్చిందట. ఆ ఇంటాయనే పోలీసని తెలియనట్టుంది పాపం. ఆ మంత్రం పారలేదు.

"ఏం భయంలేదు, మా ఆయన చూసుకుంటాడు" అంది ఇల్లుగలామె.

ఆ తరువాత నిలతీస్తే 'అట్టా కాదు తల్లి అదంతా అబద్ధం' అని చేతులు పట్టుకుని బతిమాలింది గంగ.

సాయంత్రం నాయుడు వచ్చినంక జరిగింది చెప్పింది.

"ఏంకాదు.. అది నిన్ను లొంగతీయాలని బెదిరించిందంతే" అన్నడు.

తెల్లారి పొద్దున్నే నాయుడు ఇంటాయనకు అసలు విషయం చెప్పి, ఒక్కరాత్రి తెలియక వాళ్లఇంట్లో వున్నందుకు బ్లాక్మెయిల్ చేస్తుందని చెప్పిండు.

విషయాన్ని గ్రహించి "నేను చూసుకుంటలే" అని ధైర్యం చెప్పిండాయన.

రోజులు బాగానే గడుస్తున్నాయి.

ఆరు నెలల తరువాత నాయుడు గంగ చేతిలో కొంత డబ్బుంచి, "మిషన్ బాగుచేయించడానికి బొంబాయి వెలుతున్న. వచ్చే వరకు ఈ డబ్బులతో నడుపుకో" అని చెప్పిపోయి, తిరిగి రానేలేదు.

రోజూ ఎదురుచూస్తూ కూర్చునేది. ఇంటి ముందు ఏ చప్పుడు అయిన అతనే అనుకొని చూసేది. రాత్రిపూట నిద్ర రాకపోయేది. వంట వార్పుమీద ఇష్టం ఉండకపోయేది. ఒకపూట తింటే మరోపూట అట్టాగే ఉండేది. మగమనిషి లేనప్పుడు ఎట్లా తినబుద్ధవుతది? నెల రెండు నెలలు దాటినయి. చాల బలహీనంగా తయారైంది. మూడవ నెలలో వాంతులు రాసాగినయి. తిండి సహించటం లేదు. ఇల్లుగలా ఆమె చూసి 'ఇట్టయితే ఎట్టా' అని డాక్టర్కు చూపించింది. డాక్టరు మూడు వేళ్లు చూపిస్తూ "బాగా తినాలమ్మా" అంటు మందులు రాసిచ్చిండు. 'ఎవ్వరికి చెప్పుకోవాలి తల్లిలాంటి ఆ ఇల్లుగలామెకు తప్ప' అనుకుంది గంగ. ఏ బాట నడవలేక భయపడిందో అదే డొంకలోకి వచ్చిపడినందుకు ఏం మిగిలింది? ఏడుపు తప్ప.

గంగ నాయుడు గురించి ఎవరిని అడిగినా ఏం చెప్పలేకపోయింద్రు. అమ్మవాళ్ల కంటపడకుండ తిరగనిచోటు అంటూ లేదు. ఆఖరికి అతని బట్టలు ఇస్త్రీ చేయించే డబ్బా దగ్గర్కి వెళ్లి అడిగితే, 'వాళ్ల కంపెనీ ఉత్తరదేశం పోయింది. నాయుడు కాంట్రాక్టర్ కాడు. కాంట్రాక్టర్ దగ్గర గుమాస్తా' అని తెలిసింది. తట్టుకోలేకపోయింది. ఉత్తమనిషి కాదుకదా కళ్లు తిరిగి రైట్ బ్యాంక్ కాలువ పక్కన కూర్చున్నది. మనసులో రకరకాల ఆలోచనలు సుళ్లు తిరుగుతున్నయి. కాలువలో దూకి చావాలనుకున్నది. చచ్చి సాధించేదేముం

దని ఆగిపోయింది. నాయుడు చేసిన మోసం తలుచుకుంటే విపరీతమైన కోపం వస్తూవుందామెకు. 'నేనెప్పుడు నీవాణ్నే అన్నడు. నాకు నీవు, నీకు నేను' అన్నడు. కడుపు చేసి కానరాకుండా పోయిండు. తాను ఇల్లొదిలిపోగానే తన తల్లి తనమీద పోలీసు స్టేషన్‌లో దరఖాస్తు ఇచ్చిందట. పైలాన్‌లోని రౌడిగాళ్లకు డబ్బులిచ్చి పట్టు కురండని చెప్పిందట. ఇవన్నీ నాయుడు బట్టలను ఇస్త్రీచేసే పిల్లోడు చెప్పిండు. ఆఖ రికి నాయుడే తన కంపెనీ పోయిన చోటికి ఆమెను తీసుకపోయినట్టుందని వెతకడం మానేసినరట.

గంగ కుడికాలువ దగ్గర కూర్చోని వున్నది చూసిన పోలీసు "ఇక్కడెందుకు కూర్చున్నవు? " అని గద్దించిండు.

తీరచూస్తే ఆ పోలీసు తెల్సినాయనె. ఆయన తమ గుడిసెకు వస్తువుండేది. ఎప్పుడు ఆయన వస్త అని చెప్పితే ఆ పూట పండగె! ఆ పూట మరెవరు గుడి సెకు రాకుండా బయట అత్త చూస్తూ వుండేది. గుడిసెలో తిని తాగి వెళతూ ఉండేది. అలా ఆయనకు ఆమె తెలుసు.

"ఓసె నీవటె. ఇన్ని రోజులు ఎటుపో యినవు? ఎవరినేసుకొనిపోయినవు? నీ సిగ తరగ.. నీ అమ్మకు ఎన్ని బాధలు పెట్టిపోతివె. వెతికి వెతికి వేసారె. అంతే కాదు, 'నీవు పోలీసువు, నీకు దొరకదా నీవె సరిగా ఎతకడంలేదు' అని నన్ను కూడా సరిగ్గా దగ్గర్కి రానివ్వడంలేదు. దాని చేతి ముక్కతినక ఎన్ని రోజులైందో. వార్లల్లో సారపోసి మిరియాలపొడి వేసి వండితే నాసామిరంగా వేళ్లను నాకవల్సిందే. సుక్క గొంతులేసుకుని ముక్కను నోట్లో వేసు కుంటే కైపేకైపు. ఏం చెప్పను నాలుగు నెలలు వాటికి దూరం చేస్తివికదే. నడువు నడువ్. నీ కోసం ఎతకని సందులేదు. మీ అయ్య... బరిసెను తీసుకొని పిల్లల వంక పెట్టుకొని ఇల్లిల్లు తిరిగినా లాభం లేక పోయె. మీ అమ్మను కాదనలేక ప్రతి కంపెనీని వెతికిన. వందల మందిని అడి గి చూసిన, నీజాడె దొర్కలేదు. ఇక్కడొచ్చి కూర్చున్నవు. ఎక్కడి నుండి వచ్చినవు? ఏం సంగతి? లే నడువ్" అన్నడు పోలీసు.

"ఎక్కడికి పోదాం అంకుల్? " అంటు లేవలేక లేసి నీరసంగా నిలుచున్నది.

కడుపువైపు చూసిన పోలీసు, "కడుపు లావుంది. ఏసుకు పోయినోడు ఏకటిచేసి వొదిలిండా? వదలడు మరీ! తెలివితక్కువ ముండ. మీ అమ్మ చెప్పినట్లు వినక ఎవ నెమ్మటో పోతివి, వెతుకులాట పెడితివి.

## కొత్తగాలి...

**లోక విదితమే**
**విశ్వరహస్యం**
**జననం.. మరణం**

– పి. సునీల్, పెద్దకొట్టాల,
నంద్యాల

మీ ఇండ్లల్లో పిల్లలెవరు కంటరె? ఏదో మీ అమ్మకు మరిగి ఆకులో ఈనెలాగ కాపాడుతూ వస్తున్న. నేను పోలీసోన్ని ఒక్కన్ని మీ గుడిసెరావటం వల్లా మీ అమ్మ, మీ అక్క ఎన్నడు స్టేషన్‌గడప ఎక్కలేదు. ఎంత అందగత్తే మీ అమ్మ! దానిలాగ మీరెవరూ లేరే. చెయ్యెత్తుమ నిషి, పావురంలాంటి మెడ. కాటుక పెట్టి నట్టె నెమిలి కనులు! విశాలమైన కనుసో గలు! ఒక్కసారి దాని ముఖం చేస్తే చాలు అన్ని మరిచిపోవల్సిందే. దాన్ని చాలా బాధ పెట్టినవె. నీ కోసం అది ఏడుస్తుంటె ఎంత బాదేసేది అనుకున్నవు. నీవు పోయి నప్పటి నుండి అది సంతోషంగా లేదు.

ఇప్పుడు నిన్ను తీసుకపోతె చూడు, దాని ఆనందానికి అడ్డుండదు" అన్నడాయన.

"నేను రాను అంకుల్. వస్తే కొట్టి సంపుద్ది" ఉబికివస్తున్న కన్నీళ్ళను తుడ్చు కుంటు అన్నది గంగ.

"పిచ్చిపిల్లా.. పోలీసున్నంక ఒక మనిషి మరో మనిషిని కొట్టడమా? " అని తన చేతిలోని లాఠీతో బూటుకే కొట్టుకున్నడు.

"నీకాళ్ల మొక్కుత అంకుల్.. నన్ను వొదులు" అని బతిమిలాడింది.

"నయి నయి.. నడు నడూ.. నీవు రానంటె విజిల్ ఊదుత, మా జీపొస్తది. స్టేషన్‌కు తీసుకెల్తది. రేపు కోర్టుకు తీసు కెళ్ళి నీమీద వ్యభిచారం కేసు పెడతరు. ఫైన్ కట్టిస్తరు. నిన్నెవరు కాపాడలేరు, నీ ఇష్టం" అన్నడు కోపంగా.

ఆలోచనల్లో పడ్డది గంగ. అవును పోలీ సులు తలుచుకుంటె తంటాలు తప్పవు అనుకుంటూ- "వస్తకాని ఓ మాట అంకుల్"

"చెప్పు"

"ఇంటికి పోయేముందు మధ్యలో నేను చదువుకున్న బడిని ఒకసారి చూడాలి" అన్నది.

"నీ ముఖం ఈయాల్ల ఆదివారం ఎవరూ వుండరు. గేటు మూసివుంటది"

"ఎవరూ అవసరం లేదు. ఆ బడిని ఓసారి చూడాలంతే"

"సరే, పద"

ఇద్దరు అక్కడి నుండి కదిలి కట్టమీద నడుస్తుంటే వచ్చే పోయే జనం వింతగా చూస్తున్నరు. బహుశ రైట్ బ్యాంక్‌లోని వ్యభిచార కొంపనుండి పట్టుకొస్తున్నడేమో అనుకుంటునట్టుంది.

"ఏంటి ఆలోచిస్తున్నవు? సాగర్లో దూకు దామనా? " వెనక్కు చూస్తూ అన్నడు.

"కరెక్టు చెప్పారంకుల్. అదే చేయాలను కుంటున్నా" నీటివైపు చూస్తు అందామె.

"మరి నేనెందుకున్నట్లు? నా వంటిమీద ఈ డ్రస్ ఎందుకు? " గుడ్లురుముతూ అన్నాడు.

"కాసేపు నన్ను చూడకుంట వుంటే? "

"పిచ్చిదాన ఓసారి అమ్మకు కనిపించి ఆ తరువాత ఆ పనిచేయి. నడు నడు. ముందు మీ స్కూల్ చూద్దువుకాని" అని భుజంమీద చేయ్యేసి ముందుకు నెట్టిండు.

స్కూల్ అనగానే నడకలో వేగం పెరిగి ఫైలాన్ పిల్లర్ దాటి ముందుకు నడి చింది.

అన్నట్టుగానే స్కూల్ గేటు మూసి వుంది. శనగకాయలు అమ్ముకునే ముస లమ్మ అక్కడ లేదు. కాపీలు, పెన్సిల్స్ కొనుక్కునె జనరల్ స్టోర్ మూసేవుంది. చుట్టూ చూస్తూ కాసేపు నిలుచుంది. అప్పుడు ఆమెకు సీత గుర్తొచ్చింది. సీత ఒకటో తరగతి నుండి తన క్లాస్‌మేట్. ఎంతో మంచిపిల్ల. చాలా మంచిగా మాట్లాడేది. అప్పుడప్పుడు తనతో లెక్కలు చెప్పించుకునేది. చక్కని తెలుగు మాట్లా డటం నేర్పించేది. కథలు, పుస్తకాలు, నవ లలు చదవడం అలవాటు చేసింది.

ఓరోజు వాళ్లింటి దగ్గర చదువుకుందామ నిపోతే వాళ్ళ అమ్మ తన పేరూ కులమూ అడిగింది. తర్వాత-

'సీత! నీకు సిగ్గులేదు, ఇలాటోళ్లతో తిరు గుతావా? రా.. లోపలికి రా' అని తన బిడ్డను లోపలికి పిలిచి, 'ఇక నీవు వెళ్లు తల్లీ!' అని తనను వెళ్ళగొట్టింది.

ఆరోజు గంగ చాలా బాధపడ్డది. అదే విషయం అంకుల్‌ను అడిగి తెలుసుకో వాలి అనిపించి "అంకుల్ ఇట్లా జరిగింది. సీత తల్లి నన్ను ఎందుకు ఇంట్లోకి రానివ్వ లేదు" అని అడిగింది.

"రానివ్వరు. వాళ్ళు పెద్దకులాలు కావచ్చు అందుకని"

"వాళ్ళు ఇతరకులాల కంటె ఎక్కువా? "

"ఎక్కవే మరీ" అంటు స్కూల్ దగ్గర నుండి వెనక్కు మళ్ళి పైలాన్ పిల్లర్ దగ్గ రికి వచ్చి "దీని కథ తెలుసా.. ప్రాజెక్ట్‌ను ప్రారంభించినపుడు వేసిన పిల్లర్ ఇది. అప్పటి ప్రధాని నెహ్రూగారేమన్నారో తెలుసా, 'ప్రాజెక్టులు ఆధునిక దేవాల యాలు' అని" అన్నడు పోలీసు.

"ఎట్లా.. ఎందుకు? "

"హిందు మతంలో నాలుగు కులాలున్న యన్నమాట. ఒకటి బ్రాహ్మణులు, రెండు వైశ్యులు, మూడు క్షత్రియలు, నాలుగు శూద్రులు.. అంటే చాకిరి కులాలు"

"అయితే మాది ఏ కులం"

"బహుశ అది నాలుగోదాంట్లోకే వస్త దేమో"

"ఏమొస్తదో ఏమో కాని మీరు చెప్పిన కులాలు అన్నీ మా గుడిసెలో జొరబడి, మా ఆడవాళ్ళ కాళ్ళు పట్టుకోవలసిందే కదా, అంకుల్? " అడిగింది గంగ.

"పోవే పోకిరి" అంటు నెత్తిమీద ఎడమ చేత్తో కొట్టి 'ఇది ఇతర పుస్తకాలు చద వడం వల్ల వయస్సుకు మించిన తెలివి వొచ్చింది' అనుకున్నడు.

"నాకు తెలువక అడుగుతా.. తమ కులపు భార్యలు ఉన్నంక కూడా ఆళ్లంతా మా గుడిసెలోకి ఎందుకు దూరుతరు? ఎందుకు బదనాం చేస్తరు? " అన్నది గంగ.

"సరెకానీ, ఇక ఆపేయ్ ఇల్లు దగ్గరికొ చ్చింది. ఎవరూ లేరు, పద" అన్నడు.

ఇద్దరూ గుడిసెల దగ్గరికి చేరినారు. అక్కడ కానుగు చెట్టుకింద నులకమంచం మీద జమున పడుకొని వుంది. తల్లి గుడి సెలో ఉన్నట్టుంది. గుడిసె ముందు చెప్పు లున్నయి.

అంకుల్ అది గ్రహించి, "మీ ఇంకో అమ్మ ఇంటివద్ద మీనాన్న ఉన్నడేమో చూద్దాం పదా" అన్నడు.

అక్కడి నుండి కదిలారిద్దరూ.

"అమ్మను తలుచుకుంటె నాక్కోపం వొస్తుంది అంకుల్"

"ఎందుకు నిన్ను వ్యభిచారం చేయమ న్నందుకా లేక ఆమె వ్యభిచారం చేస్తున్నం దుకా? " అని అడిగిండు.

గంగ మాట్లాడకుండా నడుస్తున్నది.

"నిన్నే అడిగేది. మనస్సులో వున్నదాన్ని బయటికి అంటే గుండె బరువు తగ్గుతది. చెప్పు ఏ విషయంలో? " రెట్టించిండు.

గంగ మాట్లాడలేదు.

"ఉట్టిగనే కోపమొస్తే దానికెవ్వరు ఏం చెయ్యలేరు. తన కోపం తన శత్రువని వినలేదా? " అంటుండగానే మొదటి తల్లి గుడిసెను చేరినరు. అక్కడా నాన్న అలి కిడి కనిపించలేదు. గుడిసెలో మాత్రం ఎ వరో గుసగుస మాట్లాడుతున్నరు.

మధ్య మధ్య మనసార నవ్వుకుంటు న్నట్టు వాళ్ల నవ్వు ధ్వని చెపుతుంది.

అక్కడి నుండి కదిలి నడుస్తున్నపుడు "ఇక్కడి సీను నీకు కోపం తెప్పిస్తుందా? " అని అడిగిండు.

గంగ మాట్లాడలేదు.

"నాకు తెలుసు, నీకు కోపం తప్పక వస్తది. నీవు కాస్త చదువుకున్నదానివి కదా? ఇలాంటివి నీకు నచ్చవు. కాని ఏం చేస్తం.. బతుకు బాధలు! పొట్టకోసం ఏదో ఒకటి చేయకతప్పదు. ఎవరు చేసేపని వారు చేయవలసిందే మరి"

"అందరూ అట్టేచేసి బతుకుతున్నారా అంకుల్? "

"ఇది మీ కులవృత్తి సుమా. ఈ కుల వృత్తి అనేది వెనుకటి నుండి వస్తున్నదే. దీన్ని మన మతపెద్దలు, సాములు బతి కిస్తు వస్తున్నరు. మీ అమ్మ వయస్సులో ఉన్నప్పుడు మాచర్ల చెన్నకేశ్వరస్వామి గుడికి వెళుతూ ఉండేదట. మార్గమధ్యాన ఓ ఆశ్రమం ఉందట. అక్కడ లింగపూజ

జరిగేదట. పిల్లల్లేని పడుచువాళ్ళు అక్కడికి వెళ్లి మధ్యరాత్రి పండు వెన్నెలలో నగ్నంగా ఆ శివలింగం చుట్టు తిరిగితే పిల్లలు పుడ తారని నమ్మకమట. మీ అమ్మకూ మొదట సంతానం అలాగే పుట్టిందట. అప్పటినుండి ఏటా వెలుతుండేదట. అక్కడి స్వామే మీ అక్కచెల్లెండ్ల పేర్లు కూడా పెట్టిండట. అది రహస్యం"అని ముగించిండు పోలీస్ వెంకటస్వామి.

"ఎంత గోరం" నడుస్తునే అంది గంగ.

"ఇట్టాటి స్వాములు చేసుకుంటే ఒకే స్త్రీతో ఉంటు సంసారులవుతారు. లేకుంటే సన్యాసులై ఎందరితోనో గడుపొచ్చు. వాళ్ళు తాగడానికి పాలు కావాలి. దేవునిపేర ఆవులను, స్త్రీలను వదలమం టరు. పేరు దేవునిది. సుఖం వాళ్ళది. దాన్నే ఆచారం అంటుంటరు" అన్నడు మళ్ళీ తానే.

గంగ ఆచారాల గురించి ఆలోచిస్తూ నడుస్తున్నది.

తిరిగి గుడిసె ముందుకు వెళ్ళేసరికి తల్లి పొయ్యి రాజేస్తుంది. కంపపుల్లలు ఒక్కసా రిగా మండి ఆమె ముఖాన్ని మరింత ఎర్రగా మార్చుతున్నయి.

"ఏం చేస్తున్నవే రంగ" పోలీసాయన అనగానే అమ్మ దిగ్గునలేచి నిలుచుంది.

"ఇదిగో నీబిడ్డను తీసుకొచ్చిన్నే చూడు" అంటు పక్కకు జరిగిండాయన.

అంతే తల్లి ముక్కుపుటలు విచ్చుకు న్నయి. కనుగుడ్లు పెద్దగైనయి.

"పోయింది మల్లెందుకొచ్చింది.. నా గుడిసెలో అడుగుపెట్టొద్దు" అంది కోపంగా పొయ్యి ముందు నిలుచొని.

"నీవు కాదంటె ఎటుపోతది? దగ్గర తీయి. లేదా సీద తీసుకెళ్లి ఏ కంపెనీకో అమ్మేస్త. మీరీడ చేసే పనే తను ఆడ చేసుకుంటూ ఇక్కడి కంటె మంచిగ బతు కుద్ది తెలుసా? ఎవరితోటి మాట్లాడుతు న్నవు? పోలీసు ఎంకటసామితో! ఆలో చించి మాట్లాడు" అన్నడు సీరియస్‌గా.

అంతే, ఆమె నోరు విప్పలేదు. పోగా గంగమీద పడి ఏడ్చింది. ఈ చప్పుడుకు జమున లేసింది. ఎంకమ్మత్త వచ్చి గంగను కౌగిలించుకుంది.

"నేను మల్లొస్త, పిల్లను ఏం అనొద్దు సుమా!" అంటూ వెళ్లిపోతూ గంగ చేతికి కొంత డబ్బిచ్చిపోయిండు వెంకటస్వామి.

అందరు కలిసికట్టుగ ఏడుస్తు నిలుచు న్నరు. మిగతా ఇద్దరమ్మలు వచ్చి ఏడు పులో ఏడుపు కలిపిండ్రు.

'ఎక్కడపోయినవు? ఎవ్వడు లేపుకపో యిండు?' అనే ప్రశ్నలతో పొడిచి పొడిచి,



## మాడపాటివారి చతురోక్తులు



స్త్రీ జనోద్ధరణకు, గ్రంథాలయాల స్థాపనకు కృషి చేసిన ఆంధ్రపితామహుడు మాడపాటి హనుమంత రావుగారు న్యాయ వాదిగా, పత్రికా రచయితగా పనిచేశారు. శాంత స్వభావులైన ఆయన సంభాషణల్లో ఎన్నో చమత్కారాలు దొర్లేవి. ఆయన చతురోక్తులు కొన్ని..

### ఎల్డర్స్ సభ!

విధాన పరిషత్తు అధ్యక్షులుగా మాడపాటి వారు ఆరేళ్లపాటు కొనసాగారు. వారిని ప్రతి పక్షీయులతో సహా అందరూ ఆమోదించి ఏకగ్రీవంగా ఎన్నుకునేవారు. ప్రతిపక్ష సభ్యులు 'అయ్యా! మీ ఏకగ్రీవ ఎన్నికను మేమూ ఆమోదించాం. మీరు ప్రభుత్వపక్షం వారిని గట్టిగా మందలించాలి' అనేవారు.

దానికాయన చిరునవ్వుతో, 'ఇది ఎల్డర్స్ సభ అయినందున, నాలాగే వయస్సులో పెద్దలు ఎక్కువమంది ఉన్నందున దీన్ని శాంతంగా జరుపుకోవాలి గదా!' అని నచ్చ జెప్పేవారు.

సంపింద్రు. కడుపును చూసి విస్తుపోతూ 'ఇదికూడానా?' అన్నరు.

"కడుపు గిడుపు అక్కర్లేదు" అంది తల్లి.

"మరేం చేద్దాం?" అంది అత్త.

"దిగదాగిద్దాం" అంది తల్లి అక్కసుగ.

ఆ మాట విని వణికిపోయింది గంగ. 'ఏంది ఈ పాడు బతుకు? చదువుతానంటె చదవనీయలేదు. తల్లినౌత అంటె వద్దంటరు. మరెందుకీ బతుకు? మాట మాటకు వృత్తి, వృత్తి అని గుర్తు చేస్తరు. గుండెకు గాయం చేస్తరు. అసలు ఎవడు చేసిండు ఈ కులాలను? మనిషి చేసిండా.. దేవుడు చేసిండా? దేవుని దృష్టిలో అందరు సమానులే అంటరు. మరి ఇదేంది?' అని ఆలోచిస్తున్నప్పుడు మనస్సు చివుక్కుమంది.

ఆ పాటున పరుగెత్తి కిష్టలో దూకాలని పించింది. కాని కడుపులో ఉన్న బిడ్డా? 'నా ప్రాణం తీసుకునే హక్కు నాకున్నా లేకున్నా మరోప్రాణం తీసే హక్కు అస్సలు లేదుకదా?' అని మనస్సును సముదాయించుకున్నది.

"దిగదాగిద్దాం తొందరెందుకు కాస్త ఆగు. ఆ పని రేపైనా చెయ్యొచ్చుగా ఆకు పసరు సిద్ధం చేయి" అంది అత్త.

తల్లి శాంతించింది. ఆ పూట గంగ ఏంతినలేదు. అట్టా ఆ రాత్రి గడిచింది.

తెల్లారగట్ల తల్లి కొడవలి తీసుకొని అడివికి పోయింది. గంగ, అక్క జమున ఇద్దరూ ఏడుస్తూ కూర్చున్నరు. అత్త కాస్త ఉడుకు గంజిలో ఉప్పేసుకుని తెచ్చి "రాత్రి ఏంతినలేదు, వట్టిమనిషివి కావు, తాగు" అని గిన్నెను అందించింది. అది తాగినంక గంగ ప్రాణం కాస్త చల్లబడ్డది.

ఈలోపు జమున బన్‌రొట్టె తెచ్చి, చాయ్ చేసిచ్చింది. ఆ రొట్టెను చాయలో ముంచుకొని తిన్నంక గాని ఆకలి చల్లారలేదు. అప్పటివరకు లోపలికి గుంజుకపోయిన కనుగుడ్లు యథాస్థానంలోకి వచ్చినయి.

"అత్తా అమ్మ ఎక్కడకుపోయింది?" చాయ్‌గ్లాస్ పక్కకు పెడుతూ అడిగింది.

"చెట్ల ఆకులకోసం పోయింది"

"ఎందుకట నాకడుపు పొగొట్టడానికేనా"

అవునన్నట్టు తలాడించింది అత్త.

"అది జరిగే పనికాదు. నేను తల్లి కావల్సిందే" ఆందోళనగా చూస్తూనే అన్నది గంగ నిశ్చయంగా.

"అది మీ అమ్మకు ఇష్టంలేదు. నిన్ను లేవదీసుకుపోయిన ఆ ముదనష్టపోని ఆనవాలు మిగులొద్దట. పోగ బాలింతవై నెలకొద్ది కూర్చుంటె కుండెట్ల గడుస్తది అంటుంది" అంది ఎంకమత్త.

"కూలిపని చేస్త"

"హు చేస్తవు చేస్తవు. కూలికిపోయే కదా లేచిపోయింది" అంటూ తల్లి కానుగుచెట్టు కిందికొచ్చి కొడవలి గుడిసెలోకి విసిరి, వొళ్లోని ఆకులను నీళ్ల తొట్టిదగ్గర కడుక్కుంటు గులుగుతూ వుంది.

ఆకులను కడిగి వాటి పసరు తీసి ఓ రాతెండి గిన్నెలోవుంచి ఎంకమ్మను పిలిచి "తాగీయి" అంది.

అత్త పసరు గిన్నెను గంగకు తెచ్చిస్తు "తాగు" అంది.

"నేను ముందే చెప్పిన తాగనని" అని ముఖం తిప్పుకుంది గంగ.

"మీ అమ్మ తాగమంటుందిగ"

"నేను తాగ. నేను తల్లిని కావల్సిందే" అంది గంగ.

తల్లి ఆ రోజంతా అరుస్తూనే ఉంది. ఆ అరుపులతోనే రోజులు గడుస్తున్నయి. అప్పుడప్పుడు పోలీసు అంకుల్ మిఠాయి తెస్తూ వుండేవాడు. జమున పూలు, గాజులు తెచ్చిస్తూ ఉండేది. చూస్తుండగానే నెలలు దగ్గరపడ్డయి. తనను ఎంకమ్మ అత్త గుడిసెలోకి మార్పించింది. ఎంకమ్మ అత్తకు పిల్లలు లేరు. ఆమెకు పసరు

# ఉచిత భోజనం!




కాలిఫోర్నియాలో బర్కిలీ అనే ఊళ్లో 'కర్మ కిచెన్' రెస్టారెంట్‌కి వెళ్ళి కడుపునిండా భోంచేస్తే ఇచ్చే బిల్లులో సున్న వుంటుంది. అంటే అక్కడ భోజనం ఉచితం. ఆదివారం ఉదయం పదకొండు నుంచి మూడు గంటలదాకా అలా పెడతారు. ముందుగా ఈ-మెయిల్ ద్వారా భోజనం రిజర్వ్ చేసుకోవాలి. ఇక్కడ ఆరోజు శ్రమదానం చేసే స్వచ్ఛంద సేవకులు కూడా ఉదయం పది గంటల నుంచి సాయంత్రందాకా పనిచేస్తారు. ఈ హోటల్ ఎలాంటి ప్రకటనలు ఇవ్వదు. నోటిమాట ద్వారానే ఇది ప్రచారంలోకి వచ్చింది.




అనేకమంది దాతలు ఇచ్చిన విరాళాలతో ఈ పని సాధ్యమవుతోంది. అక్కడి భారతీయులు దీన్ని నిర్వహిస్తున్నారు. అక్కడ ఉచితంగా భోజనం చేసినవారు, పని చేసినవారు తమ అనుభవాలని కర్మ కిచెన్ డాట్ ఆర్గ్‌లో నమోదు చేస్తుంటారు. దీన్ని 31 మార్చి 2007లో ప్రారంభించారు. పరోపకారం చేయాలనే కోరిక గల అనేకులు దీన్ని నిర్వహిస్తున్నారు. కొందరు భోంచేశాక తమ వంతుగా కొంతడబ్బు అక్కడుంచి వెళ్ళడం సహజం. 'ది టేస్ట్ఆఫ్ హిమాలయాస్' హోటల్ యజమాని రాజన్ ధప్పా, మిలిండా, రోషిణి, లలిత, నిపుణ్, ఫిలిక్స్, నీరల్, తృష్ణ తదితర ప్రముఖులు కలిసి దీన్ని ఆరంభించారు. 'నీకెంత తోస్తే అంతే చెల్లించు' పద్ధతిలో కెనడా, అమెరికాలో అనేక హోటళ్ళు నడుస్తున్నాయి. కెనడాలోని అంటారియోలో సిటీ కేఫ్ బేకరీ, బెర్లిన్‌లోని వైన్ బార్, సింగపూర్, మలేషియాల్లోని అన్నలక్ష్మి, అమెరికా అంతటా వున్న మదర్స్ కిచెన్, అహ్మదాబాద్‌లోని సేవా కేఫ్, శాంటా క్లారాలోని వెడ్నెస్‌డేస్ మొదలైనవి ఈ తరహాకి చెందినవే!

తాగించి గొడ్డుదాన్ని చేసి ఆ వృత్తే చేయించిందట ఆమె తల్లి. ఎన్నాళ్లు చేస్తది? వయస్సులో ఉన్న రోజులేకదా? ఆ తరువాత కూలిపని. ఇప్పుడు ముసలిదై ఇళ్లల్లో పనిచేస్తూ పూట గడుపుతుంది. ఆమె అప్పుడప్పుడు పనిచేసే ఇండ్లల్లో తెచ్చుకునే వంటలు కొంచెంకొంచెం గంగకు పెడుతూ వుండేది.

★ ★ ★

ఆరోజు తెల్లతెల్లవారంగ చుట్టువున్న అడవిలో నక్కలు కూస్తున్నయి. ప్రాజెక్టు పనులు మొదలుకాగానే యంత్రాల చప్పుడుకు ఈ అడవి జంతువులు బెదిరి, విద్యుత్ కాంతులకు చెదిరి చుట్టుముట్టు ప్రాంతాలకు వెళ్లిపోయినా వాటి చప్పుళ్లు తగ్గలేదు. ఆ తెల్లవారుజామున కొండ ప్రాంతం హాయిగా చల్లగాలితో ఎంత అందంగా ఉంటుందో! ఆ అరుదైన నేపథ్యం ఏ కెమెరాలో ఇమడదేమో!!

గుడిసెముందు నెగళ్లు వెలిగించి గంగ తల్లి, ఇద్దరు సంవుతులు కూర్చోనున్నరు. వాళ్ల పక్కమ్మటె వాళ్ల కుక్క పడుకుని జంతువుల శబ్దానికి జవాబుగ కలవరపడ్డట్టు గునుస్తువుంది. ఉన్నట్టుండి గుడిసె రేకుమీద ఏదో పడ్డట్టె శబ్దం. ఆ శబ్దానికి అందరు వులిక్కిపడ్డరు. గుడిసెలో ఒక్కసారె 'అమ్మా' అన్న అరుపుతో కలిసి 'కెవ్' మని అప్పుడే పుట్టిన ఓపాప కేక.

గుడిసెమీద శబ్దం చేసింది ఎంకమ్మ అత్తే. పొద్దటినుండి నొప్పులు పడుతున్న గంగ భయకంపితురాలై పాపను కనాలని అట్టా చేసిందట. ఆ రోజుల్లో గ్రామీణులు

అట్టా చేస్తుండేవాళ్లట. పెంటదిబ్బను మోదడం, తుపాకి పేల్చడం చేసేవాళ్లట.

అందరు లోపలికి వచ్చింరు. పిల్లను వేరు చేయడానికి కొడవలందుకుని బొడ్డు కోసింది ఎంకమ్మత్త. పాప ఒక్కటే ఏడుపు. అత్త పాపను జాలారిలోకి ఎత్తక పోయింది.

తెల్లవారి పొద్దుపొడిచింది. పొద్దుతో పాటు వెచ్చదనం వొచ్చింది. కానుగు చెట్టు మీద పిట్టలచప్పుడు. పాపను కడుక్కొచ్చి తల్లి పక్కన పొత్తిట్లో పడుకోబెట్టింరు. ఆ పాప నోరు తెరిచి పాలకోసం తారాడు తుంది. కాని పాలు రావడం లేదు. గట్టిగా చీకే పట్టు దొరకడం లేదు. ఆ రోజంతా అట్టాగె గడిచింది. పాప ఏడుస్తూనే వుంది. జమున పాలు కొనుక్కొచ్చి నీళ్లు కలిపి కాగపెట్టి చుక్కలు చుక్కలుగా తాపింది. మరునాడు గంగతో కాయం ముద్దలు మింగించింది. పుక్కిట వోమను పట్టించింది. సాయంత్రం వరకు రొమ్ముల్లో ఏదో ఊట ఊరుతున్నట్టు అనిపించింది. అదే విషయాన్ని ఎంకమ్మత్తను అడిగితె పాలుపడుతున్నయన్నది. పాలు పడు తుంటె ఏదో తెలియని అనుభూతి. తీయని మత్తనిపించింది గంగకు.

ఎల్లిపాయలు కుచ్చి, కాళ్లకు చేతులకు కట్టి ఏడోరోజు పురుడు చేసింరు. ఇరవై ఒకటినాడు నల్లపూసలు తెచ్చి కాళ్లకు చేతు లకు కట్టి చిన్నపాటి విందు చేసుకున్నరు. పోలీసు వెంకటసామి గూడ వచ్చిండు. చు ట్టపక్కాలను ఎవర్ని పిలవలేదు.

గంగ ముఖంలో కోపం, ప్రేమ కలిసి కనిపించేది. అట్టా నెలలు గడిచిపోతూనే వున్నయి.

కానుగ చెట్టుకు పాత చీరెను తొట్టెలాగ కట్టి అందులో పాపను ఊపుతుండేది. మూడు నెలలు అయినా ఇంకా గంగ మూలుగుతూ కూర్చుంటే- 'పూటెట్ట గడుస్త దంటవే? ' అని తల్లి ఓనాడు నిలదీసింది. ఆరోజే గుడిసెను శుభ్రం చేసి గుగ్గిలం పొగ వేసిందామె. మంచాన్ని గుంజిపి చ్చింది. జాలారీ గోలెంలో నీళ్లు నింపింది. మరో నులకమంచాన్ని గుడిసె ముందు వేసివుంచింది. గంగ అనుకున్నట్టే ఒకాయ న వచ్చి నులకమంచం మీద కూర్చున్నడు.

"గంగ లోపల దీపం పెట్టుపో"

పాపను ఊపేది ఆపి, గంగ గుడిసెలోకి వెళ్లి దీపం పెట్టి నిలుచుంది. ఆమె వెన కాల అతను. అతని చేతులు ఆమె నడుం చుట్టు.

ఉలిక్కిపడి "నేను కాదండి.. మా అక్క అయ్యుంటది" అన్నది.

"ఎవరయితే ఏం? " అంటు తన చేతు లను వెనక్కు తీసుకున్నడు ఆయన. బయ టికొచ్చిన గంగను తల్లి తిట్టినతిట్టు తిట్ట కుండ తిడుతున్నది. విషయం అర్థం చేసు కున్న జమున అతనిని తన గుడిసెకు తీసుకెళ్లింది.

తల్లి గంగను సాధిస్తూ ఊయల దగ్గరి కొచ్చి పాపవైపు చూస్తూ "ఎందుకు పుట్టి నవె లంజముండా? మీ అమ్మ నిన్ను సాదుతదా ఏమన్ననా? " అని పండ్లు పట పట కొరికింది.

"మీ అమ్మ దొరల ఇండ్లల్ల పుట్టవ ల్సింది. పొరపాటున మాకొంపల్ల పుట్టి

## కొత్తగాలి...

**కొందరు ఆడవాళ్లు**
**మొగుళ్లను జయిస్తారు**
**భువిని దివిగా మలుస్తారు**
**చిరునవ్వే ఆయుధం**

– పాయసం సుబ్రహ్మణ్యమహర్షి,
నెల్లూరు

మమ్ముల సాదిస్తుంది" అంది ఆక్రోశంగా.

నులకమంచం మీద కూర్చున్న గంగ బుర్ర పనిచేయడం లేదు. 'నాయుడు గాడు మోసం చేసిపాయె. అవును, అమ్మ అన్నట్టు ఎట్లా బతకాలి? ఈ పిల్లను ఎట్లా సాదాలి' అనుకుంటూ కూర్చునప్పుడు జమున వచ్చి కూర్చున్నది. ఆమె దగ్గర అంత సిగరెట్టు, సారా వాసన.

గంగ తన బతుకు ఇట్లా అయినందుకు ఏడుస్తూ ఎంతోసేపు కూర్చున్నది. పాపను ఎట్లా పెంచాలన్న ఆలోచన బుర్రను తొలుస్తుంది.

ఎంకమ్మత్త ఇండ్లల్లో పనిచేయడానికి వెళ్లి అప్పుడే వచ్చింది. ఇద్దరు వెళ్లి ఆమె గుడిసె ముందున్న నాపరాళ్ల అరుగుమీద కూర్చున్నరు. వళ్లో ఉన్న పాప ఏడుపు పట్టగానే రవికె పైకని రొమ్మునోట్లో ఉంచింది. అంతే ఏడుపుమాని పాలు తాగుతూ వుంది. అంతలో వెన్నెల పర్చుకుని మనుషులకు ప్రశాంతతను పంచుతూ వుంది. చుట్టూర అంతా అడవి, మధ్యన నది. నదిపక్కమ్మటే ఇండ్లు. ఎంత బాగున్నయి. పరిసరాలు ప్రశాంతమేకాని కాలమే కఠినంగ నడుస్తుంది!

★ ★ ★

అది 'కమలానెహ్రూ' హాస్పిటల్! మెడికల్ వార్డులోని మంచాలమీద రోగులు, మంచాల పక్కన స్టూళ్లమీద రోగులకు సంబంధించినవాళ్లు కూర్చోని వున్నరు. కొందరికి గ్లూకోస్ బాటిల్స్ పెట్టింద్రు. నర్సులు హడావుడిగా తిరుగుతున్నరు. మూలన ఓ మంచంమీద గంగ బిడ్డను పడుకోబెట్టి పక్కన కూర్చున్నది. బిడ్డకు జ్వరం. పొట్ట ఎగవేయబెట్టి మూడురోజులైంది. హాస్పిటల్‌లో చేర్చక తప్పలేదు. డాక్టర్ మందులు రాసిండు. నర్సు వాటిని చూసి వున్న మందులు ఇచ్చి ఇంజక్షన్ బయట తెచ్చుకొమ్మంది. ఇంజక్షన్ కొనడానికి గంగ దగ్గర పైసలు లేవు. అదే విషయం చెప్పి అప్పుడే వచ్చిన అమ్మ చేతికి చీటీ ఇచ్చి తలవంచుకుంది.

చీటి అందుకున్న తల్లి "ఏం చేయమంటవు? పైసలేడివి? నీవేమన్నా తెస్తివా, ఇస్తివా? నేనేడికెళ్లి తేను. ఎవని పిండం ఎవని గండం" అంది కోపంగా.

"ముందు పిల్లని బతికిచ్చుకోవాలేమ్మ"

"చెప్పినట్టు చేయవైతివి, చేతగానోనితో తిరిగితివి. వాడు కడుపు చేసి పోతె ఎవరు చెయ్యాలె? ఇంతటితో అయిపోయిందా బతుకంతా భరించవల్సిందే. తండ్రి లేనిపిల్లను ఎట్టా సాదటం. మూడేండ్లకే పానం ముక్కులకొచ్చే!"

"ముందైతే ఈ మందులు తేపో. తరువాత ఏకూలో నాలో చేసి సాదుత" గంగ కనుకొలుకుల్లో తడి కదిలింది.

గంగ తల్లి అయిష్టంగానే చీటితో బయటికి నడిచింది.

ఇదంత చూస్తున్న ఓ అరవై పైబడ్డ ముసలమ్మ- గోగునారలాంటి జుట్టు బాదంగింజలాంటి శరీరపు రంగు- చేతులకు బంగారు గాజులు. పక్క మంచంలో కూర్చోని చేతికి సిమెంట్ పట్టీవేసి వున్న బాబుకు బ్రెడ్‌ను పాలల్లో ముంచి తినిపిస్తువుంది. 'వద్దు' అని తలను పక్కకు తిప్పుకుంటున్నడు బాబు.

"కొంటె కోణంగి, చెపితే విన్నావా? చేయి విరిగింది. నలభై రోజులు ఈ కట్టు ఉండాలంట. తిమ్మిరి వొదులుతదిలే వెధవ" అంది.

ఆ బాబుకు పదేళ్లుంటయి. గుడ్లప్పగించి చూస్తున్నడు.

"మీ మనవడా అమ్మా?"

"ఆ, మనవడే! కొడుకుకొడుకు. చెపితే వినడు, ఒకటే ఎగురుడు దూకుడు. చేయి ఇరగ్గొట్టుకున్నడు. ఒకవేళ అతక్కతొంటోడు అయితే? వీని తాతా అంతే!

తన పంతం తనదే. చెపితే ఓ మానాన వినకపోయేది. వాని పీడ విరగడయింది. వీని పీడ మొదలైంది" అంటు గ్లాసును బాబు నోటికి అందించింది. ఆ బాబు వద్దని ముఖాన్ని దిండులో దూర్చిండు. ఆమె ఆ గ్లాసు పక్కన వున్న స్టూల్ మీదుంచి గంగవైపు మళ్ళింది.

"ఇందాకటామె మీ అమ్మ అనుకుంట. మనవరాలు మీద అంత కోపం? "

"మనవరాలు మీద కాదు, ఆ కోపమంత నామీదే. ఆమె చెప్పినట్టు వినలేదని"

"అయ్యో తల్లి చెప్పినట్టు వినాలిగ. ఏత ల్లయినా తనబిడ్డ బాగుకోరే కద చెప్పేది"

## కొత్తగాలి... 

**స్విస్సు లంకలో**
**నల్లధనం సీతలు**
**విడిపించడానికే**
**రాందేవ్ చేతలు**

– బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి

గంగ మౌనంగా ఉంది.

"తల్లితండ్రి కంటె దైవంలేదని పెద్దల మాట"

"మా తల్లిదండ్రులు అట్లాకాదు. చూస్తిరి కదా..నా బిడ్డ ఊపిరి పీల్చుకోలేని స్థితిలో వుంటే మందులు తెమ్మంటె ఎట్లా మాట్లా డిందో? " తన్నుకొచ్చే దుఃఖాన్ని బలవం తంగ ఆపుకున్నది గంగ..

"అవును, ఆ పాపకు తండ్రి లేడా? "

నోట మాట రాలేదు. రెండు కన్నీటి బొట్లు రాలినయి. అవి చూసి ఆమె ఏమ నుకుందో ఏమో "పోనీలే ఏడవకు" అంది.

"ఏడుపే మిగిలిందమ్మగారు"

"ఎంతో బాధలో వున్నట్టున్నవు.. పోనీ తరువాత మాట్లాడుకుందాం" అందావిడ.

పొద్దు నెత్తిమీద కొచ్చింది. వచ్చీరాగానే గంగను 'అన్నం తినిరాపో' అని పంపిం చింది తల్లి. అప్పుడే పక్క హాలులో పెద్దగా ఏడుపుల శబ్దం. ఎవరో పోయిన ట్టుంది. గేటుదాటి రోడ్డుమీదికొచ్చి ఇంటి బాట పట్టింది గంగ. ముద్ద తిని కాసేపు కూర్చోని "అక్కా వెళ్లొస్త" అంటూ లేచి ఆసుపత్రి బాట పట్టింది. పాప గుర్తుకు రాగానే నడకలో వేగం పెంచి క్షణంలో పాప మంచం దగ్గర్కి చేరింది. గంగ రాక చూసిన తల్లి అక్కడినుంచి కదులుతూ "పొద్దూకంగావస్త" అంటు తాను తెచ్చిన మందులను మంచంమీద వుంచి "డాక్టర్ వొచ్చినంక చూపియ్" అంటూ బయటికి నడిచింది.

"మీ అమ్మకు నీ మీద చాలా కోపం వుంది. నిన్ను తిట్టింది. ఆ తరువాత తనను తానె తిట్టుకుంది. సగం ఈడుపో యెవరకొచ్చినా ఎన్నడు సుఖపడలేదట. మీ అయ్య ఏంపనిచేయడట. నీకు ఇంకా ఇద్దరు తల్లులున్నరట. ఎక్కడ వంట సి ద్ధమైతే అక్కడ తింటడట. ఇంకా సారా కల్లుకు పైసలు వీళ్ళల్లో ఎవరో ఒకరు ఇవ్వాలట" అంది పక్కబెడ్ ముసలామె.

'అవును' అన్నట్టు తలాడించింది గంగ.

"కులవృత్తి చేయమంటె నీవు ఒప్పుకుం టలేవట. ఎవడో ఓ దిక్కుమాలినోన్ని ప్రేమించి ఆ పాపను కన్నవట"

గంగ కళ్ళలో నీళ్లు తిరిగినయి.

"వాడు ఏదో దేశం పోయిండట. ఈమెను, ఈమె పిల్లలను ఎట్లా సాదాలని అడిగింది. మరి నిజమే కదా? "

"కులవృత్తి చేయనన్న కాని కూలి చేయ ననలేదు. లేకపోతే నాలుగు ఇళ్లలోనైన పనిచేసి పూట ఎల్లతీస్తనన్న వినటం లేదు. మా అక్క జీవితం పాడుచేసింది. నా బతుకులో కూడా నిప్పులు పొయ్యా

లని చూస్తుంది" అంది గంగ.

"ఈ ఆడజన్మే అధ్వానపు జన్మ. నాడైనా నేడైనా ఇంతే. జరుగుతున్నది చూసినా అంతేవుంది. పుస్తకాల్లో చదివినా అంతే వుంది" అందావిడ నిర్లిప్తంగా.

"మీరు చాలా పుస్తకాలు చదివారా మ్మా? నన్ను ఎనిమిదో తరగతి చదవ గానే బడి మాన్పించింది మా అమ్మ" అంది గంగ.

"మా అబ్బాయి పెద్ద ఇంజనీరు. వాళ్ల నాన్న పెద్ద భూస్వామివుండె. మా ఇంట్లో పెద్ద గ్రంథాలయం వుండేది. మామగారికి ఇద్దరు భార్యలు. ఒకామె స్వయాన ఆయన మేనమామ కూతురే. ఆమెకు పిల్లలు కాలేదు. వాళ్లింట్లోనె మా అత్త ఆడ పాపగ పనిచేసేది. ఆమె చాలా అంద గత్తె. మంచి చామనచాయ. కాటుకకళ్లు, చక్కని ముక్కు. ఎట్లయితేనేమి ఆమెను ఉంచుకుండు. ఆమెకు పుట్టిన అబ్బాయె మా ఆయన. మగపిల్లడు ఇంటికి వారసు డని బాగా చదివించాడు. ఎంత చదివితే ఏం? వాళ్లకులంలో ఎవ్వరూ పిల్లనివ్వ లేదు. తిరిగి తిరిగి ఓరోజు మునగాలలోని మా దొరగారి దివాణానికి అతిథులుగా వచ్చారు మామగారు.

వేసవికాలం, ఇంటెనుకున్న మామిడిచెట్ల కింద మంచాలమీద కూర్చొని కల్లుతా గుతు, ముక్కలు తింటున్నరు. ఇంట్లోని ఆడవాళ్లకు అమ్మ అవి ఇవి అందిస్తూ నన్ను దొరవాళ్లు కూర్చున్న దగ్గర్కి పంపు తువుంది. నేను అప్పుడప్పుడె సంవర్త అయి పాలుపోస్తున్న మక్కకంకిలాగున్న. మా కాబోయే మామగారి దృష్టి నా మీద పడింది.

'దొరవారు ఎవరీ అమ్మాయి?' అని అడిగిండు.

'మా ఇంటి అంటుమొక్కె' అన్నాడు మా దొర.

'ఈ మొక్కను మా తోటలో ఎందుకు నాటకూడదు?'

'మొలిచిన మొక్కలు మస్తుండగ, అంటుమొక్క ఎందుకానీ!'

'ఇదిగో దొరవారు మనస్సు ఇప్పిచెపు తున్న, నాతో తూగేవాళ్ళే తక్కువ. ఆ తక్కువలో సొంత భార్య కొడుకు కాదు కదా అని గోత్రాలు లెక్కపెడుతు, ఎవరిని అడిగినా- మేం మీతో వియ్యం అందుకునే స్థితా, అంటూ తప్పించుకుంటుండ్రు'

'కొంత టైమ్ ఇవ్వండి. ఇంట్లో మాట్లాడి కబురంపుత. మీరు అమ్మాయి గురించి అబ్బాయికి ముందే తెలియపర్చండి ఎందు కైనా మంచిది' అన్నడు మా దొర.

మొత్తంమీద అన్నీ ఆలోచించే నన్ను కోడలుగా చేసుకునే నిర్ణయానికొచ్చిండ్రు. ఆ నిర్ణయమే ఖాయమైంది. నేను ఆ ఇంటి కోడలునైన ఆ రోజునుండి జానకిదే విన్నైన. మా ఆయన పుస్తకాల పురుగు. మా ఇంట్లోని గ్రంథాలన్నిటిని తీరిక వున్న ప్పుడల్లా నేనూ చదువుతూ వచ్చిన. తీరా చూస్తే మన జాతికి జాతే కలెగలుపు. మొదటనే క్రమశిక్షణతో కూడిన గట్టి పునా దులు వేయలేదేమో. ఎవరి స్వార్థంవాడు కాపాడుకుంటు మొత్తం సమాజాన్నే అతు కుల బొంతలుగా తయారుచేసారు.

నాకు ఇద్దరూ కొడుకులే. పెద్ద పెద్ద ఉద్యోగాలు చేస్తున్నరు. నాకు ఆడపిల్లలు పుడితె ఈ కులగోత్రాల మందలో వాళ్ళ సంబంధాలు వెతకటం కష్టంగానే ఉండేది. ఇప్పుడు అర్థమైందా గడులలో ఏముం టదో...."

సరిగ్గా అప్పుడే బాబు లేచి చిటికన వేలు చూపించిండు. పోయించుకొచ్చింది. బాబు మళ్ళీ ముడుచుకుండు.

"అది సరేనమ్మగారు. ఏకులంలో పుడితె ఆ కులవృత్తి తప్పదా.. మరోపని చేసి బతుకకూడదా?" అడిగింది గంగ.

"బతుకొచ్చు"

"మరీ మా అమ్మ ఎందుకు ఆ వృత్తిలో నే బతకాలంటది"

"అంటది, ఆమెకు ఏం తెలుసు? చదువుకోలేదుకదా? అంతే అంటది. అయినా ఆమె తప్పేంలేదు. సమాజ నిర్మాతలే అలాంటి గీతలు గీసారు. ధైర్యం వున్న వాళ్ళు ఆ గీతలు దాటుతరు. నీమట్టుకు నీవు బాగానె ప్రయత్నం చేసినవు. కాని నీవు ఎన్నుకొన్నవాడు నిన్ను ముంచిపోయిండు. పాయె నీకో బిడ్డపుట్టె. రేపు దానిని సాదాలిగద? నీవు కూలినాలి అయిన చేసి సాదుతవు. అది వేరే విషయం. ఇట్లా ఎంతమంది నీలాగ సిద్ధమైతరు. చూస్తుండగానే పాములపుట్ట అని తెల్సి గూడ మీ అక్క వొదిగిపోయింది? ఈ రంకుతనం ఇప్పుడిప్పుడె మీ కులంలోనే పుట్టింది కాదు. ఎనకటి కాలంలో రాజవేశ్యలని వుండేవారు. ఒక్క రాజుల కాలమెందుకు, దేవతల కాలంలోనూ ఈ రంభ, ఊర్వశి, ఎవరు? వాళ్లే కదా? వాళ్లు హద్దు దాటితే భూలోకం వచ్చి శిక్ష అనుభవించిపోవాలి కదా? నా ఆలోచన మేరకు వాళ్ళను అట్లా చూపి మనలను అదుపు చేయాలని చేసింద్రు. అట్లాగే దేవదాసీలు, దేవునికి పవ్వళింపు సేవలు చేస్తూ దూరదూర ప్రాంతాల నుండి వచ్చే భక్తుల కోరికలు తీర్చుతూ వచ్చే డబ్బును దీపారాధన అంటు దేవునికి చేస్తూ, ఇటు ధర్మకర్తలను, పూజారులను తృప్తిపరిచేవారు. ఇలాంటివాళ్లంతా ఇప్పటికీ కాస్త చాటుగనో నేటుగనో తమ తమ పనులు చేస్తునేవున్నరు. సంచిలో దుడ్లు సరసానికి మెట్లు" అని ఆగిందావిడ.

"అందుకే ఆ పేరు నాకు ఇష్టం వుండదు. అదో తిట్టులాగ అనిపిస్తది నాకు" అంది గంగ.

"పోతే మీ వృత్తిమీద నీకు ఇష్టం లేదు కదా? పోనీ మా ఇంట్లో పనిచేస్తవా? " అంది మళ్లీ తానే జానకిదేవి.

"చేస్తానమ్మగారు"

"ఇంట్లో అడిగి చెపుత. వారం రోజుల తరువాత కలువు. మా ఇంటి నెం. ఎ/07, హిల్ కాలని"

"సరే అమ్మగారు" అని చేతులు జోడించింది గంగ.

డాక్టరు నర్సులతో రౌండ్సుకు రాగానే మాటలు ఆపేసి లేచి నిలుచున్నరు. ఉన్న కొద్దిమంది రోగుల్ని చూసి మందులు రాసి, పాప మంచం దగ్గరికి వొచ్చి, పాప కడుపును వొత్తిచూసి, తన ఎడమ చేతి వేళ్లను పాప కడుపుమీదుంచి కుడిచేతితో కొట్టిచూస్తూ "రాసిన మందులు పోశారా" అని అడిగిండు డాక్టరు.

'పోసినం' అన్నట్టు తలాడించింది.

పొద్దున సరిగా చూడలేదో చూసినా మందుల గురించి ఆలోచిస్తున్నడో ఇప్పుడు పరీక్షగా చూసి "కడుపుమీద ఈ పసుపు గీతలేమిటి? " అడిగిండు.

మంత్రాలు ఏయించి, తీగజమ్మడిపాలు రుద్ది, పైనించి పసుపు అద్దింది మా అమ్మ" అన్నది గంగ.

"చూడమ్మ పైన పసుపు రుద్దితే లోపల ఇన్‌ఫెక్షన్ తగ్గుతదా? " అని అడిగిండు.

"అందరు అంటుంటే అట్లా మంత్రాలు

**కొత్తగాలి...**

**జాగింగ్ మెషీన్ కోసం**
**షాపింగ్**
**హీరో హోండాపై**
**రన్నింగ్**

– సోమిశెట్టి, కరీంనగర్

వేయించినం" అంది గంగ.

"మంత్రాలకు రోగంపోతే ఈ దవఖానాలు ఎందుకు, మా డాక్టర్లెందుకు" అన్నడు మెత్తగా నవ్వుతూ డాక్టర్.

గంగ మాట్లాడలేదు.

"నీవేమి భయపడకు ఈ మందులు వాడు" అంటూనే నర్సువైపు చూసి, మరో చీటిరాస్తూ "ఈ మందులు కొనుక్కొచ్చుకోమను" అంటూ డాక్టర్ కదిలిండు.

మరునాడు శివ, జమునక్క ఇద్దరొచ్చి నిలుచున్నరు. అక్కను చూడగానె దుఃఖం ఆగలేదు. అక్కను పట్టుకొని ఏడ్చింది. ఇద్దరూ ఏడుస్తు కాసేపు నిలుచున్నరు. వాళ్ళ ఏడుపు చప్పుడుకు పాపలేచి ఏడుస్తూవుంది.

"చాలు ఊర్కోండి. పాప ఏడుస్తుంది" అన్నడు శివ.

పనికట్టుకుని నిన్ను తీసుకొని వచ్చిండంటె ఎంత ప్రేమగల మనిషీ! అక్క నీవంటె ఎంత ఇష్టమో శివకు"

"ఏదో అంటరు కద" అని ఆగిపోయిండు అతను.

"ఏమంటరు? " అంది అక్క.

"అదే.. తొడ కల్సితే తొంబై ఏళ్లు గుర్తుంటరట"

"ఏయ్ పెద్ద పోజు. అంతవట్టిదె గంగ, అదేంలేదు" అంది అక్క.

"ఉండనీ లేకపోని అది వదిలేద్దాం. కాని మీరు మంచి స్నేహితులు" అంటు శివ వైపు చూసింది గంగ.

శివ నవ్వుతూ 'వస్త' అని అక్కడి నుండి కదులుతు, "ఆ చీటి ఇటు ఇవ్వు" అని తీసుకెళ్ళిండు.

అప్పుడు నాయుడు గుర్తొచ్చి మనస్సు కలత చెందింది. 'ప్రేమించి మోసం చేసినవాడు మోసకారె కదా' అని అనుకుంది.

శివతో తన స్నేహం గురించి జమున చెబుతోంది-

"నేను ఓరోజు సినిమాకు వెళ్లిన. ఆట వదిలి పెట్టిండు. అందరు వెళ్ళిపోతున్నరు. నన్ను ఉండమని సైగచేసిండు శివ. అందరు పోయింద్రు. గేటు మీదోళ్లు వెళ్ళిపోతున్నరు. ఈయన మిషన్ నడిపేటాయన కాబట్టి అందరు ఈయన చెప్పినట్టు వింటరు. ఒకన్ని పిలిచి బీర్లుతెచ్చి ఇంజన్‌రూంలో పెట్టమన్నడు. బీర్లు మిరప బజ్జీలు తెచ్చిపెట్టి పోయిండతను. ఇద్దరం ఇంజన్‌రూంలో కూర్చోని ముచ్చట్లు పెట్టుకుంటు తాగినం. తాగినంతసేపు అవే చిలిపి పనులు. తట్టుకోలేక అన్న 'మీ మగాళ్లు మీకు కావల్సినవి చేస్తరు. ఎదుటి వాళ్ల సంగతి ఆలోచించరు' అని"

'నీకేం కావాలి ఇంకో బీరా' అన్నడు.

> **కొత్తగాలి...**
>
> **జయాపజయాలు**
> **ఒకప్పుడు దైవాధీనాలు**
> **మరి నేడు**
> **ధనాధీనాలు**
>
> – శైలజామిత్ర, హైదరాబాద్

'నీవేం చేసినవో గుర్తుకు తెచ్చుకో. బీరు కైపు, నీ చిలిపి చేష్టలు రెండూ నన్ను విధి లేని స్థితికి తెచ్చినయి' అంతే అన్న.

అది చూసి 'ఏయ్ జమున తగ్గు తగ్గు' అని కూర్చోపెట్టిండు.

'చూడు మనకది ఓ పనికాదని నీకు తెలుసు, నాకు తెలుసు. కాని నాదో శపథం. నాకు పెళ్లయి సంతానం కలిగేవరకు పరాయిస్త్రీని కలిస్తే రక్తం కలుషితం అవుతుందని, వేరేవాళ్ళతో ఆ ప్రయత్నం చేయను' అన్నడు శివ"

అక్కచెప్పేది చెవులు రిక్కించి మరీ

వింది గంగ.

పాపకు బాగైంది. వారం తరువాత జానకిదేవి గుర్తొచ్చి వెళ్లి కల్సింది. పనిలో కూడ కుదిరింది. ఇంటిపని వంటపనికి వప్పుకుంది. జానకిదేవి ఇద్దరు మనమ రాండ్లను, మనుమన్ని ఉదయం సాయంత్రం కూర్చోపెట్టి చదివించడం, రాయించడం, స్కూల్‌కు తీసుకెళ్లడం, స్కూల్ నుండి తీసుకరావడం చేస్తూ వుంది. శుచిలో ఇల్లాలిని, రుచిలో ఇంటిల్లి పాదిని మెప్పిస్తూ వస్తుంది. గంగ శ్రమ, శ్రద్ధను చూసిన పక్కింటి ఇంజనీరు భార్య కూడ తన పిల్లల బాధ్యత గంగకే అప్పచెప్పింది. జానకిదేవిగారి ఇంట్లోని పుస్తకాలను తిరగేసే సమయంలో చదువూ వస్తోంది. అప్పుడప్పుడు తనకొచ్చే అనుమానాలను అమ్మగారిని అడిగి తెలుసుకునేది. అట్లా అట్లా గంగ పుస్తకాల పురుగైంది. నెలజీతం, ఆ రెండు ఇండ్లల్లో పాత బట్టలు తెచ్చి తల్లికిస్తూనే వుంది.

అయినా గంగ తల్లికి మింగుడు పడడం లేదు. ఏదోరకంగా పిల్ల మీదనో తల్లిమీదనో అక్కసు కక్కుతూనే వుంది.

ఓ రోజు గంగ తల్లి ఎంకమ్మత్తతో కానుగ చెట్టుకింద కూర్చోని, "తల్లి పీడ పోదాయె, పిల్ల పీడ పోదాయె!" అంది.

పిల్ల ఏడ్చింది.

"పిల్ల వుండడం మంచిదే! దానంతట అది వుంటుంది. జమున సంకన పిల్లను చూసి ఫ్యామిలిలైపు కావాలని వచ్చేవాళ్లు ఎక్కువ డబ్బులు ఇస్తరు సుమా" అంది ఎంకమ్మ.

"ఔను నిజమే" తల ఆడించింది తల్లి.

నాలుగేళ్ళ కాలం బాగానే గడిచింది. ఉన్నట్టుండి జానకీదేవి కుటుంబం బదిలీ మీద వేరేచోటికి వెళ్ళిపోగా గంగకు మళ్ళీ గడ్డు రోజులొచ్చినయి.

★ ★ ★

"ఏదీ ఓసారి నవ్వు" అంటూ గంగ బుగ్గ మీద చిటికవేస్తు 'అచ్చుపోసిన అందం' అనుకుంది మోతీ. ఆ బుగ్గ పోటుకు ఈ లోకంలోకి వచ్చిపడింది గంగ.

మోతీ చేష్టకు స్పందనగా గంగ నవ్వింది. అప్పుడామె ఎద కదిలింది. అది చూసిన మోతి "సొమ్ములు బాగానేవున్నయి. కానుపు తరువాత ఒళ్ళు చేసినట్టున్నవు కదా? మీ పాపకు ఎన్నేండ్లుంటయి"

"నాలుగో ఏడు పడ్డది"

"పాప గురించి ఏదో ఓటి చేద్దాం. మన మధ్య అది పెరగొద్దు" అంది మోతి.

గంగ ఓ నిట్టూర్పు వొదిలింది. సరిగ్గా అప్పుడే ఓకొత్త ఆలోచన తట్టింది. 'అవును బలహీనతను నెమరేస్తూ కూర్చోవద్దు, బలాన్ని పుంజుకోవాలి' అనుకుందామె.

ఆరోజు నుండి మోతిని అనుసరించసాగింది. గంగ నడకలో ఉత్సాహం పెరిగి ఏవి ఎప్పుడు జరగాలో అప్పుడు చకచక జరిగిపోతున్నయి. పరిచయాలు పెరిగినయి. అందరు ఆమెను పలకరిస్తున్నరు. ఆమె అందర్ని పలుకరిస్తూవుంది. పొద్దంతా రాజకీయపాఠాలు వినడం, రాత్రంతా వాళ్ళకు అన్నీ పనులుచేసి పెట్టడం- ఇదీ ఈ ఇద్దరి రోజువారి పని. మొదటిరోజు గంగ ముభావంగా తిరిగినా రెండోరోజు పలువురిని పలకరిస్తూ తిరిగింది. మోతి ఎదురుకాగ, నవ్వుతు ఏదో చెప్పబోయి చెపుతూ నవ్వింది

"ఏం జరిగింది? " అడిగింది మోతి.

"ఏంలేదు రాత్రి ఓ పెద్దాయిన గదిలోకి రమ్మంటె పోయిన. వంద చేతిలో పెట్టి గట్టిగ కౌగిలించుకోని ముద్దాడిండు. సున్నితంగా తప్పించుకున్న" అంది గంగ.

"చెప్పితి గదా ముడి ఇప్పకుండా మురిపించొచ్చని" అంది మోతి నవ్వుతూ.

"వాళ్ళంతే! దాంతోనే వాళ్ళకు తృప్తి. రాత్రి అనేది అందుకే పుట్టింది మరి! రాత్రి

కోసం ఎందరు ఎదురుచూస్తరు? పోగ తిండి ఎంతవసరమో శరీరాలకు అదీ అంతే అవసరం. మరీ రాత్రి ఓ పెద్దా యిన నన్ను నిద్ర పోనియ్యలేదు. అంతే కాదు నన్ను ఏదో అవకాశం చూసి ఢిల్లీకి పిలిపించుకుంటా అన్నడు. గుర్తుగా ఈ ఉంగరం ఇచ్చిండు" అంది మళ్లీ మోతి.

అట్లా వారం గడిచింది. శిక్షణ శిబిరం ముగింపుకొచ్చేసరికి గంగ ఎంతో ఆకర్ష ణను పెంచుకుంది. బడానాయకులు తమ విజిటింగ్ కార్డును ఇస్తూ ఆమె చిరునా మాను తీసుకుంటున్నరు. ఏదన్నా అవ సరం వుంటే అడగమన్నరు.

సాయంత్రం ముగింపు సమావేశం. రాష్ట్ర కమిటీని, జిల్లాల కమిటీలను ప్రక టించిండ్రు. రాష్ట్ర మహిళ విభాగపు కమి టీలో మోతి, గంగా పేర్లున్నయి. స్త్రీలు రాజకీయాల్లోకి రావటం అరుదైన రోజులు కాబట్టి వచ్చినవాళ్లకే అవకాశం. ఆ క్రమంలో వాళ్లిద్దర్కి స్థానాలు దక్కినయి. ఆనందంగా ఒకరినొకరు కౌగిలించుకొని ఆరోజు నుండి అక్కచెల్లెండ్లు అయ్యిండ్రు.

ఆ రాత్రి వీడుకోలు విందు. మరీ ముఖ్యుల కోసం సినిమా నటీమణులను పిలిపించి అలసటను తొలగించి ఆనం దాన్ని పంచే ఏర్పాటు జరిగింది. రాత్రి పత్రికలవాళ్ళు వాళ్ల కలాలకు, కెమెరాలకు మూతలు బిగించిండ్రు. అధికార పార్టీ రాజకీయ శిక్షణా శిబిరం కనుక అన్నీ అనుకున్నట్టే జరిగిపోయినయి.

ముగింపు సమావేశానికి హాజరు కావడా నికి ఆ సాయంత్రం ప్రత్యేక హెలికాప్టర్‌లో వచ్చిన జాతీయ యువనాయకుడు ఓ ప్రముఖతార ఒడిలో ఆ రాత్రి మత్తుగా నిద్రకు దూరమయ్యిండు.

తెల్లవారుజామున కార్లు రాష్ట్ర రాజధాని వైపు పరుగు తీసినయి. నిన్న సాయంత్రం వచ్చిన హెలికాప్టర్ తన దారినపోయింది.

నాగార్జునసాగర్ రెండువైపుల ఏ ఆర్భా టంలేని సాదాసీదా స్థానిక జనంతో వుండి పోయింది.

పొద్దున్నే ఇల్లు చేరుకున్న గంగకు వాళ్ళ తోటె వెళ్లిపోయిన మోతి మరీమరీ గుర్తొ చ్చింది. అంతేకాదు ఈ వారం రోజుల జాతర గుర్తుకు రాసాగింది. లోపలికి వెళ్ళ గానే ఎందుకో బిడ్డ ఏడ్చింది. బిడ్డను దగ్గ ర్కి తీసుకొని ఓదార్చినట్టుగ నుదురుపై ఓ ముద్దు పెట్టుకుంది.

గంగ తల్లి దగ్గుతు ఇంట్లోకొస్తూ- "ఈ వారం రోజులకు ఎంతొచ్చిందో" అని గును గుతు అడిగింది.

అది విన్న గంగ అప్పటివరకు తన సంకకున్న సంచిని తల్లివైపు విసిరింది. అందులో ఆ వారానికి పార్టీ వాళ్ళిచ్చిన బత్తాలు, ప్రముఖులు ఇచ్చిన టిప్‌లు వున్నవి. ఆ సంచిని సందుకలో భద్రంగా దాచి బిడ్డవైపు ప్రేమగా చూసింది తల్లి.




మహిళా సంక్షేమ మంత్రిగారు వస్తు న్నరని, స్థానిక కార్యకర్తలు అందరు విజయ విహార్ గెస్ట్‌హౌజ్ రావల్సిందిగ కార్యకర్తలందరికి పిలుపు వచ్చింది. అంద రితోపాటు గంగ వెళ్లింది. గెస్ట్‌హౌజ్ గేటునుండి లోపలివరకు పార్టీ కార్యకర్తలు, స్కూలు పిల్లలు స్వాగతం చెప్పడానికి నిలుచున్నరు. అనుకున్న సమయానికి ఓ

గంట ఆలస్యంగా మంత్రి రానే వచ్చింది. పోలీసుల హడావుడి.

రావాల్సిన ప్రభుత్వ అధికారులు వచ్చి పుష్పగుచ్ఛాలు అందిచ్చింద్రు. చివరన గంగ వెళ్లి తాను తెచ్చిన పూలదండను మంత్రిగారి మెడలో వేసి చేతులు జోడించింది. మంత్రిగారు అందరివైపు చూస్తూ చిరునవ్వు నవ్వి లోపలికి నడిచింది. ఆ తరువాత అక్కడ వున్న కార్యకర్తలను, అధికారులను పిలిచి మాట్లాడుతువుంది. అట్టాగె గంగకు పిలుపొచ్చింది. గంగ లోపలికి వెళ్ళగానే కూర్చొమ్మని సైగచేసింది.

గంగ కూర్చుంది.

"ఎందుకమ్మ మన మహిళలు రాజకీయాలను పట్టిచ్చుకోరు, దూరంగ దూరంగ వుంటరు. వంటవార్పులతోనె గడపటమా? ఇక దేశం ఎటుపోతుందో కూడ తెలుసుకోవల్నిలేదా? " అంది మంత్రిగారు.

గంగ మౌనంగ వింటుంది.

"ఇక్కడ మహిళా కార్యకర్తలు, సమాజ సేవకులు ఎక్కువగా లేనట్టుంది. వున్న ఇద్దరు ముగ్గురైనా కల్సి పనిచేయండి. ఎక్కువమంది ముందుకొస్తే పంచాయితి సర్పంచులు, కౌన్సిలర్లుగ, ఇంకా ప్రజాప్రతినిధులుగ ఎదగొచ్చు. ముఖ్యంగ ఎస్సీ, ఎస్టీ, బీసి వర్గాల నుండి ముందుకు రావాలి" అంది మంత్రిగారు మళ్లీ.

సరే అన్నట్టు తలాడించింది గంగ. తన చేతిలో వున్న కాగితాన్ని మంత్రిగారికి అందించింది.

మంత్రి కాగితాన్ని అందుకుని చదువుతున్నప్పుడు గంగ ఒకటి రెండు మాటల్లో తనకేం కావాలో చెబుతువుంది.

గృహిణులు తమ ఆదాయాన్ని పెంచుకోవటానికి, కుట్టుమిషన్లు ఇప్పించే ఏర్పాటు చూడవల్సిందిగా కోరింది. అంతే కాదు, తమ కులపు ఆడపిల్లలు డోలు కొట్టడం, గడెక్కడం నిషేధించి వాళ్ల బతుకుదెరువు కోసం ఏదేని ఉపాధిని కల్పించాలని కోరింది. కులవృత్తి చేయకుండ కట్టుదిట్టం చేస్తూ, పూట గడిచే దారి చూపించాలనీ కోరింది.

తప్పకుండ పరిశీలిస్తాననీ చెప్పింది మంత్రిగారు. అధికారులను పిలిచి 'కార్యకర్తలు ఏదేని పనిమీద కార్యాలయాలకు వస్తే సహకరించండి' అని కూడా ఆదేశించింది.

ఆ తరువాత బయటికొచ్చి, చెట్ల కింద నిలుచున్న మహిళలతో మాట్లాడి పంపించింది. ఈలోపు మధ్యాన్న భోజనపువేళ అయ్యింది. అక్కడి నుండి డైనింగ్ హాల్లోకి వెళుతూ గంగను గూడ రమ్మని సైగ చేసింది. వెంట గంగ నడిచింది. ఉమెన్ వెల్ఫేర్ అధికారులు భోజనం వడ్డించి, తాము బయటికొచ్చింద్రు. మంత్రి, గంగా ఇద్దరు మాట్లాడుకుంటు భోజనం చేసినాక మంత్రి వెయిటింగ్ రూమ్‌లోకొచ్చి అదీ ఇదీ మాట్లాడి అక్కడి స్థానిక స్థితిగతుల ను అడిగి తెలుసుకుంది. ఆ రాత్రి అక్కడే వుంది. చీకటి బాగ పడ్డంక ఉమెన్ వెల్ఫేర్ ఆఫీసర్ వచ్చి అప్పటివరకున్న తన స్టాఫ్‌ను పంపించి తాను ఉండిపోయి మంత్రి చెవిలో ఏదో చెప్పగ 'సరే' అని తలూపింది.

డిన్నర్ ముగిసింది. ఆఫీసర్ పక్కగదిలో వెళ్లడానికి లేవగానె గంగ కూడ లేచి నిలుచుంది.

"మీరు వెళ్లండి, గుడ్‌నైట్. గంగ నీవు కూర్చో పోదువుగాని బోల్ట్ వేసిరా" అంది.

గంగ బోల్ట్‌వేసి వొచ్చి కూర్చుంది.

"ఇంత రాత్రి ఎందుకు పోవడం? ఈ రాత్రికి ఇక్కడే పడుకో" అంది.

"సరే" అంటూ కూర్చుంది గంగ.

"ఉక్కపోస్తుంది. ఏసి ఎక్కువ చేయి"

గంగ వెళ్లి ఏసిని పెంచింది.

"నా ఆలోచనలు మీరిచ్చిన కాగితం

చుట్టే తిరుగుతున్నయి. అవును వాళ్లను ఇతర కులపు స్త్రీలు చాలా హీనంగా చూడడమే కాకుండా తమతో కల్సి నడవనీయరు. నీళ్ళ పంపు దగ్గర, చిల్లరకొట్టు దగ్గర దూరం దూరంగా ఉంటరు. తోటి ఆడవాళ్ళలాగ చూడనే చూడరు. వాళ్ళను ఆ ఊబి నుండి ఎట్లా కాపాడాలని ఆలోచిస్తున్న" అంటూ ఏదో మాట్లాడుతూనే నిద్రలోకి జారుకుంది మంత్రి.

గంగకు నిద్రపట్టలేదు. పొద్దున్నే షవర్ నీళ్ల శబ్దం. ఆ తరువాత సిబ్బంది రాక. కాఫీ, పత్రికలు టీపాయ్ మీదకి చేరాయి. పక్కరూమ్‌లో వున్న ఆఫీసర్ హడావుడిగ తయారై వొచ్చి- "గుడ్‌మార్నింగ్ మేడం! నిద్ర బాగా పట్టిందాండీ" అంటూ ఎదుటి సోఫాలో కూర్చుంది.

"నమస్కారం మేడం" చేతులు జోడించింది గంగ. ఆమె ప్రతి నమస్కారం చేసింది. మంత్రిగారు నిమిషాలమీద తయారై డైనింగ్ హాల్లోకి వెళ్లి అల్పాహారం ముగించేసరికి పోలీసులు వచ్చి నిలుచున్నరు. వాళ్ళ వందనాన్ని అందుకున్న మంత్రి హైద్రాబాదు వెళ్లిపోయింది.

సాగర్ చేరి, తన గుడిసెను చేరేసరికి తల్లి, ఎంకమ్మత్త మాట్లాడుకుంటున్నరు. గంగ వెళ్లి కానుగు చెట్టు కింద నులకమంచంలో కూర్చుంది.

"ఎటు పోయినవే గంగ.. చెప్పన్నా పోలేదు" అడిగింది తల్లి.

"మంత్రి గారొస్తె కలవడానికి పోయిన. రాత్రి ఆమె అక్కడే పడుకో అంటె అక్కడే పడుకున్న" అంది మామూలు ధోరణిలో.

"నీవు అక్కడ బాగానే వున్నవు. ఇక్కడ మీ చిన్నమ్మ కళ్లు తిరిగి పడిపోయింది. మధ్యరాత్రి ఇద్దరు బాగ తాగొచ్చి మీ చిన్నమ్మను నానా బాధలు పెట్టిండ్రుట. రాత్రంత దాన్ని నిద్రపోనీయలేదట. కడుపుల ఆసర లేక కండ్లు తిరుగగా తెల్లారిగట్ల 'పైసలిస్తే అట్టపోయి బన్నుతిని చాయ తాగొస్త' అన్నదట. ఇంకోసారి అయినంకా ఆకర్న ఇస్త అని ఒకరెనుక ఒకరు మీద పడ్డరట. తట్టుకోలేక సొమ్మసిల్లి పడిపోయింది. అది చూసి వాళ్లు పారిపోయిండ్రమో లేరు.

ఇంకా ఊకి చల్లడం లేదేందబ్బా అని పోయి చూద్దును కదా ఇంకా పడుకొనే వుంది. బుగ్గలమీద గాట్లు! కమిలిన రొమ్ములు! ఎండుక పోయిన డొక్క! నీరసంగా మూసుకున్న కనురెప్పలు! లేపి మొకం కడిగిచ్చి, ఓ బన్ తినిపిచ్చి చాయ తాగిస్తె అప్పుడు మాట్లాడింది" అంది ఎంకమ్మత్త.

గంగ మనసు చివుక్కుమంది. ఎంత

## మరింత కృషి చేసేవాణ్నే!

మాడపాటివారి షష్టిపూర్తి ఉత్సవం హైదరాబాదులోని రెడ్డిహాస్టల్ ఆవరణంలో 1946లో జరిగింది. ఆ సందర్భంగా మాడపాటివారికి తులాభారం చేశారు. ఓవైపు త్రాసులో ఆయనను కూర్చోబెట్టి, వెండిరూపాయలతో తూచారు. రూ. 6,400ల తూకమున్నట్లు తేలింది. 'ఈ పైకం మాడపాటివారి సొత్తు. ఆయన ఇష్టానుసారం ఉపయోగించుకోవచ్చు' అని కొండా వెంకటరెడ్డి అన్నారు.

దానికాయన సమాధానమిస్తూ, 'మా జీవితావసరాలకు తగిన రాబడి మాకున్నది. ఈ పైకమంతా కొండా వెంకటరెడ్డిగారే, ఇతరులతో కూడి ప్రజాహిత కార్యాలకు ఉపయోగించవచ్చు. తనకిలా సన్మానం జరుగుతుందని ముందే తెలిసివుంటే తూకం మరింత ఎక్కువయ్యేందుకు ప్రయత్నించేవాణ్ని' అన్నారు చమత్కారంగా.



ఘోరమని మనసుల ఘోషిస్తూ ఎన్నాళ్లీ బాధలు అనుకుంటూ కూలబడింది.

మరునాడు సూర్యాపేట నుండి మోతి, సాగర్ నుండి గంగా హైద్రాబాదు చేరుకుని శాంతి లాడ్జిలో రూం తీసుకున్నరు. స్నానాలు ముగించుకుని అల్పాహారం చేసి ఆటోలో సచివాలయానికి వెళ్ళి మొదట మహిళా సంక్షేమంత్రిగార్ని కలిసి ఓ నమస్కారం పెట్టిన్రు. ఆ తరువాత తాము చూడాల్సిన అధికారులను చూసి తమ పనులను చేసిపెట్టమని ఎదురు కుర్చీలో కూర్చున్నరు.

అధికారి వాళ్లనే రెప్పకొట్టకుండ చూస్తూ "చెప్పండి" అన్నడు. మోతి ఆ రోజు వాళ్ల సంప్రదాయపు బట్టలు వేసుకుంది. ఆ రోజే కాదు సిటీకొస్తే అట్లానే వస్తుంది. చూసేవాళ్ళకు అదొక ప్రత్యేక ఆకర్షణ. మోతి ధరించిన దుస్తులకున్న అద్దాల్లో ఎదుటి వాళ్ళ రూపాలు కనిపిస్తాయి. చేతులకున్న బొక్క గాజులు, బుగ్గల మీదుగ వేలాడే వెండి జుంకాలు సరేసరి. మోతి లేచి నిలుచుని "నేను గిరిజన సంక్షేమ అధికారిని కల్సి వస్త. గంగా నీ పని కానీ" అని అధికారివైపు చూసి "సార్ నేను మళ్లి కలుస్తాను" నమస్కరించి బయటికి నడుస్తుంటే అధికారి ఆమెనే చూస్తూ "వనమయూరి లాగుంది" అన్నడు. గంగ అతని అంతరంగం గ్రహించి చిరునవ్వులు పూయిస్తూ కూర్చుంది.

ఫైళ్లను టేబుల్ మీదుంచుతున్న అటెండర్‌తో "రెండు టీలు" అన్నడు ఆఫీసరు. అతను క్యాంటీనుకు వెళ్లి టీలు తెచ్చిపెట్టి బయటకు నడిచి చాలసేపటి వరకు లోపలికి రాలేదు. లోపలి మాటలు బయటకి వినపడడం లేదు. ఆయన చూపులు గంగ ఒంటిపైనే! ఎక్కడికి వెళ్లిన ఈ చూపుల





వేట తప్పదుగ అనుకుంది.

అదేసమయంలో మోతిలోపలికి వస్తూ "రావచ్చా" అంటు వచ్చింది.

"ఓసారి వొచ్చి వెళ్లావుగా. రెండోసారి రావటానికి ఇబ్బందేమిటి? " అన్నడు అధికారి చిరునవ్వుతో.

"ఇద్దరే వుంటే" అని ఆగింది, తనను అధికారి టేబిల్ కింది నుండి కాలుతొక్కడం గుర్తుకు తెచ్చుకుంటూ.

"పోయిన పని-" అడిగింది గంగ.

"ఇప్పుడే మొదలైంది. మంత్రిగార్ని కలిశాను. చూస్తాను అన్నరు. వారం రోజుల తరువాత సాగరొస్తున్నరట. మొదట సరె అన్నరు. ఇప్పుడేమో పట్టించుకోవడం లేదు. ఉలుకులేదు పలుకులేదు" అంది.

అధికారి మోతి వేసుకున్న డ్రస్‌నే చూస్తూ దానికున్న అద్దాలలో తన



బొమ్మను చూసే ప్రయత్నం చేస్తున్నడు.

"సర్, పనిచేసి పెట్టండి. మీ కష్టం ఉంచుకోం" అన్నది మోతి.

అధికారి నవ్వు ముఖంతో "అంటే లంచం ఆశ చూపుతున్నరా? " అన్నడు.

"కాదు లంచం అస్సలు కాదు. ఏదో బహుమతి" అన్నది మోతి సవరింపుగ.

గంగ నవ్వింది.

ఇద్దరు ఒకేసారి లేచి "వస్తం" అన్నరు.

"నేరుగా అక్కడికేరండి. ఎదురుచూపులు వద్దు సుమా" అన్నడు.

"నేనెందుకు? " అంది గంగ.

"మందు తాగి పోదువుగాని" అన్నడు.

"ఆమె తాగదులే. నేనున్నాగ" అంది మోతి. "తాగిన తనువు" అంటు కన్నుగొట్టింది మళ్ళీ తానే.

సరేనని అధికారి దగ్గర సెలవు తీసుకుని బయటకి నడిచిండ్రు.

"ఈ పని అయితే మనకు మంచి గిట్టుబాటు అవుతది కదా గంగ" అంది మోతి.

"ఏమోనక్క నాకిదే మొదటి కేసాయె. మొత్తం మీద బాగానె ఇస్త అన్నడు"

"నేను చూసుకుంటలే" అంది మోతి.

"అట్టనే" అంది గంగ.

"అవును అక్క, క్వార్టర్ కోసం మంత్రి గార్ని కలుద్దమంటివిగద" అంది గంగ.

"వట్టిగ కలుసుడేంది.. రాయించుకునే పోదాం" అంది మోతి.

ఇద్దరు నీటిపారుదల విభాగం వైపు నడుస్తుంటే- "గంగ బొమ్మలై కూర్చోకు! కాస్త నవ్వాలే! నవ్వు ఓ మంత్రమే తల్లీ" అంది మోతి.

ఎదురయ్యే జనం ఈ ఇద్దర్నీ ఒకటే చూపు చూస్తున్నరు.

మోతి వేసుకున్న బంజార బట్టలు, తెల్లని ఏనుగుదంతపు గాజులు, తలకున్న వెండి కుచ్చుళ్ళు వనలక్ష్మి లాగుంది.

అట్ల వుండడం ఓ పెద్ద ఆకర్షణ అయ్యింది. జనం అట్లా వెర్రిగా చూస్తు న్నది గ్రహించిన మోతి మరీ వయ్యారంగా నడుస్తూవుంది.

ఎదురొచ్చే వాళ్ళలో ఓ వ్యక్తి చూడనట్టు వచ్చి మోతి భుజానికి తాకి పడబోయి తమాయించుకుని మళ్ళీ ఆమెనే పట్టుకుని నిలబడ్డడు.

"ఎటు చూస్తున్నవు? ఎటు నడుస్తు న్నవ్? " అంది కళ్ళు పెద్దవిచేసి మోతి.

అతను తికమకగా చూస్తు "సారీ" అంటు పక్కకు పోయిండు.

"పాపం తాగినట్టున్నడు" అంది గంగ.

"తాగటమా ఇంకేమన్ననా! తగలాలనే! మనం కూడ వాళ్ళను అప్పుడప్పుడు ఆట ఆడిస్తుండాలి"

"అక్క ఇక్కడ పని చూసుకుని నాంపల్లి వెళ్లాలి" అంది గంగ.

"ఎందుకు? "

"నీకు నేను చెప్పనేలేదు, ఆ మధ్య ఎస్. ఎస్.సి. పరీక్ష రాసాను, పాసు కూడ అయ్యాను. ఇపుడు ఇంటర్ రాయాలి అను కుంటున్న" అంది నవ్వుతూ.

"మంచిదేకదా? " అంది మోతి.

"మనం నల్లగొండలో దిగి ఇ.ఇ.ని, ఫారెస్టోన్ని కలిసిపోవాలి! ఆ ఇద్దరి పైర వీలు చేసినం గదా? " అని ఆగింది. గంగ సరే అన్నట్టు చూసింది. ఇద్దరు అక్కడి నుండి కదిలిండ్రు.

"ఆ తరువాత కోఠీకి వెళ్ళి పాత పుస్త కాల షాపుల్లో కొన్ని మంచి పుస్తకాలను కొనుక్కొని పోవాలి" అంది.

"పరీక్షల చదువుడు పర్వాలేదు చదవా ల్సిందే. ఆ పాత పుస్తకాలను చదువుడెం దుకే తల్లీ" అంది మోతి.

అప్పుడు గంగకు జానకీదేవి గుర్తొచ్చి ఆమె గురించి చెపుతూ, "వాళ్ళింట్లో పని చేసేటప్పుడు వాళ్ళ పుస్తకాల అలమార ల్లోని పుస్తకాలన్నీటిని చదివేసిన. అప్పటి నుండి పుస్తకాలు చదవడం అలవాటైంది. పుస్తకాలు చదవటంవల్ల చాలా విష యాలు తెలుస్తయక్కా" అంది.

ఆ తరువాత లాడ్జికెళ్ళి గంగ రూమ్ లోనే వుండిపోయింది.

మోతి తయారై బయటికి వెళ్ళింది.

స్టార్ హోటల్ ముందు ఆటో ఆగింది. అందులో నుండి మోతి దిగి రిసెప్షన్ ఎదురుగా సోఫాలో కూర్చున్న అధికారి పక్కన్నె కూర్చోగానే "ఇక్కడికి మావో ళ్లొస్తుంటరు. గదిలోకి పద" అంటు లిఫ్ట్ దగ్గరికి నడిచిండు.

వెనకాల మోతి.

బటన్ నొక్కుతున్నపుడు "కొంచెం ఆగండి" అని ఓవ్యక్తి వచ్చాడు. రాజకీయ నాయకుడిలా వున్నడు. వెంట కదిలే నల్ల రాయి శిల్పాల్లాంటి ఇద్దరు ప్రౌఢలు. నవ్వుతూ నడుస్తుంటే, అక్కడ చూసేవాళ్ళ కనురెప్పలు కాసేపు కదలనట్టుంది. లోప లికి వచ్చి, నాలుగు నొక్కిండు. అది మూడులో ఆగగానె ముందెక్కిన ఇద్దరు బయటికి నడిచిండ్రు. లిఫ్ట్ పైకి పోతున్న ప్పుడు నాయకుడు ఆ ఇద్దరి నాయికల బుగ్గలను తన బుగ్గలకు ఆనించుకుంటు, తన పాదాలను వాళ్ల పాదాల మీదుం చాడు. రెప్పపాటున ఆ పాదాలు కానరా కుండా పోయినయి.

"వాళ్లకు అంత తొందరెందుకో" అని ఆగిండు అధికారి.

మోతి నవ్వుతూ "అది అంతే" అంది.

ఆయన గది తాళం తీసి రూమ్‌లో నడుస్తుంటె వెనకాలే మోతి.





కాలింగ్‌బెల్ నొక్కి, సర్వర్ రాగానే కావల్సినవన్నీ చెప్పి పంపిండు.

మోతి అద్దం ముందు కూర్చోని తన రూపాన్ని తానే చూసుకుంటుంది. మోతి అప్పుడు చీరె జాకెట్‌లో వుంది.

అధికారి ఫ్రెషప్ కావడానికి వెళ్ళిండు.

కాసేపటికి ట్రేలో అన్నిటితో వచ్చిన బాయ్, అన్నీ టిపాయ్ మీద సర్ది వెళ్ళాడు. స్టాండ్ మీదున్న టవల్‌ను తీసి అధికారికి అందించింది.

ఆయన టవల్‌తో అద్దుకుంటు వెళ్లి, డోర్‌లాక్ చేసి 'డోంట్ డిస్టర్బ్' అనే స్విచ్‌ను వేసి వచ్చాడు. తలుపు పక్కన అది వెలుగుతూ వుంది. ఈ లోపల మోతి గ్లాసుల్లో విస్కి సోడ కల్పి వుంచింది.

"మోతీ! ఓసారి ఇటురా" అని అధికారి నిలువుటద్దం ముందు నిలుచుండు. ఆమె వెళ్లి నవ్వుతు అతని ఎదురుగా నిలుచుంది. ఇద్దరి చేతులు వాటంతట అవే లేసి ఒకరి వెన్నున మరొకరి చేతులు వాలి వేసైనయి!

ఆ తరువాత ఎదురెదురుగా కూర్చున్నరు. మొదటి రౌండ్ అయిపోయింది. మోతి మళ్లీ గ్లాసుల్లో వంపింది. ఎదురుగా వున్న ప్లేట్స్‌లో ప్రాన్స్, కాజు తరుగుతూ వుంది. అంతవరకు ఎదురుగా కూర్చున్న మోతి పక్కకొచ్చి కూర్చుంది.

"ఇది అవసరమా" అన్నడు ఓ కన్ను మూసి తెరుస్తూ.

సుతారంగా కొంగు తొలగించింది.

అతను అక్కడే చూపు నిలిపాడు. ఆమె గ్లాసు అతని పెదాల దగ్గర ఉంచింది.

"నిన్ను చూస్తుంటె డ్రింకెందుకు చెప్పు" అన్నడు.

ఆమె మాట్లాడలేదు. అయినా ఆయన "చెప్పు చెప్పు" అని అంటూవుంటే మళ్ళీ గ్లాసు అందించింది.

మళ్ళీ గ్లాసులు నింపుతూ వుంటే-

"ఇందాకాయన వెంట ఇద్దరు కదా? " అడిగాడు.

అవునన్నట్టు తలాడించింది.

"ఒక్కరికి ఇద్దరెందుకో? "

"ముందు ఇదికాని చెపుత" అంది గ్లాసం దిస్తూ.

"నీ వెంట వున్నామె ఏది? " అన్నడు.

"ఆమె ఎందుకొస్తది, పని నాదికదా? "

"ఆఫీసుకు ఇద్దరొస్తిరి కదా? "

చెప్పక తప్పింది కాదనుకొని "ఆమె భర్త ఉస్మానియాలో వున్నడు. ఈ రాత్రి ఆయన దగ్గర ఉండాలని పోయింది. భర్తకు బాగలేనపుడు తప్పదు కద బాసు' ' అంటూ అతని కాలుపై చేయివేసింది.

ఖాళీ ప్లేటువైపు చూస్తూ "ఇంకా ఏమైన" అన్నాడు.

"బాసు.. ఇంట్లో మా అక్క మంచిగ చూడదూ? " అడిగింది.

"చూస్తది, ఎందుకు చూడదు? దేవుని లాగ చూస్తది"

"మరింకేమి? బయటెందుకు బాగోతం" అంటు ఓ కన్ను మూసి తెరిచింది.

"అర్థంకాలేదా? దేవునిలాగ చూస్తది. అంటే ఎదురుగా కూర్చోని రెండు చేతులు జోడించి భజన చేస్తది. సోమారం ఓ ఒక్కపొద్దు, శుక్రవారం ఓ నోము. ఇట్లా

## కొత్తగాలి...

**అల్లుడు**
**కొడుకయ్యేడు**
**కోడలు**
**కూతురయ్యేదెప్పుడో?**

– ఆర్. సూర్యలక్ష్మి, హైదరాబాద్

ఇంట్లో నన్ను దేవున్ని చేస్తది సుమా" న వ్వుతూ ఆగిండు.

"మోతీ! మొగోనికి కావల్సింది భజనేనా చెప్పు" అని అన్నడు మళ్ళీ తానే మాటలు తడబడుతూ వుంటే.

మోతి మాట్లాడలేదు. మందుగ్లాసు అందించింది.

"చెప్పవేం? నా భార్య బాగ చదువుకున్నది, లక్షలు కట్నాలు తెచ్చింది. అయితే" అని మోతివైపు చూసిండు. ఆమె వింటు మధ్య మధ్యన 'చ్చో, చ్చో' అంటువుంది.

"ముద్దు వద్దంటది. ముడి విప్పనీయదు. మందు తాగిన్నాడు మంచమెక్కొద్దు. ఇంకెందుకమ్మ చెప్పు, నీవే చెప్పు" అని రెట్టించాడు అప్పుడతని ముఖంలో చెప్ప లేని చికాకు కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. వర్తమానంలో గత కదలికలు.

కాసేపు మౌనం తరువాత మోతి ఆయన ముఖాన్ని చేతుల్లోకి తీసుకుని ముంగురులు సరి చేసింది.

అప్పుడతడికి ఓ కొత్త అనుభూతి కలిగిందేమో కాసేపు మౌనం వహించిండు.

ఆ తరువాత కాలింగ్‌బెల్ నొక్కి బాయ్ రాగానే "రూమ్ ఖాళీ, బిల్ తీసుకరా" అన్నడు. మనిషంతా ఒక్కసారె మారిపోతున్నది చూసిన ఆమె,

"మీ మూడు-" అంటు ఆగింది.

"అదేం లేదు" అన్నాడు.

"ఏది నా కళ్ళలోకి చూసి సెప్పండి" అంటు ఆయన కళ్ళలోకి చూసింది, ఆయన గడ్డాన్ని కదిలిస్తూ.

అప్పుడతని ముఖంలోని మబ్బు మాయమైంది.

ఇంతలో కాలింగ్ బెల్ మోగింది.

ఇద్దరు సర్దుకుని కూర్చున్నరు.

బోయ్ బిల్లున్న సాసర్‌ను ముందుంచి నిల్చున్నడు. అధికారి జేబులోని నోట్లు సాసర్‌లోకి, సాసర్‌లోని బిల్ బుట్టలోకి చేరినయి!




**మో**తి బస్ దిగగానే ఎదురెల్లిన గంగ, నవ్వుతు చేతిలో చేయివుంచి, తాను వుంటున్న ఇంటికి తీసుకెళ్లింది. తాళాన్ని తీస్తూ "నిన్ననే సున్నం వేయించిన. బాగుంది కదు? " అంది.

"చాల బాగుంది! ఎందుకుండదు? వొట్టిగొచ్చిందా.. దాని వెనక ఎంత శ్రముందో నాకు తెలుసుగా" అంది మోతి ఓ కన్ను మూసి తెరుస్తూ.

"ఇంతకు ముందో ఎ.ఇ.గారుండేదట" అంది గంగ.

"మొత్తం మీద బాగుంది. పెద్ద పెద్ద వాళ్లు వచ్చేదాయె. ఈ మాత్రం ఉండకుంటే ఎట్లా? " అంటు నవ్వింది మోతి.

పనిమనిషొచ్చి వంట మొదలుపెట్టింది.

ఇద్దరూ పడక గదిలో కూర్చొని ముచ్చట్లలో మునిగిపోయింద్రు. ఇ.ఇ.గారి మనిషొకాయన వచ్చి తొంగిచూసి పోతుంటే గంగ బయటికొచ్చి అతన్ని వెనక్కు పిలిచి, "నిన్న ఈ ఇంట్లో దిగినం. పోతూపోతూ సార్‌ను ఓసారి ఇక్కడకొచ్చి పొమ్మను" అంది. మోతి గూడ బయటికొచ్చి కనపడింది. 'అలాగే' అన్నట్టు అతడు తలాడించి సైకిల్ వేగాన్ని పెంచిండు.

"వస్తడంటావా? "

"నిన్ను చూసిండుగా వెళ్లి చెబుతడు.

తప్పక వస్తడు" అంది గంగ.

"నేను ఈవూరిదాన్నా? నా దగ్గరికి రావ డానికి కొంచెం బిడియ పడతడు"

"కాని నీవు వున్నవుగ. నీవె రప్పిస్తవు. వస్తడు చూడు. ఇల్లిచ్చినందుకు మనం ఏదైనా పార్టి కూడ ఇవ్వాలిగా" అంది గంగ.

"అవును ఇవ్వాలి. ఏం పార్టి ఇద్దాం?" అంది మోతి.

"ఏదంటె అది! మనం ఇవ్వగలిగింది"

వంట గదిలో చేపల వేపుడు చేస్తున్న పని మనిషిని పిలిచి "బజారుకు వెళ్లి అర డజను బీర్లు పట్టుకురాపో" అంటూ డబ్బులు ఇచ్చి పంపింది గంగ.

ఇల్లు చాల బాగుంది. ఒకవైపు మామి డిచెట్టు, మరోవైపు మునక్కాయల చెట్టు, రాళ్లతో పేర్చిన ప్రహరీగోడ దాదాపు అన్నీ ఇండ్లు అట్టాగె వున్నయి. చిన్నగేటు. ఇంటి ప్రహరీ గోడకు ఇంటి నెంబర్లు. చూడముచ్చటుగా వుంది ఆ ఇల్లు.

సాయంత్రపు నడకగ, సరాసరి ఇంట్లోకి వచ్చేసిండు ఇ.ఇ.సారు. ఆయనకు ఈ ఇల్లు కొత్తేమి కాదు. ఏ.ఇ. వున్నప్పుడు అప్పుడప్పుడు కలుసుకుంటూ వుండేవాళ్లు కూడ. సీసాల్లోని చల్లని బీరు గ్లాసుల్లోకి పారింది. ఇ.ఇ.కి ఎదురుగ మోతి. ఇద్దరి చేతుల్లో గ్లాసులు. గంగ వంటింట్లోకి నడి చింది. కొంతసేపు మౌనం తరువాత "మంచి ఇల్లే ఇచ్చిండ్రు సారు" అంటు నవ్వింది మోతి.

"మంత్రిగారితో చెప్పిస్తిరయె!" అంటు మొదటి గ్లాసును కాళీ చేసిండు.

మోతి మెల్లెమెల్లగ తాగుతూ వుంది. అప్పుడే కరంటు పోయింది.

గంగ కొవ్వొత్తి ముట్టించి టీపాయ మీద వుంచింది.

"అబ్బా గాలి ఆడటం లేదు" అనగానె మోతి వంగి ఆయన షర్ట్ గుండీలు విప్పింది. ఈ లోపల పోస్ట్‌మన్ ఫోన్ అంటూ కేక.

"అక్క ఫోనొచ్చె. మాట్లాడొస్త" అంటు బయటికి నడిచింది గంగ. వెంట వంటమ నిషి నడిచేది చూసి "అన్ని అయినట్టేనా?" అని అడిగింది.

"అన్నీ అయినయి అమ్మగారు. అందుకే వెళుతున్న" అంది.

ఈలోపు పోస్టాఫీసు రాగానే గంగ వెళ్లి వరండాలో నిలుచుంది. పోస్ట్‌మాస్టర్ ఫోన్ అందించగ "హల్లో గంగగారా? నేను కమలక్కను మాట్లాడుతున్న. రేపు పది గంటలకు అక్కడ హిల్‌కాలనీలో ముంపు బాధితులకు చెక్కులు, ప్రభుత్వ భూముల పంపిణి పట్టా సర్టిపికెట్లు పంచు తారట. తహశీలుదారును ఓసారి కల వండి. మోతికి ఫోన్‌చేస్తే నీ దగ్గరికే వచ్చిందని చెప్పారు. మీరిద్దరు చుట్టూ తండాలలోని, గూడాలలోని రైతులను తోల్కోనిపోండి"

"సరే అక్క" అంటున్నపుడే ఫోన్ కట్ అయ్యింది. కరెంటు వచ్చిందాక అక్కడే కూర్చుంది. పోస్టాఫీసుకు ఓ జనరేటరుండ టంవల్లా అక్కడో బల్బ్ వెలుగుతూ వుంది. కాసేపటికి కరెంటు రాగానే ఇంటి తోవ పట్టింది. బస్‌స్టాప్‌లో టాకీసుకు వె ళుతున్న శివ కలిసి 'తరవాత మాట్లాడుత షోకు టైమ్ అయింది' అంటు నవ్వుతు తన దారిని తాను పోయిండు.

గంగ ఇల్లు చేరేసరికి మోతి వొక్కతె కాంపౌండ్‌లో అటు ఇటు తిరుగుతూ వుంది.

గంగ లోపలికి వచ్చి "ఏంటక్క ఒక్కదా నివే, సారూ?" అని ఆగింది.

"వెళ్లిపోయిండు"

"ఏం, అప్పుడే?" అని అడిగింది గంగ.

"తలనొప్పిగా వుందట"

"అట్టనా, అమ్మమ్మ చిట్కాను వాడకపో

యినవా? " అంది ముసిముసిగా నవ్వుతు.

సరిగ్గా అప్పుడే రోడ్డుమీద ఎవరో పొడి దగ్గు దగ్గుతూ నడిచిండు. ఇంతవరకు ఖాళీగా వున్న ఆ ఇంట్లో ఇద్దరు ఆడవాళ్లు కనిపించేసరికి దారేపోయేవాళ్లకు దగ్గులు తుమ్ములు మామూలే మరీ! ఇద్దరు లోప లికి వెళ్లి కూర్చుంటున్నప్పుడు గంగకోసం మరో గ్లాసునింపి అందించింది మోతి.

"అంత తొందరగ ఎందుకు పోయినట్టు గురుడు? " అంటూ గ్లాసును ఖాళీ చేసింది గంగ.

"అవును అమ్మమ్మకు చదువురాదు, శాస్త్రంరాదు. ఆ చిటుకెట్టా తెలిసిందం టవు? "

కొత్తగాలి...

**పాలిచ్చి పెంచినా**
**పాలించి చూపినా**
**మనిషి మనుగడకు**
**ఆడదే ఆధారం**

– ఎన్.కె. నాగేశ్వర్,
పెనుగొండ, ప.గో. జిల్లా

"అరమరికలు లేని అడవి బతుకులు. అంతేకాదు వాళ్లకంటే ముందు తరం వాళ్లు ఆనోట ఈనోట మోసుకొచ్చిన అను భవాల సారం కావొచ్చు. ఎట్టయితే ఏం? అట్ట చేయంగనే తలనొప్పి తగ్గుతూనే వుంటది" అంది మోతి ఏదో రహస్యం చెప్పినట్టు.

"చూడాలి నిజమో కాదో" అంది గంగ.

"అనుభవంలో నుండి పుట్టింది కదా? " అంది మోతి బీరు చప్పరిస్తు.

"అయితే ఇవ్వలేదు తీసుకోలేదంటవ్" అని అడిగింది గంగ ఖాళీ గ్లాస్ నింపుతు.

"లేదు. అసలు గురుడు ఎందుకో అదో మాదిరిగ వున్నడు. ఇంట్లో మేడం మూడు కరాబ్ చేసిందో ఏమో" అంది మోతి.

"ఈ ఆఫీసర్ల భార్యలు మొగలు తెచ్చె డబ్బునే లెక్కపెడతరు కాని వాళ్ల గుండె చప్పుళ్లు వినరు" అంది గంగ.

"అట్టా వింటే వాళ్లు వేరే స్త్రీల ఎదల మీద ఎందుకు వొరుగుతూ వుంటరు! చెప్పు? పగలు సిగ్గు, రాత్రి తాగినకంపు అని కసిరింపు. ఇక ప్రేమగా లాలించు దేది? అందుకే ఈ చిరాకులు!"

"అయినా సాయంత్రం నడకలో చల్లగా లికి సరికావాల్నే? "

"చల్లగాలికి కాకపాయె.. పిల్లగాలికి కూ డా కాకపాయె.. పోనీ మనకైతె పనిచేసి పెట్టిండు" అంది మోతి.

"నీడనిచ్చినోన్ని మర్చిపోతమా? " అంది గంగ.

"ఆడదానికి సాయం అరటి చెట్టుకు పోసిన నీరు వృథా కావు సుమా!"

గంగ నవ్వింది. మోతి నవ్వులో నవ్వు కల్సింది. గంగ వంటగదిలోకి వెళ్లి, వంట కాలు తెచ్చింది. ఇద్దరు తింటూ మాట్లాడు కున్నరు. ఆ తరువాత కూడ బాగా పొద్దు పోయిందాకా మాట్లాడుతూనే వున్నరు. తాము పైకి రావడానికి, ఏంచేయాలో ఎట్లా మసులుకోవాలో చర్చించుకున్నరు. అన్నింటికంటే ముఖ్యవిషయం "చెట్టుకు చెదలు పట్టకుండ చూసుకోవాలి" అంది మోతి.

"అవును మాను బాగుంటె మాన్యాలు సాధించవచ్చు" అంది గంగ.

మధ్య మధ్యన మాటల్లో "అవును నీ బిడ్డ ఎట్లా వుంది? " అడిగింది మోతి.

"బానె వుంది.. ముచ్చట సంబూరంలో మొగని మరిచినట్టు" ఆగింది గంగ.

"పెద్ద మనకున్నట్టు.." అంది మోతి.

అప్పుడు గంగ మౌనంలోకి వెళ్లింది. మోతి కల్పించుకుంటు "ఓహో నీకు

కొన్నాళ్లు ఉండేనేమోకదు? " అంది.

గంగకు నాయుడు తనను మాచర్లలో వుంచి కాపురం చేసిన రోజులు గుర్తొచ్చి నయి. తన చేతి గాజులను ఒక్కటే వేరు చేస్తూ మళ్ళీ కలుపుతు కాసేపు మౌనంగా వుండిపోయింది. అప్పుడు ఆమె కనుగుడ్ల చుట్టు నీరు వూరింది.

"గంగ గతం మరిచిపో! నీవు చేసింది కాదుగదా, వాడు చేసిన మోసానికి నీవేం చేస్తవు. నీవతన్ని మోసం చేస్తే బాధప డాలి గాని? " అని ఓదార్చింది.

"ఏదో చెప్పబోయి ఇటు మళ్ళినవు. అదేందో చెప్పు" అని భుజాలు పట్టుకుని కదిలించింది.

గంగ ఆలోచనలలో నుండి తేరుకుని "అదే ఇందాక వొచ్చిన ఫోను. ఎల్లుండి కమలక్క, డిప్యూటి కలెక్టర్ గారొస్తున్న రట. ముంపు భూముల బాధితులకు భూముల పట్టాలు పంచుతారట. కొందర్కి చెక్కులను ఇస్తారట. అందుకని అందర్ని తీసుకుని మనం రేపు తహశీలు దారు కార్యాలయానికి వెళ్లవలసి వుంది. పొద్దుగాల మనం తయ్యారైపోవాలి. మ రిచిపోవద్దు సుమా" అంది. ఇద్దరు నిదు రలోకి జారుకున్నరు.

పొద్దున్న తయ్యారై బయటికి వెళ్లేటపుడు గేటు ఇరువైపుల నాటిన కొబ్బరి మొక్క లను చూసి "ఈ కొబ్బరి మొక్కలను.." అని అడిగింది మోతి.

"నిన్ననే నాటిన" అంది గంగ గేటు పెడుతూ.

ముంపు బాధితులకు పట్టాల పంపిణి కాగానే గంగ, మోతి ఇంటితోవ పట్టారు. బస్‌స్టాండ్ చేరేసరికి సైకిల్‌పై పోలీసు వెంకటసామి ఎదురై దిగి, "మీ ఇంటికే వెళ్లొస్తున్న, తాళం వేసివుంది" అన్నడు.

"తహశీలు ఆఫీసు వెళ్లొస్తున్నం. క్షేమమె కదా? " అని, మోతివైపు చూస్తూ "వెంకట స్వామిఅంకుల్" అని పరిచయం చేసింది.

"నాకెందుకు తెలియదు? ఎంఎల్‌ఎ వెంట తిరుగుతుంటవుగ. ఈ మధ్య మీరి ద్దరు కల్సి తిరుగుతున్నరు కదా? సీని యర్ పోలీసోన్ని.. ఈ జిల్లాలో ఎవరేంది తెలియదా? " అంటు ముసిముసిగ నవ్విండు.

నవ్వులలో నవ్వు కలిపింది మోతి.

"విషయమేంటి అంకుల్" అంది గంగ.

"వస్తున్న, వస్తున్న.. పాయింట్‌కే వస్తున్న. ఓ యువజంట ప్రేమించుకొని పెళ్లి చేసుకుంటం అంటె కులాలు కుదర లేదు. వద్దన్నరట తల్లిదండ్రులు. ఇంకే ముంది? ఇల్లు విడిచి పారిపోతూ ఇక్కడే పోలీసులకు చిక్కిండ్రు. ఇట్లా పారిపో వడం నేరం అని స్టేషన్‌లో వుంచినం. ఇద్దరు మేజర్లే.. పెళ్లి చేసుకొండి అన్నం. మా వాళ్లు వొప్పుకోవడం లేదన్నరు. 'మీరు ఒకరినొకరు వొప్పుకుని పారిపోతే ఎంత దూరం పోయినా ప్రతిచోట మీకిబ్బందే! పోనీ మేంపెళ్లిచేయమా? ' అని అడిగినం. సరేనని తలాడించిండ్రు. అందుకని స్టేషన్ ఆవరణలో పెళ్లి. అక్కడి మామిడి చెట్టే పెళ్లి పందిరి. తలంబ్రాలు తయారికి, జిలకర బెల్లం సిద్ధం చేయడానికి మహిళ సంఘం వాళ్లను, అంగన్‌వాడి వాళ్లను తీసుకరమ్మన్నరు. వాళ్లంతా అటువైపు నుండి వస్తువున్నరు. మీరూ పదండి" అన్నడు పోలీసు స్వామి.

గంగ, మోతి ఒకరి ముఖం ఒకరు చూసుకుని, వెళ్దామని చూపులతోనే నిర్ణ యించుకుని "సరె, ఇంటికి వెళ్లి తయ్యారై వస్తం" అంటు కదిలిండ్రు.

"తొందరగ రండి. ముహూర్తం దాటిపో తది" అంటూ ముందుకు సాగిండాయన. ఇంటివైపు నడుస్తున్న ఇద్దరిలో గంగ మౌనంగా నడుస్తోంది. అది గమనించిన మోతి నవ్వుతు "నాకు పెళ్లి చేసుకోవాలి

అని వుంది" అంది.

గంగ మూడు మార్చుకుంటు "పిల్లవాణ్ని చూడమంటావా? " అంది సరదాగా.

ఇల్లు చేరింద్రు. పేరంటానికి తయారై, పోలీసు స్టేషన్ వైపు నడిచింద్రు. స్టేషన్‌లో మామిడి చెట్టు కింద పీటలు వేసి, ఆ యువజంటకు బాసిగం కట్టి కూర్చోపెట్టింద్రు. అప్పటికే వచ్చిన ఆడవాళ్లు బొట్టు పసుపు పెట్టుకుంటూ కనిపించింద్రు. చుట్టు పోలీసులు, ఎదురు కుర్చీలో ఎస్ఐ కూర్చోని వున్నరు. ఇద్దరు బొట్టు పెట్టుకుని, ఇద్దరికి బొట్టుపెట్టి నిల్చున్నరు. పక్కన కూర్చున్న పురోహితుడు మంత్రాలు చదువుతు, జిలకర బెల్లం పెట్టించి, దండలు మార్పించి పసుపుతాడుతో మూడు ముళ్లు వేయించిండు. మంగళ వాయిద్యాల చప్పుడు చేసారు. అందరు అక్షింతలు చల్లారు. పెళ్లితంతు ముగిసింది. పోలీసులు అక్కడికి వచ్చిన వాళ్లకు తమలపాకులు, అరటిపండ్లు పంచింద్రు.

ఈ లోపు యువజంట ఎస్ఐ కాళ్లు మొక్కి దీవెనలందుకున్నరు. ఆ తరువాత వరుసగా అందర్కి నమస్కరించి, అరుంధతిని చూడడానికి పక్కకు నడిచింద్రు. అప్పుడా ఇద్దరి కళ్లలో నీళ్లు తిరిగినయి.

అది చూసిన ఎస్ఐ "ఇక మీరు దంపతులయ్యారు. దేశమంతా తిరిగిన ఎవ్వరు ఏమీ అనరు" అంటు అక్కడి నుండి కదులుతు "ప్రేమించుకోవడం నేరం కాదు, కాని వెనక ముందు ఆలోచించుకోవాలి. దురదృష్టం ఏమిటంటే మనదేశంలో ఈ కుల పట్టింపులు, డబ్బుల దర్పం వంటి అడ్డంకులు వున్నంతవరకు ప్రేమికుల ప్రేమలు అంత సజావుగా సాగవు మరీ. వీటిని చూసి అడుగేయాలి సుమా. ఈ పెళ్లి కొచ్చిన అందర్కీ కృతజ్ఞతలు" అంటు అక్కడి నుండి కదిలిండు. అందరూ కదిలింద్రు. ఈ వార్త హిల్ కాలనీయే కాదు, ఊరంతా పాకింది. గంగ, మోతి జనం చర్చలోకి వచ్చింద్రు.

ఇంటివైపు నడుస్తున్నపుడు "పాప దగ్గరికి పోయొస్తివా" అని అడిగింది మోతి.

"వెళ్లొచ్చిన. బాగానే వుంది. ఈ సంవత్సరం బడిలో చేర్పించాలి"

"దానిని జనగాంలోని మిషన్ స్కూల్లో చేర్చుదాం. తిండి, బట్ట, చదువు అన్నీ వాళ్లే చూసుకుంటరు. అంతేకాదు ఆ స్కూల్ ఫాదర్ కూడ బాగా తెలుసు. పాపను అక్కడ చేర్చడం ఏమంతా పనికాదు" అంది మోతి.

★ ★ ★

గంగ తన తల్లివాళ్ల గుడిసెలు చేరేసరికి పొద్దు నెత్తిమీద కొచ్చింది. కానుగ చెట్టు కింద నులకమంచంపై జమున బోర్లపడుకుని వుంది. తలవైపు పాప అన్నం వండే ఆట ఆడుకుంటుంది. వండిన వుత్తుత్తి అన్నాన్ని తన బొమ్మలకు వడ్డిస్తుంది. గంగ ముచ్చటగా చూస్తు నిలుచుంది. గంగ వచ్చింది. గమనించని జమున "నాకు ఆకలేస్తుంది, కొంచం అన్నం పెట్టవా? " అంది.

"మరి నాకు? " అంది గంగ.

ఆ మాట విన్న జమున గంగవైపు చూస్తు లేచి కూర్చుంది.

"ఎప్పుడొస్తివే, రా కూర్చో" అంది.

గంగ బిడ్డనే చూస్తూ ముసిముసిగా నవ్వుతు, వళ్లోకి తీసుకుంటు మంచం మీద కూర్చుంది. తలమీద చేతులుంచి గాలికి ఎగిరివున్న జుట్టును సరిచేసింది. బుగ్గలను అదిమి ముద్దు తీసుకుంది. ద్రాక్ష పండ్లను తీసిచ్చింది. జమున ఆ పండ్లను కడిగి పాపకు తినిపిస్తువుంది. గంగ సంచిలో నుండి మూడు చీరెలను, రవిక గుడ్డల్ని తీసి మంచం మీదుంచుతూ "ఓటి నీకు, మరోటి అమ్మకు, ఇంకోటి పెద్దమ్మకు. ఈ దోతి షర్ట్ నాన్నకు"

"పండగ బట్టలా" జమున అడగగా అవు నన్నట్టు తలాడించింది గంగ.

"చిన్నమ్మకు ఓ చీరె రయిక తెస్తే బాగుండేది కదా? " అంది జమున.

"మరిచానక్క, పైసలిచ్చిపోత, కొనియి"

సరేనన్నట్టు తలూపింది జమున.

"అమ్మెక్కడ పోయింది? " పాప తల నిమురుతు అడిగింది.

"ఆకుల కోసం అడవికి పోయింది"

"అవును, అమ్మనుగాని, నాన్నను గాని నీవుంటున్న ఇంటివైపు రావొద్దన్నవా? " అని అడిగింది.

గంగ మాట్లాడలేదు.

"పోలీసు అంకుల్ చెప్పిండు. 'మీరెవరు అటు వెళ్లొద్దు. వెలితె మీరెవరో తెలుసు కుని గంగను చిన్న చూపు చూస్తరనీ మరీ మరీ చెప్పిండు. అందుకని ఎపుడన్న రావా లని నాకు అనిపించినా రాలేకపోతున్న"

గంగ మాట్లాడలేదు.

"మన బతుకులే అద్వాన్నపు బతుకులు. మనము మనుషులమే కానీ ఎవరు మను షుల్లాగ చూడరు. అది కూడా ఓ ఆడదా నిలాగా చూస్తారా.. లేదు, ఆటబొమ్మలా గనే! ఇక తోటిఆడవాళ్లైతే మనల అంటుకో నీరు, ముట్టుకోనీరు, కలిసి మెలిసి తిరగనీ యరు. బయటా అంతే, బడిలో అంతే, రేపు దీనిని బడిలో చేర్పితే తెలుస్తది"

"దీన్నిక్కడ చదివిస్తె గదా" అంది గంగ.

'మరీ ఎక్కడ చదివిస్తవ్ ఏం? ' అన్నట్టు చూసింది జమున.

"మా స్నేహితురాలు దగ్గర"

"అవును, దీని పేరు పెట్టవా? "

"బడిలో చేర్చెటపుడు పెడదాం, తీసుక పోతందుకే వచ్చిన"

జమున ఒక్కసారిగా మౌనంలోకి వెళ్లి పోయి, మంచం తాళ్లను వేళ్లతో అటు ఇటు కదిలిస్తూంది. ఎదురుగా పంది తన పిల్లలను తరుముతూవుంటే అవి మళ్లీ తల్లి దగ్గరికే వస్తున్నయి.

## అట్టడుగు జీవితాలకు దర్పణం



డా. బోయ జంగయ్య

దెబ్బయ్యో ఏట అడుగిడినా కలంబలం తరగని కవి, అగ్రశ్రేణి రచయిత డా. బోయ జంగయ్య. ఆయన నవలలు 'జాతర', 'గొర్రెలు' మైసూరు, ఉస్మానియా విశ్వవిద్యాల యాల్లో ఉపవాచకాలయ్యాయి. ఆయన నవల, కథలపై పరిశోధక విద్యార్థులు పీహె చ్‌డీ, ఎం.ఫిల్‌లు చేశారు. 'నా పేరు రాయొద్దు', 'కేసు వాయిదాపడ్డది', 'సాలిని' మొదలైన రచనల్ని ఇండియన్ క్లాసిక్స్ కింద అన్ని భారతీయ భాషల్లోకి అనువదించి టీవీ ఎపిసోడ్స్‌గా ప్రసారం చేశారు. ఆయన నాటి కలు, కవితలు, బాల సాహిత్యం, జీవిత చరి త్రలు, ఇలా ఎన్నెన్నో రచనలు చేశారు. శ్రీశ్రీ మెమోరియల్ బంగారు పతకం, ఉత్తమ నవల అవార్డు, చాసో స్ఫూర్తి అవార్డు తదితర పురస్కారాలు పొందారు. తెలుగు విశ్వవిద్యాలయం ఆయనకు గౌరవ డాక్టరేట్ ప్రదానం చేసింది. అనేక జాతీయ, అంతర్జా తీయ సభలు, సమావేశాల్లో ప్రసంగించారు. తన తాజా నవల 'పుట్టుమచ్చ'లో అట్టడుగు జీవితాల్ని ఎంత వాడిగా, వేడిగా చిత్రించారో మీరే చూడండి.

చిరునామా:
డా. బోయ జంగయ్య,
5-9-200, మాన్యం చెల్క,
నల్లగొండ-508001

జమున కళ్లు కాలువలైనయి. పాప లేకుంట తనకు ఎట్లా కాలం గడుస్తుంది? రోజు దానికి స్నానం చేయించడం, తలదువ్వటం, జడలు వేయడం ఎంతో ఆనందంగా వుండేది. మరి రేపటినుండి? తాను ఒంటరే కదా? ఏవేవో ఆలోచనలు చుట్టుముడుతుంటే దుఃఖం సుడులుగా తన్నుకొచ్చింది.

"ఎందుకేడుస్తున్నవు అక్కా? ఎన్నడైన అది మనల వొదిలిపోయేదే కదా? " అంటు తన కొంగుతో అక్క కళ్లను తుడిచింది గంగ.

జమున ఎక్కి ఎక్కి ఏడుస్తునేవుంది.

పాప ఇద్దరి ముఖాలను మార్చి మార్చి చూస్తుంది. నేను రాను అన్నట్టు చూస్తు వెళ్లి జమున వడిలో దాక్కుంది. అప్పటివరకు మౌనంగా రోదించిన జమున ఒక్కసారిగా పెద్దగా ఏడ్చింది.

"నిన్ను ఎక్కడికీ తీసుకెళ్లను, కొత్త బట్టలు బొమ్మలు కొనియ్యడానికి బజార్‌కు తీసుకెలుతున్ననంతే" అంది గంగ.

బొమ్మలనంగానే పాప లేచొచ్చి గంగ వళ్ళో కూర్చుంది.

"అక్కా, ఈ డబ్బు వుంచు" అంటూ మరికొన్ని నోట్లు ఇచ్చింది. గుడ్లనిండా నీరు వూరుతుంటే నోట్లవైపు చూస్తూంది జమున. ఆ నోట్లను అక్క రవికలోకి తోస్తూ "అమ్మవస్తె మళ్లీ కథ మొదటికొస్తది" అంది మంచం మీది నుండి లేస్తూ.

ఎక్కడెక్కడో తిరిగొచ్చిన కుక్క గంగను చూసి 'కుయ్ కుయ్' మంటు నాలికను ఎగనాకుతూ ఎదురుగా నిలుచుంది. ఇద్దరూ అక్కడినుండి కదలగానే కుక్క వాళ్లను వెంబడించింది.

"గంగా! శివ పెండ్లైందే, నీకు తెలుసా? " అడిగింది వెనక నడుస్తున్న జమున.

"నీవు పోతివా? " అని అడిగింది.

"మనల పిలుస్తరా? పదహారొద్దుల పండగనాడొచ్చి 'ఆ విషయం' గూర్చి తెల్సుకుండు"

"సినిమాలు నడిపేటోడు ఆయనకు తెలవదా? పోగ ఇంగ్లీష్ సినిమాలు చూస్తడాయే"

"ఏం చూసిన అసలు పని దగ్గరకొచ్చేసరికి అంతేలే!"

గంగ మాట్లాడకుండా నడుస్తుంది. జమున పాపను తీసుకుని భుజాన వేసుకుని నడుస్తూ బస్‌స్టాండ్‌ను చేరారు. బస్సు సిద్ధంగా వుంది. పాప, గంగ ఎక్కి కూర్చున్నరు.

బస్సు కదిలింది.

జమున వెనుకకు తిరిగి ఇంటివైపు నడిచింది.




**బ**స్ రాంపూర్ తండ దగ్గర ఆగింది. ఇద్దరు దిగి బండ్లబాట పట్టింద్రు.

ముందు నడుస్తూన్న మోతి "ఇక్కడికి మూడు కిలోమీటర్లు వుంటుంది తండ" అంది సంక బాగ్‌ను సర్దుకుంటూ.

"అంత దూరం నడవాలా? " అంది గంగ ఎడమ చేతిలోని చేతి సంచిని కుడి చేతిలోకి తీసుకుంటూ.

"ఈ నడకో లెక్కా? " అంటూ నడక వేగం పెంచింది మోతి. అంతలో బాటకు అడ్డంగా ఓ పాము పరుగెత్తింది. అది చూసిన మోతి ఆగింది.

గంగ 'అమ్మో' అంటూ మోతి వైపు దూకింది. పాము వెళ్లిపోయాక-

"ఏం పాము అక్కా?" అడిగింది.

"జెరిగొడ్డు అయ్యుంటది. అదయితేనే అంత పరుగు" అంది.

"నా వొళ్లు జల్లుమంది" అంది గంగ.

"అడవి కదా.. ఇవి మామూలే!"

"ఇండ్లల్లకు గూడ వస్తాయంటవా?" అని అడిగింది గంగ అనుమానంగా.

"రావు, ఇంటి చుట్టు తిరుగుతయి అనుకో. వాటి భయం వాటిది. నీవేం భయపడకు. మంచాలుంటయి. పాములు మంచం ఎక్కవు" అంది మోతి.

"అంతేనంటవా?"

"ఇక నీవు ఇట్లా భయపడితే రాత్రికి తండలో పడుకోలేవు"

గంగ మౌనం వహించింది.

ఓ కిలోమీటరు నడిచాక, ఆముదపు చేలు కనిపించినయి. చదును వున్నచోట అట్టాంటి చేలు కనబడుతుంటయి. బాటకు కొంచెం దూరంలో ఏపుగా పెరిగిన ఆముదపు చెట్లు కదులుతు వున్నయి. వాటివైపు చూపు నిలిపి "అక్కడ అక్కడ ఆముదపు చెట్లు కలుదుతున్నయి ఎందుకు?" అని అడిగింది గంగ.

మోతి ఆగి అటువైపు చూసి నవ్వింది.

"ఎందుకు నవ్వుతున్నవు అక్కా" అంది గంగ.

"ఇది అడవి కదా? ఎక్కడ జరిగేపని అక్కడ జరుగుతూనే వుంటుంది" అంది మోతి.

గంగ వంగిచూసి నోటిమీద చేయి వేసుకుని "వీళ్లకెక్కడ చోటు దొరకలేదా" అంది.

"సాటు ఎక్కడుంటే అక్కడే చోటు... అంతే!" అంది మోతి.

"నేనోమాట అడగనా అక్కా?"

"అడుగు"

"ఇప్పుడు ఎవ్వరన్న ఎదురైె మీలో ఒక్కరు కావాలంటె ఏంచెపుతవ్?" అని అడిగింది గంగ.

"ఏం చెపుత? నీ ఇష్టం అంట" అంది.

"అంతేనా, ఎదిరించటం ఏంలేదా?" అని అడిగింది.

"ఎదిరించేదెందుకు? ఆపద కొనితెచ్చుకునేదెందుకు? అడిగింది ఇస్తే పాయే! అంత మాత్రాన పోయేది ఏముంది?" అంది మోతి చిలిపిగా నవ్వుతూ.

"అవును అక్కా, మీదాంట్లో అన్న చనిపోతె అతని భార్యను తమ్ముడు చేసుకుంటడట నిజమేనా?" అని అడిగింది గంగ.

"చేసుకోకపోతే అతని పిల్లలు, అతని భాగం ఆస్తి ఆగమైపోదు?" అంది మోతి.

ఈలోపు గుడిసెలు వచ్చినయి.

మొట్టమొదటి గుడిసె మోతి మేనమామలది. మేనమామలు సర్కారు కట్టించిన కాలనీలో వుండటంవల్లా ఈ పాతఇంట్లో అమ్మమ్మ ఒకతే వుంటుంది. పక్కపాకలో రెండు బర్లు వుంటయి. ఇంకా కొన్ని పాతగుడిసెలు! కాలనీలో ఇళ్లు దొరకని వాళ్లు వాటిల్లో వుంటున్నరు.

పందిట్లోకి చేరగానే అమ్మమ్మ రాతెండి చెంబుతో నీళ్లిచ్చింది. నీళ్లు అందుకున్న మోతి జాలారిలోకి నడిచింది. వెనకాలే గంగ! ఇద్దరు దడిచాటు జాలారిలో కాళ్లు చేతులు కడుక్కొని వచ్చి పందిట్లో నులక మంచం వాల్చుకుని కూర్చున్నరు. ముసలమ్మ చెరో రాతెండి గ్లాసెడు మజ్జిగ ఇచ్చి నిలుచుంది.

"ఈమె నా అమ్మమ్మ, పేరు లచ్చిమి. అమ్మమ్మా! నేను చెప్పాను చూడు సాగర్‌లో గంగ అని ఓ స్నేహితురాలుంటదని, ఆమే ఈమె" అని పరిచయం చేసింది.

ఇక తాతయ్య లేడని ఆమె రాతెండి గోట్లే చెపుతున్నయి. అది చూసిన గంగ "తాతయ్య ఎట్లా పోయిండో" అని ఆసక్తిగా

అడిగింది.

"చెలుక పనిపోతుంటె ఎలుగ్గొడ్డు కొట్టిందట" అంది మోతి.

★ ★ ★

రాత్రి అయ్యింది. లచ్చిమి అమ్మమ్మ కిరోసిన్ లాంతర్ వెలిగించింది.

ముగ్గురు పందిట్లో కూర్చోని అది ఇది మాట్లాడుతున్నరు.

"ఎల్లుండి గట్టు జాతరకెళ్లొస్తం అమ్మమ్మ"

"సరె" అందామె.

"గంగ నీవు తప్పకుంట చూడాలి ఎంత మంది వస్తరనుకున్నవు. ఇసుక చల్లితె

## కొత్తగాలి...



**ఇచ్చి పుచ్చుకోవడం**
**మర్యాద**
**అడగకుండానే ఇచ్చేది**
**గౌరవం**

**– ఆకుల వెంకటజ్యోత్స్న, తెనాలి**

రాలదనుకో. ఎన్ని దుకాణాలనుకున్నవ్ ..గట్టు చుట్టూ అవే! గాజుల దుకాణాలు, మిఠాయి దుకాణాలు, మణియరపు, కుంకుమ కుప్పలు, పగడాలు- ముత్యాల దుకాణాలు ఒకటని చెప్పలేం!" అని ఊరించింది మోతి.

సరేనని తలాడించింది గంగ.

జొన్నరొట్టెలు, వట్టి చేపలు, దోస బుడమలు కల్పి వండిన కూరతో రెండు పల్లాలు తెచ్చి ఇస్తు "చూడదగ్గ జాతరమ్మ, ఎక్కడి జనం, ఎక్కడి జనం!" అంది అమ్మమ్మ.

మోతిలేచి ఇద్దరికీ మంచినీళ్లు తెచ్చింది.

"అవును అక్క, ఈ రొట్టెలు చూడు అమ్మమ్మ ఎంత పలుచగా చేసింది.. కాగితమోలె" అంది రొట్టెను తిరగేసి మల్లేసి ఆశ్చర్యంగా చూస్తూ గంగ. అవునన్నట్టు చూస్తూ పక్కన్నే కూర్చుంది మోతి.

"చేతులతో ఇంత పలుచగ చేయడం మీకే తెలుసు" అంది గంగ. తన వాళ్ల హస్తనైపుణ్యాన్ని తలుచుకుంటూ మోతి ముసిముసిగా నవ్వింది.

"అక్క నీవు నవ్వితే నాకే మతిపోతది. ఇక మొగాళ్ల సంగతి.." అంటు ఆగింది గంగ.

"రేపు జాతరలో చూస్తవుగా నా నవ్వు, అది విసిరే వలలో మగచేపలు గిలగిల కొట్టుకోవల్సిందే" అంటూ పెదాలను బిగపట్టి వదిలింది.

"అవును జాతరలో ఆడ మగ అందరు తమ సరదాలు కోరికలు తీర్చుకుంటరటగా, నిజమేనా? "అడిగింది గంగ.

"అంతే మరీ! అడవి తరువాత, అక్క డొక్కచోటే మరి ఎవుల్నైనలూ పట్టించుకోంది. వరసైన వారి సరసాలు, గాజులు మట్టెలు పెట్టించుడు, పంచదార చిలకల దండలు కొనిచ్చుడు"

"అవెందుకు ఎక్కువ బహూకరిస్తరో" అని అడిగింది గంగ.

లచ్చిమి కలుగజేసుకుంటు "ఏంలేదు, గాజులు ముంచేతులకు వుండడంవల్ల, ఎప్పుడూ కంపిస్తయి. కదిలి చప్పుడు చేస్తుంటయి. అవి చప్పుడు చేసినప్పుడల్లా అవి పెట్టించిన మనిషి గుర్తొస్తుంటడని. అట్టాగె మట్టెలు గూడ. మనవాళ్లు చాటు మాటు సరసాలతోనే ఎక్కువ సంతోషపడేది. అందుకని జాతర్లకొస్తు వుంటరర్ర. వళ్లుకు వళ్లు తాకించడం, రాసుకోవడం జాతరలోనే వీలైతది. అక్కడ అడిగేవాళ్లుండరు గదా? తడిగుడ్డను పిండితె నీరు ఎల్లిపోయి గుడ్డ అలుకగైనట్టు మనిషిలోని 'అది' అలా ఎల్లిపోతది. మనం గుళ్లమీద

చూస్తంకదా. ఆడమగ చేసుకున్న చిత్ర విచిత్రాలు గందుకే మరీ" అని తనకు తెలిసింది చెప్పింది.

తినడం ముగించగానే కంచాలను తీసుకుని జాలారివైపు నడిచింది లచ్చిమి.

"అక్క నీ మంచం ఇంకొంచెం నా దగ్గర్కి గుంజుకో" అంది గంగ.

తన మంచాన్ని గంగ దగ్గరికి గుంజుకుని వొర్గింది మోతి. అవి నులకమంచాలు కనుక అలుకగా వున్నయి. అది ఇది అనుకుంటున్నప్పుడే ఇద్దరికి కునుకు పట్టింది. నిద్రలోకి వెళ్లింద్రు.

పొద్దున్నే జాతరకు సిద్ధమై రోడ్డు మీదికొచ్చి బస్సుకోసం నిలుచున్నరు. బస్సు రాగానె ఎక్కి కూర్చున్నరు. బస్సు దురాసిపెల్లి దగ్గర ఆగింది. అప్పటికే జనం రోడ్డు మీద, బోడు చుట్టూర కిటకిటలాడుతున్నరు, ఇద్దరూ నవ్వుతు తుల్లుతూ మెట్లవైపు నడుస్తూవున్నరు. వున్నట్టుండి ఒక్కసారె మోతి ముందు నడుస్తున్న గంగ మీద తూలి పడిపోకుండా ఆమె భుజాలను అందుకుంది. ఉలిక్కిపడి ఇద్దరు ఒక్కసారె వెనక్కు చూసారు.

వెనక నవ్వుతూ ఓ యువకుడు.

ఎత్తుగా ఎర్రగా బుర్రగా జుట్టు లేవకుండ తలచుట్టు ఓ తుండు చుట్టుకుండు. కత్తిరించిన నల్లని మీసాలు, కళ్లల్లో చిలిపితనం, పెదాలపై చిరునవ్వు, కట్టిపడేసే చూపులు. చిరునవ్వుతో మోతిని మంత్రించ్చినట్టు చూస్తుండు.

మోతి ఎగాదిగా చూస్తూ మూతిని వంకర టింకరగా తిప్పుతూ "ఓసి నీవా? ఇచ్చి పుచ్చుకోనోడు వల్లంత గిచ్చి చూసె అన్నట్టు. ఎందుకా తాకుడు" అంది కొంచెం నిష్ఠూరంగా.

"ఏం ఇవ్వాలో చెప్పు" అంటూ మరొకసారి ఆమె భుజానికి తన భుజం తాకిచ్చిండతను. అది చూసిన గంగ తాను చూడనట్టే తన ముఖాన్ని మరొకవైపు తిప్పుకుంది.

"జాతరకొచ్చిన ఆడదానికి ఏం కావాలో మొగోనికి తెలియదా? " అంది మోతి.

"సరె పదా" అని ఇద్దర్నీ గాజుల, మట్టెల దుకాణాలవైపు తీసుకెళ్లిండు.

మామూలు దుస్తులు వేసుకున్నప్పుడు ధరించే గాజులు మట్టెలు కొనిచ్చినంక గంగను అతనికి చూపిస్తూ "ఈమె నా స్నేహితురాలు" అంది మోతి.

అతను విషయం గ్రహించి ఆమెకూ గాజులు మట్టెలు తీసుకొమ్మని సైగ చేయగా, తన వస్తువులు గంగకిచ్చి అతనిని అనుసరించిందామె.

గాజుల దుకాణందారు "అమ్మ మీరు కూర్చోని నిమ్మలంగ సరిగ్గా పట్టేవే చూసుకొండి. గాజులైనా, మెట్టెలైనా కాస్త వొదులుంటెనె సవ్వడి ఎక్కువ. సవ్వడే కదా సరసాన్ని పెంచేది" అన్నడు ముసిముసిగా నవ్వుతూ.

"ఆయన ఈ ప్రాంతంలో పెద్ద భూస్వామి. పిల్లనగ్రోవి లేని మాటల మాంత్రికుడు. సరసానికి సాలీడు!" అన్నాడతను మళ్లీ ఆమె చేతిని పిసుకుతూ గాజులను పెడుతూ తీస్తూ సైజు చూస్తూ.

"ఏదో కొత్త సామెత అన్నరు, సరసానికి సాలీడా? " అంది గంగ.

"కదా, సాలీడు వలలో చిక్కిన కీటకం మళ్లీ బయటికి వస్తదా? అదీగాక మోతికి పాత పరిచయమే కాని మరీ, నిన్నెట్టనో వొదిలిపెట్టిండు"

"కొత్త అని వదిలి పెట్టిండొచ్చు" అందామె సిగ్గు సిగ్గుగా.

"పట్టుకు కొత్త పాతేంది? జాతరలో ఇవన్నీ మామూలే" అన్నడతను సన్నసన్నగ నవ్వుతు.

గాజులు మట్టెలు అమ్మేవాళ్లు అదును చూసి పదునుగా మాట్లాడుతూ, సంతోష

పడుతూ ఎదుటి వాళ్లనూ సంతోషపరుస్తా రట. అప్పుడే బేరం బాగా జరుగుతదని వాళ్ల వరస!

ఈలోపు మోతి, అతను పక పక నవ్వుతు వొస్తువున్నరు. దుకాణం దగ్గరే నిల్చుని కన్పించింది గంగ.

"ఏం మోతి నీ దోస్తు మస్తున్నది!" అన్నడు ఓ కన్ను మూస్తు తెరిచి, బొటన వేలును చూపుడువేలు కొనలను కలిపి వొదులుతూ.

అంతేకాదు-"చూస్తుండు నేనిప్పుడు ఆమెను ఇట్టే పట్టేస్తా" అని కూడా అన్నడు.

"అంత ఈజీ కాదు, దాంతెరువు పోకు" అంది మోతి.

"ఆమె సంగతి అట్టుంచు, ముందు నీకే ఈర్ష్య కదు? " అతని మాట పూర్తికాకుండా నే గాజుల దుకాణం వొచ్చింది.

"అయ్యిందా? "

ఆ అన్నట్టు తలూపిండు గాజులాయన. గంగ చిరునవ్వుతో లేచి నిలుచుంది. గంగ నవ్వులో నవ్వు కలిపింది మోతి. వీళ్లిద్దరి నవ్వులో అతను నవ్వును కలిపిండు. మనుషులకు నవ్వు అవకాశం చాల అరు దుగ కలుగుతుంది.

"కావాలన్నవు కదూ? అక్కడ నాకు తెలిసినోల్లు నిలుచున్నరు పిలవనా? "

"పిలువు" అన్నడతను ధీమాగా

మోతి ఎదురుగా నిలుచున్న గుంపును రమ్మని సైగ చేసింది.

వాళ్లు అదోరకంగా చప్పట్లు కొట్టుకుంటు వచ్చి నిలుచున్నరు. గురుని వైపు వేలు చూపి నవ్వుకుంటూ గంగతో కలిసి పక్కకు నడిచింది మోతి.

వాళ్లు 'బావ బావ' అంటు అతని చుట్టు ముట్టిండ్రు. ఇక చూడు భూస్వామి కాళ్ల కింది భూమి కదిలింది.

అది చూసిన గంగ పడిపడి నవ్వింది. మోతి భుజాన్ని తట్టింది.

"మరి లేకపోతే-" అంటూ ఇద్దరు అక్కడి నుండి కదిలిండ్రు.

మోతి, గంగ కలిసి జాతర అంతా కలె తిరుగుతూ వుంటే పోకిరి పోరగాండ్లే కాదు.. సంసారపక్షం మగవాళ్లూ రాసుకు పూసుక తిరుగసాగిండ్రు. ఎంతోమంది యువకులు మోతికి బత్తీసలు, చిలుకల దండలు కొనిచ్చిండ్రు. ఒకడు బుగ్గను నొక్కితే మరొకడు భుజాన్ని నొక్కుడు. ఇంకొకడు కాలుతొక్కుడు. మోతి ఆ ప్రాంతం మనిషె కావటంవల్లా ఎక్కువ మంది పలుకరిస్తువున్నరు. గంగవైపు చూస్తూ మోతికి కనుసైగ చేస్తుంటే మోతి కనుగుడ్లు మిటకరిస్తు తల అడ్డంగా ఆడిస్తున్నది. అట్టా అందరి చూపులకు కాపలగ నడిచి, ఆఖరికి ఇద్దరూ మెట్ల దగ్గ రికి చేరిండ్రు.

గుట్టమీద 'ఓ లింగో' అన్న కేక వినప డగానే ఎక్కడవున్న ఏటలను అక్కడే నర్కిండ్రు. జీవాలన్నీ ఒక్కసారె అరిచి ఆగిపోయినయి.

మొదటి మెట్టు దగ్గర రక్తమె రక్తం! కాలువలుగా పారుతుంది. అది చూసిన గంగ కళ్లు తిర్గినయి. మోతి ఆమెను పడి పోకుండా పట్టుకుంది. ఇంకొందరు ఆడ వాళ్ల సహాయంతో ఆమెను అక్కడి నుండి పక్కన చెట్టుకిందికి తీసుకపోయి బల్లమీద

## కొత్తగాలి...

**ఫ్యూచరంతా**
**కంప్యూటరే**
**ఆఖరికి ఆకలేస్తే**
**రెండు 'చిప్స్' తిను**

*– గుడిమెట్ల గోపాలకృష్ణ,* అరసవిల్లి

పడుకోపెట్టి ముఖంమీద నీళ్లు చల్లింది. కాసేపటికి ఆమె లేచి కూర్చుంది కాని వంటిలోని వణుకు పోలేదు.

"ఎట్లుంది గంగ? " అడిగింది మోతి.

ఏం మాట్లాడలేదు గంగ.

"కొందరు రక్తం చూస్తే తట్టుకోలేరు" అంది ఒకావిడ.

"అవునా గంగా? " అడిగింది మోతి.

అవునన్నట్టు తలాడించిందామె.

"అయితే ఇంటికి పోదాం పద" అని లేపి భుజం పట్టుకుని రోడ్డువైపు నడిపించింది మోతి. రోడ్డు పక్కన్నే వున్న ఓ గుండుమీద కూర్చోబెట్టి, బస్సురాగానే ఆపి ఎక్కికూర్చున్నరిద్దరూ.

"అక్కా ఈ జాతరలో ఇన్ని మూగజీవాల తలలు నర్కడం వల్లా వచ్చేదేంది, వొర్గేది ఏంది? ఈ రక్తపు టేరులేంది? ఎంత మూఢభక్తి? " గొణిగింది గంగ.

"ఎట్లనిపిస్తుంది? " అని అడుగుతు ఆమె తలను తన భుజంమీద ఆనించుకుని కూర్చుంది మోతి.

కాసేపటికి గంగ తేరుకుని తనను తాను సంబాళించుకుని కూర్చుంది.

"మనం నిన్న రావల్సింది. ఈ యాటలు నరుకుడు ఈ రోజు తెల్లవారు జామున మొదలైనట్టుంది. అయినా నాకేం ఎరుక.. నీవు రక్తాన్ని చూడలేవని" అని అంది మోతి కొద్దిపాటి నిరుత్సాహంతో.

గంగ ఏం మాట్లాడలేదు.

"మొత్తం మీద జాతర పూర్తిగా చూడకుండానే తిర్గొస్తూవుంటిమి. ఇది ఖర్చు ఎక్కువ లేని కండ్ల సంబూరం. ఈ సంబూరం వల్లా మనసుల్లో పేరుకపోయిన బరువు ఆవిరై అదోమాదిరి తేలికతనం ఆవరించి ఆయుస్సు పెరుగుతదని పెద్దలు అంటూవుంటరు. అందుకే అరమరికలు లేని రాకపోకలు!" అంది మోతి.

'అవునా? ' అన్నట్టు చూసింది గంగ.

"నేను మస్తుసార్లు చూసిననుకో. నీ కోసమే.." అంటున్నప్పుడు డ్రైవర్ సడన్ బ్రేక్ వేయడంవల్లా బస్సు కుదుపుకు గురైంది. మోతి మాట పూర్తికానేలేదు. ఎదురుగా వస్తున్న ఓ ట్రాక్టర్ ఆగి సాగింది. ఆ తరువాత తండా స్టేజి రాగానే బస్ ఆపిండు డ్రైవర్.




**మ**ధ్యరాత్రి ఒకటింటికి జీపొచ్చి లాడ్జ్ ముందాగింది. సిఐ దిగి చకచక రిసెప్షన్ దగ్గరికొచ్చి నిలుచున్నడు. మేనేజర్ లేచి లాడ్జ్ రిజిస్టర్ తెరిచి ఆరోజు వచ్చిన వాళ్ల పేర్లను చూపించిండు.

"ఆడవాళ్లు ఎవరైన దిగింద్రా? "

"ఇద్దరు దిగింద్రు" అని రిజిస్టర్‌లో పేరు దగ్గర వేలుంచి చూపించిండు మేనేజర్.

సిఐ రిజిస్టర్‌లోని ఆ వివరాలను పరిశీలించిండు. అతను వేలుపెట్టి చూపిన దగ్గర మోతి, సూర్యాపేట, మహిళ సంఘంపేరు కన్పించింది. ఆ గదిలో ఇద్దరున్నట్లు సమాచారం ఉంది.

"ఇంకా? "

"అంతేసార్"

"ఈమె ఎలాంటిది? " అంటు మోతీ పేరును మరోసారి చూసాడు.

"చాల మంచిది సార్, ఎప్పుడు ఎంఎల్ఏల వెమ్మటి తిరుగుతది. వాళ్లమ్మటి వచ్చినా తనకు ఓ రూం తీసుకుంటది.

రెండో ఆమె కూడా మన లాడ్జ్‌కు ఎప్పుడు వచ్చేటామే. ఈమె కూడ ఆమె లాంటిదే. పొద్దంత వుంటరు. ఆఖరి బస్సుకు వెళ్లిపోతుంటరు. ఒక్కొక్కసారి ఆ రాత్రి వుండి మరునాడు వెళ్లిపోతువుం టరు. ఇంతకుముందు మీరు వీళ్లను చూసింర్రు కూడా"

"నమ్మకంగ? "

"అవును సార్"

"ఓసారి చూడొచ్చా? "

"మీ ఇష్టం సార్"

సిఐ వెళ్లి కిటికిలోనుండి తొంగి చూసాడు. ఇద్దరాడవాళ్లు గాఢనిద్రలో వున్నది చూసి తిరిగొచ్చి రిజిస్టర్‌లో ఓ చిన్న సంతకం చేసి, బయటికి నడిచిండు. ఆయన వెనక పోలీసులు వెళ్లి జీపులో కూర్చోగానే జీపు కదిలింది.

లాడ్జ్ మేనేజర్ ఆవలిస్తు "చెపితె నమ్మరు" అనుకుంటూ పడుకొని చద్దర్ తల వరకు లాక్కున్నడు.

★ ★ ★

పొద్దున్నె తయారై సచివాలయానికి వెళ్లి సాంఘిక సంక్షేమ శాఖ ఉపకార్యదర్శి గది లోకి ఇద్దరూ ఒకేసారి అడుగుపెడుతూ "రావచ్చా సార్" అంది మోతి.

రండి అన్నట్టు తలాడించిండు ఆఫీసరు. ఆ తరువాత 'కూర్చోండి' అని సైగ చేసి-

"చెప్పండి" అన్నడు పెన్‌ను ప్యాడ్ మీదుంచుతు.

"ఏంలేదు, మిమ్ముల కలిసిపోదామని వచ్చినం" అంది మోతి.

"అదే.. వచ్చిన విషయం చెప్పండి"

"మీరు బిజిలో వున్నట్టుంది"

"బిజి ఎప్పుడు వుంటూనే వుంటుంది. అట్టని ఎంతో దూరం నుండి వచ్చిన మీ పనిని పట్టించుకోకుంటె ఎట్లా? " అంటు కాలింగ్‌బెల్ మోగించిండు.

అటెండర్ రాగానే- "వీరిని అసిస్టెంట్ సెక్రటరి దగ్గర్కి తీసుకెళ్లు. నేను బిజీగా వున్న విషయం వాళ్లా గ్రహించినట్టుగ్రను" అని అన్నడు.

"మంచిది, మళ్లీ కలుస్తం సార్" అంటు ఇద్దరు లేచి బయటికి నడిచి ఎదురుగా వున్న చెట్టుకింద నిలుచున్నారు.

"ఏంటి గురుడు చికాకుగ వున్నడు" అని అడిగింది మోతి అటెండర్‌తో ఓ కన్ను మూసి తెరుస్తు.

"ఆయన ఎప్పుడు అంతే! మీకు తెలి యందేముంది? ఆడవాళ్లంటే భయం. పైసలు ఇవ్వరని అనుమానం" అన్నడు తన రెండు చేతివేళ్లు ఒక దగ్గర్కి చేర్చి పెదవుల దగ్గర వుంచుకుంటు.

"ఇవ్వందేనే మా పనులన్నీ అవుతు న్నయా? " అంది గంగ.

"ఇవ్వక తప్పుతుందా, అంతెనంటవా గురు" అంది మోతి.

"అంతే అనుకో సాయంత్రం ఇంటికి పోగానే మేడం జేబునే చూస్తదట. లేక పోతే--" అని ఆగిండు.

"లేకపోతే" అని నవ్వింర్రిద్దరు ఒకేసారి.

"ఆమె ఏమన్న ఉద్యోగం చేస్తదా, ఇంట్లోనే వుంటదా? "

అతను మాట్లాడలేదు.

"ఏం గురు.. ఏమన్న తప్పుప్రశ్న అడి గిన్నా? " అంది మోతి.

"లేదుకాని ఆ రహస్యాలన్నీ ఇప్పుడు మనకెందుకు? " అన్నడతను.

"అందుకే నలుగురితో నారాయణ అంటె సరిపోద్ది మరీ" అంది మోతి.

"ఏ ఆఫీసర్లైన ఆడవాళ్లను చూస్తే ఐస్ అయిపోతరు కాని ఈయన పైసలుంటె పదిమంది అనుకుంటున్నట్టుంది" అంది గంగ.

"తెల్లకోళ్లకు అలవాటు పడ్డంక నాటు కోళ్లు నచ్చుతయా? "

"అంతేమరి" అన్నడతను.



"ఇప్పుడు మనం పోతున్న ఆఫీసరు, ఆయన ముందు జర్ర కొంగు పక్కకనరాదుండ్రి.. ఇక చూసుకో ఆయన కనురెప్పలు కదిలితె అంత ఒట్టు" అన్నడు.

"ఆ క్యాంటీనుకెళ్లి కాఫి తాగి పోదాం పద" అంటు అక్కడినుండి కదిలిండ్రు.

అతను ముందు, వాళ్లు వెనుక నడుస్తు న్నరు. ఆ చుట్టూర వున్నవాళ్లంత వాళ్లనే చూస్తున్నరు.

"ఆడవాళ్లంటె ఇట్టా వుండాలె. మన ఆఫీసులో వుంటరు, ఏం లాభం.. మూడు రోజుల కింద పట్టుకొచ్చిన కౌంజు పిట్ట ల్లాగ" అన్నడు ఓ మాంసాహారి.

"మనవాళ్ల సంగతి చెపుతావు.. ఒట్టి చూపుల గుర్రాలు! లిఫ్ట్ ఆగిపోతె మెట్లెక్క లేరు. కాసేపు నిలబడలేరు. కుర్చీవుంటె తప్ప కూర్చోలేరు" అన్నాడు మరొకతను.

"వొట్టి పెరుగు వొడలు! చూస్తే తినాల నిపిస్తది. నోట్లో వేసుకుంటే సప్పసతుకు" అన్నడు ఓ శాకాహారి. తమ ఆఫీసులోని ఆడవాళ్లపై ఆ మగోద్యోగుల అభిప్రాయా

## కొత్తగాలి...

**గంజాయి వనంలో**
**తులసిమొక్క**
**అన్నాహజారే**

– హర్షవర్ధన్,
సికింద్రాబాద్

లింత చక్కగ ఉన్నయి.

ఎట్లయితేనేం వాళ్లు క్యాంటీన్ లోపలికి వెళుతుంటే వాళ్ల వెంటే చూపుల కందిరీ గలు! కౌంటరు దగ్గర నిలుచుంటే అక్కడా మిడతల బారు! చుట్టు చూస్తూ వెంట వు న్నతని చూపుల్లో ఒకింత సిగ్గు, మరొకింత మురిపెం కనిపిస్తువుంటె కాఫీలు ముగించి బయటికొస్తూ "ఈ ఆఫీసులో ఎందరో ఆడవాళ్లను వుంచుకుని మావైపు అట్టచూ స్తరేం" అని అడిగింది మోతి అతన్ని.

అతను, సిగ్గు, సిగ్గుగ నవ్వుతూ "అవును కదా" అన్నడు.

"ఆఫీసులో వున్న వాళ్లందరిని రోజు చూస్తునే వుంటరు గదా. మీరు కొత్త.. అందునా నీవు ఈ అద్దాల బట్టలతో కని పిస్తే వాళ్లకు వింతగా వుంటదాయె" అన్నడు మెలికలు తిరుగుతు.

"మరీ మీ సార్ ఎందుకు..." అని ఆగింది మోతి.

అదిఇది అనే లోపే ఆఫీసర్ గది వొచ్చింది. "ఇక వెళ్లండి సీటు మీదనె వున్నడు" అని తాను పక్కకు ఆగిపోయిం డతను.

ఇద్దరు ఒకరి వెనక ఒకరు లోనికి వెళ్ల బోయి మళ్లీ వెనక్కు మల్లిన్రు.

"అక్క ఆయన ఆఫీసరేనా.. స్వాములవారు లాగున్నడు" గంగ సం దేహించింది.

"కొందరు అట్టనే వుంటరులే. దొంగస న్నాసులు. ఇట్ల వున్నవాళ్లె అట్ట చేస్తరు. కొంగ సంగతి తెలవదా? కళ్లు మూసుకుని ఓ కాలు కైకెత్తి చేప కనపడంగనే ఏం చేస్తది? ఆయనా అట్టనె కావొచ్చు!" అంది మోతి మెల్లగ.

"నమస్కారం సార్" ఇద్దరు ఒకేసారి అన్నరు.

"నమస్కారం రండి రండి, కూర్చోండి" అంటూ కుర్చీలను చూపించిండు.

గంగ కొంగును కదిలిస్తు కూర్చుంది. మోతి తన దుప్పట్టాను జరుపుతు పక్కకు తిరిగి కూర్చుంది. ఆమె తలమీద వున్న అద్దాలలో ఎదుటి మనిషి ముఖం ఎన్నె న్నో రకాలుగా కనిపిస్తూ వుంది. నొసట, కింద పెదవి కింద, పచ్చబొట్టు కొట్టొచ్చి నట్టు కనిపిస్తుంది. అమ్మాయిలు ఇద్దరి ముఖానా నవ్వు నాట్యమాడుతువుంది.

"చెప్పండి" అంటు మెడలో వున్న రుద్రా క్షల దండను తాక్కుండు ఆఫీసరు.

"ఏంలేదు. మూడో ఫైలు మీ దగ్గరుం దట కార్యదర్శిగారు చెప్పిరి" అంది మోతి.

"ఏం ఫైల్? నా దగ్గర పెండింగ్ ఏం లేదే. రాగానె వెంటనే చూసి పంపిస్తనే వుంట. ఒక్కరోజు కంటె ఎక్కువ వుంచను. ఆ ఒక్కరోజు కూడ విషయాన్ని చూడాలిగ అందుకని. పోనీ మీ దగ్గర దాని తాలూకు ఏదైనా కాగితం వుందా? ఉంటే ఇవ్వండి, చూసి చెపుత" అన్నడు తన ముఖాన్ని మోతి ఎదమీద వేలాడు తున్న అద్దాలలో చూసుకుంటు.

ఆయనను చూస్తుంటె గంగకెందుకో నవ్వు వస్తు వుంది. నుదుట విభూతి మెడల రుద్రాక్షలు.. అసలు ఆఫీసర్ లాగ లేనే లేడు. ఎట్లా వుంటే ఏం? కావల్సింది పని. మళ్లీ తానే తన మనస్సును సమా ధాన పరుచుకుంది. మోతి దుపట్టా ఎప్పుడో పక్కకు తొలగింది. ఆమెకు కూడ తెలియనట్టుంది. కాని అతని చూపులు అక్కడే ఆ ఎత్తొంపులో చిక్కుకున్నయి అని మాత్రం గ్రహించింది.

"అన్నీ దొంగ చూపులు! వేషం సామి లాగ, చూపులు గద్దలాగ! ఇట్లాంటోన్ని నమ్మరాదు. సామిలాగ కనపడి సర్వం దోచుకుంటాడు" అనుకుందామె.

ఈలోపు తన చంక బ్యాగులో నుండి తన ఫైలుకు సంబంధించి జిల్లా కలెక్టర్ నుండి పంపిందాని ప్రతిని అందించింది గంగ. ఆఫీసర్ దాన్ని అందుకుని ఓసారి ఆమె ముఖంలో చూసి, కాగితాన్ని చదు వుతు ఏదో గుర్తురాగ ఓ సారి దీర్ఘశ్వాస పీల్చి తన చూపుడు వేలును ముక్కు దగ్గ రుంచుకుని మిగతా ఫైళ్లను కదిలిస్తు--

"ఈ ఫైల్ వుంది. మళ్లీ జిల్లాకు రాసినం. అక్కడి నుండి కూడ జవాబు వచ్చినట్టు గుర్తు" అన్నడు మెల్లగా ఇద్దరిని మార్చి మార్చి చూస్తు మురిసిపోతూ.

తర్వాత తనే- "అదే సంచారజాతులకు జీవన భృతిని చూపించేది కదా? ప్రాసె స్‌లో వుంది. త్వరలో దానిమీద ఓ నిర్ణయం తీసుకోవచ్చు" అన్నడు.

"దయచేసి కాస్త త్వరగా తీసుకోండి సారు. మీ కష్టం వుంచుకోం" అంది గంగ.

"అదె నిపుణుల కమిటికి పంపాలనుకుం టున్నం. ఏవేని ఉద్యోగాలకు సిఫారస్ చేద్దామంటె వాళ్లు చదువుకుని లేరు. ప్రభుత్వ భూముల పట్టాలిప్పిద్దాం అంటె వాళ్లు ఒక్కచోట వుండేటోళ్లు కారు. అదే ఆలోచిస్తున్నం. మినిస్టర్‌గారు కూడ ఏదేని ప్రపోజల్స్‌తో రండని రాసిన్రు" అన్నడు ఆవలిస్తూ. అర్ధ నిజం చెప్పదలిచినపుడు లేదా అబద్ధం చెప్పాలనుకునేటప్పుడు ఎక్కువ మందికి ఆవలింతలు రావటం సహజమేగదా?

"ఇప్పుడు ఇంత భూమిచ్చినంక ఊళ్లు ఎందుకు తిరుగుతరు సార్? మీరు తీసు కునే నిర్ణయం రాబోయే తరాల్ని కాపాడే దిగ వుండాలి సార్" అంది గంగ ఆశగా చూస్తు.

"ఓపని చేయండి, మీలో ఎవరో ఒకరు సాయంత్రం నాలుగింటికి రండి ఏ విషయం చెపుత. ఇద్దరెందుకు? " అన్నడు ఆయన. లేచి బయటికి నడిచిండ్రు. బయట అటెండర్ అట్టాగె నిలుచోని వున్నడు. రమ్మని సైగ చేసింది మోతి.

దగ్గర్కివొస్తు "ఏమన్నడు? " అడిగిండు.

"ఏమనలేదు మొదట లేదన్నడు. ఆ తరువాత చూద్దామన్నడు. నీవు చెప్పిన పచ్చిపచ్చి చూపులు, చేతలు ఏం కనబడ లేదు"

"మొదట అట్టానె వుంటడు? ఇంతకు చూస్త అన్నడా, చేస్త అన్నడా? "

"సాయంత్రం రమ్మన్నడు" అంది మోతి.

"ఇద్దర్నా ఒకర్నా"

"ఏం ఎందుకట్ల అడుగుతున్నవు? "

"మీరైతే చెప్పరాదండి"

"ఒక్కదాన్నె"

"అనుకున్న"

## అసలు రహస్యం

తామిరువురూ బంధువులైనప్పటికీ ఓ కేసులో ప్రతివాది పక్షాన మాడపాటివారు, వాదిపక్షాన మాదిరాజు రామకోటీశ్వరరావు ఉన్నారు. రామకోటీశ్వరరావుకు హనుమ కొండలోని మాడపాటివారి ఇల్లే బస. తర్వాత వారిద్దరూ కలిసే కోర్టుకు వెళ్లేవారు. అలా వెళుతుండగా ఓసారి మాడపాటివారు 'నీలగిరి' పత్రిక తిరగేస్తున్నారు. అది చూసి, 'కోర్టుకూ ఈ పత్రికలా? అక్కడా సాహిత్యం గొడవేనా' రామకోటీశ్వరరావు వేళాకోళం చేశారు.




కోర్టులో ఆ వాయిదాకు ప్రతివాది సాక్షులు రానందున వాదిపక్షానే తీర్పు చెప్పాలని రామకోటీశ్వరరావు గట్టిగా వాదించారు. అంతలోనే మాడపాటివారు లేచి 'తన క్షక్షిదారు పెనుతుపానువల్ల రాలేకపోయారు. మరొక వాయిదా ఇప్పించాలి' అంటూ నీలగిరి పత్రికలోని తుపాను బీభత్సాన్ని వినిపించారు.

'బావా, ఇందుకా నీలగిరి పత్రిక తెచ్చావు? ఎంతమోసమయ్యా!' అని మేలమాడారు రామకోటీశ్వరరావు.

"ఏమని"

"ఏంలేదు మీపని మీరు సూసుకొండి" అంటు అతను లోపలి నుండి పిలుపు రాగానే అక్కడి నుండి కదులుతున్నడు. అతని చేతిలో ఓ పది రూపాయల నోటు వుంచి అరచేతిని గిచ్చింది మోతి.

అతను వెనక్కు వెనక్కు చూస్తు లోనికి నడిచిండు.

వీళ్లు పెదాలను కదిలిస్తు భుజాలను పైకని వొదులుతు క్యాంటీన్ వైపు నడిచిండ్రు. భోజనం వేళైంది. అందరూ గదులు వదిలి గేటు దగ్గరచేరి నినాదాలు ఇస్తున్నరు.

"ప్రభుత్వం మా డిమాండ్స్‌ను" అని ఒకరు అనగానే.

"పరిశీలించి పరిష్కరించాలి" అని మిగిలిన ఆడ మగ అందరు అన్నరు.

"కరువుబత్తెం"

"వెంటనే మంజూరు చేయాలి"

"పే కమీషన్ రిపోర్ట్"

"వెంటనే ప్రకటించాలి"

"వెంటనే మా డిమాండ్స్"

"పరిష్కరించాలి"

ఓ పదిహేను నిమిషాలు నినాదాలిచ్చి తమ గదులవైపు కొందరు, క్యాంటీను వైపు మరికొందరు నడిచిండ్రు.

"వీళ్లు చేసే కష్టానికి ఇంకా జీతాలు పెంచాలటమ్మ. వచ్చి రాగానే క్యాంటీను కొచ్చి గప్పాలు కొడుతుంటరు. ఆ తరువాత ఒకటికి లంచ్ అని పోయి మూడింటికొస్తరు. మహా అంటే ఓ గంట పనిచేస్తుండొచ్చు. ఐదింటికి అవతలకు పోవడానికి నాలుగు నుండే సదురుడు. ఈ లోపల ఆయనకు ఏదేని పనివుంటే బయటపడుడే! ఇదీ వీళ్ల సంగతి" అంది మోతి.

"నీవు ఎప్పటి నుండో వస్తున్నవాయె అన్నీ తెలుసు" అంటూ నవ్వింది గంగ.

"సారు సాయంత్రం రమ్మనె వుంటడా అనీ" మళ్ళీ గంగ అంది.

"రమ్మన్నడుగా.. ఉంటడు. వద్దాం. నేను కాంటీనులో కూర్చుంటా, నీవు పోయొద్దువు" అంది మోతి.

"ఒక్కదాన్నే" అంది గంగ ఎదమీద చేయివుంచి, కళ్లు మిటకరించుకుంటు. అంతలో ఒకడు భుజానికి రాసుకుంటు ముందుకు పోగ వులిక్కిపడిందామె.

అది గమనించిన మోతి "ఇవన్నీ మామూలే, నడువ్" అంటు ముందుకు నడిచింది. ఈ లోపల మోతిని ఒకడు రాసుకుపోతూ "సారీ" అన్నాడు.

"వాడు సారీ అని గూడ అనలేదక్క"

"వీడు మాత్రం అన్నా నా డ్రస్సు చూసి అన్నడు. అంతే, నాకు ఇంగ్లీషు రాదుగ, అదో బడాయి" అంది భుజాలను కదిలిస్తు.

"ఇట్లా తాకితె ఏంవొస్తదో? "

"చెప్పితిగదా చూస్తె కంటికి సంబూరం, తాకితె వంటికి తృప్తి అని"

"నీవు చూడనట్టుంది ఆ సామి కాగితం తీసుకునేటప్పుడు నా వేళ్లకు వేళ్లు తాకించిండు" అంది గంగ.

"అట్టనా.. అమ్మ దొంగ" అంది మోతి.

"నేనంటికదా దొంగసామి అని"

"సామేకాదు, సామి దగ్గరున్న శిష్యుడు అంతె! నీవు చేతిలో చేయి వుంచినప్పుడు మెలికలు తిరిగిండనుకో" అంది గంగ.

"పాపం వాడూ మొగోడేకదా"

"పాపం రాత్రికి నిద్ర పట్టదనుకుంట" అని నవ్వింది గంగ.

"మనం మరొకసారి వొచ్చినప్పుడు పరుగెత్తుకొచ్చి పనిచేస్తరు. వాళ్ల బాసుల దగ్గర మన గురించి మంచిగ చెపుతరు సుమా! అది చాలదా మనకు" అన్నది మోతి గంగ కళ్లలోకి చూస్తూ.

"ఇప్పుడింకా నయం, నేను కొత్తగా పైరవీలు మొదలుపెట్టిన రోజుల్లో టేబుల్ ముందు చెక్కవుండేది కాదు. ఎదురుగా కూర్చొంటే కిందినుండి పాదాలకు పాదాలు తాకిచ్చేటోళ్లు. ఏమంటాం పనిపడి వచ్చినోళ్లమైతిమి. ఈ ఆఫీసర్లు కొంత నయం. మరీ ఆ క్లర్కుగాళ్లైతే చెప్పలేని చేష్టలు! ఆడదంటే అంత ఇదీ!" అంది మోతి.

"ఏమో అక్క.. నాకీపని బొత్తిగా ఇష్టం లేదు" అంది గంగ ముఖం చిట్లిస్తూ.

"ఏం చేస్తం? ముల్లును ముల్లుతోనే తియాలన్నరు. తప్పదు మరీ"

"అదీ నిజమే. తీసేటప్పుడు కొంత ఛిద్రమైతుంది కదా? " అంది గంగ.

"తప్పదు" అంది మోతి ఓ యోగినిలా నవ్వుతూ.

ఈ లోపల క్యాంటీను వచ్చింది. లంచ్ టైమ్ కనక రద్దీ ఎక్కువగా వుంది.




పొద్దు బారెడెక్కింది. గంగ ఇంటి ముందు జాన్‌సన్ నిలుచున్నాడు. సరిగ్గా అప్పుడే ఆ ఇంటి పనిమనిషి లోపలికి వెళుతూ "ఎవరు కావాలి? " అడిగింది.

జాన్‌సన్ "మీ మేడమ్" అన్నాడు.

ఆమె లోపలికి వెళ్లి గంగతో చెప్పింది.

"ఎవరతను? "

"తెలియదు. ఎత్తుగా, బలంగా వున్నాడు. తెల్లని రంగు, తేనెరంగు గడ్డం మీసాలు, పిల్లికళ్లు.. మన దేశస్థుడైతే కాడు. మెడలో కెమెరా ఉంది" అంది.

"ఎవరబ్బా" అంటూ పయిట సర్దుకుంటూ గంగ దర్వాజలోకి వచ్చి, తొంగి చూసింది. అతను గేటు దగ్గరే నిలుచోని లోపలికి రావచ్చా అన్నట్టు మొదట తనవైపు చూసాడు. వేలు చూపించి, తిరిగి దర్వాజవైపు చూపించిండు.

"రండి" అంది తన జుట్టును వొదులుగా ముడివేసి వొదులుతూ.

"థాంక్యూ" అంటూ లోనికి వచ్చిండు. గంగ అతనినే చూస్తూ నిలుచుంది. పెద్ద పెద్ద అంగలేస్తూ వస్తున్నాడు.

అతని గడ్డం మీసాల మధ్యన తెల్లని పలువరస మెరుస్తుంది.

గంగ అతనిని సాదరంగా లోపలికి పిలిచి కూర్చోబెట్టి తాను ఎదురుగా కూర్చుంది.

"నేను ఆర్.డబ్ల్యు. జాన్సన్. ఫ్రీలాన్స్ జర్నలిస్ట్ అండ్ ఫొటోగ్రాఫర్" అన్నాడు చేతులు జోడిస్తూ.

"సామాజిక కార్యకర్తను, అంటే సోషల్ వర్కర్‌ను" ప్రతి నమస్కారం చేసింది.

"మేడమ్, నేను క్రితంసారి వచ్చినప్పుడు మీకు తెలియకుండానే మీ ఫొటోలు కొన్ని తీసాను" అంటూ తన చంక సంచిలో నుండి రెండు ఫొటోలను తీసి చూపించిండు. ఒకటి తన ఇంటిముందు వంగి ముగ్గు వేసేది. రెండవది ముగ్గు ముగించుకుని గేట్‌లోకి నడుస్తున్నది. మొదటి ఫొటో గూర్చి చెపుతూ "ఇది చాలా గొప్పగా వచ్చింది" అనంగానే గంగ, ఆ ఫొటోను రెప్పగొట్టకుండా చూస్తూ వుంది. అది తన వాకిలే! ఆ ముగ్గేసేది తానే, అప్పుడే స్నానించి తలకు తెల్లని కండువా చుట్టి వుంది. లోదుస్తులు లేని గంధపు రంగు చీరె, అదే రంగు రవికెకు ఎదమీద ముడీ. 'ఇరుగ కాసిన మామిడి కొమ్మ లాగా వంగి, చీరెకుచ్చిళ్లను ఎడమ తొడపై అదిమి వుంచి', ముగ్గువేస్తుంది. పాదాలకు మెరుస్తున్న పట్టీలు, మెట్టెలు, లేత సూర్య కిరణాల వెలుతురులో ఈ దృశ్యం!

"చాలా బాగా వచ్చిందండి" అంటూ కుడిచేయి చూపుడు వేలును బొటన వేలితో ఆనించి మెచ్చుకోలుగా చూసాడతను. గంగ తాను ఇంత అందంగా వున్నానా అనుకుంది.

రెండో ఫొటోను ఆమెకిస్తూ "ఇదీ గొప్పగానే వచ్చింది. అసలు మీ శరీరమే ఓ చేసిన బొమ్మలాగుంది. మిమ్ముల్ని కన్న తల్లికి ఓ వందనం అంటూ పెదాలను దగ్గరగా అదిమి వదులుతూ సూపర్ బాడీ" అంటూ మెచ్చుకోలుగా చూసాడు.

"ఫొటోలు చాలా బాగున్నాయండి"

"ఫొటోలు కాదు అసలు మీరే బాగున్నారు" అన్నాడు.

"లేదు, మీరు మంచిగా తీసారు. థాంక్స్! ఏం తీసుకుంటారు? "

ఏదైనా ఫరవాలేదు అన్నట్టు చూస్తూ, భుజాలను కదిలించి వదులుతూ ముక్కు మీదికి జారిన కళ్లద్దాలను చూపుడువేలుతో సరిచేసుకున్నాడు.

"బ్రేక్‌ఫాస్ట్ చేద్దామా? " అంది.

'యస్' అన్నట్టు తలాడించగానే లోపలికి వెళ్లి ట్రేలో రెండు ప్లేట్స్, స్పూన్స్ తెచ్చి టీపాయ్ మీదుంచింది. పనిమనిషి గ్లాసుల్లో మంచి నీళ్లు తెచ్చి పెట్టింది. స్పూన్స్ వున్న ప్లేట్ అతని ముందుకు జరిపి తానో ప్లేటు తీసుకుంది.

ఆమె స్లైస్‌కు కారం పొడిని అద్ది నోట్లో పెట్టుకునేది చూసి, "నేనూ చేత్తోనే తింటాను సరదాగా" అన్నాడతను.

సరే అన్నట్టు గంగ తలాడించింది.

అతను స్లైస్‌కు కారంపొడి అద్ది నోట్లో పెట్టుకుని "వావ్! వెరీ టేస్టీ. సూపర్" అన్నాడు ఓ కన్ను మూసి తెరుస్తూ.

"ఇది బ్రెడ్‌స్లైసే కదా? "

అవును అన్నట్టు తల వూపింది.

"మరి ఎగ్ స్మెల్? "

గంగ నవ్వుతూ "బ్రెడ్ ముక్కలను గుడ్డుసొనలో ముంచి పెనం మీద కాల్చుతారు, అందువల్ల ఎగ్ రుచి, వాసన "

'ఓ అట్లనా? ' అన్నట్టు చూస్తూ తింటున్నాడు. కొసరి కొసరి వడ్డించింది గంగ. తన ఫొటోలు అంత అందంగా తీసినందుకు అతని మీద గౌరవం కుదురుకుంది.

"ఈ పౌడర్ ఎట్లా చేస్తారు? చాలా రుచిగా వుంది"

"ఇది చిల్లీస్‌తో పాటు, ఎల్లిపాయలు, కరివేపాకు, ఉప్పువేసి గ్రైండ్ చేసినం. దీన్ని మేం కాకపొడి అంటం"

"ఈ కాకపొడిని కొంచం ప్యాక్‌చేసి ఇవ్వండి చెపుత" అన్నడు.

ఓ చిన్న సీసాలో కొంత పొడిని పోసి ఇవ్వగా తన సంచిలో భద్రపరుచుకుండు.

అతని తెలుగు మాటలు సంతోషాన్ని, దగ్గరితనాన్ని పెంచుతున్నాయి. 'ఒకరిని మరొకరు కలుసుకోకుండా మనుషులను ఆపగలరేకాని మనస్సులను ఆపలేరు' కదా అనుకుంది గంగ.

ఎటెటో తిరిగే మనసుతో అల్పాహారం ముగించింద్రు.

పనిమనిషి తెచ్చిన టీ కప్‌లను అందు కుని తాగుతుండగా "అవును మీవారు? " అని ఆగిండు.

లేరన్నట్టు తల అడ్డంగా ఆడించింది.

ఐసీ అన్నట్టు చూసాడు. ఇద్దరి మధ్య కాసేపు మౌనం.

"మీరు ఏం మాట్లాడడంలేదు" అన్నడు.

"మీరు కూడా" అంది తన కనురెప్ప లను టపటప ఆడిస్తూ.

"ఈ ఫొటోలలో వాకిట్లో ముగ్గేసేది, ఓ పత్రికకు ఇస్తే మీకేమైనా...? " అని అడి గిండు ఆమె కళ్లలోకి చూస్తూ.

లేదన్నట్టు తల అడ్డంగా ఆడించిందన్న మాటెగాని ఆమె చూపులు అతని మీద ఆగినయి. టీ షర్ట్ శరీరానికి అతుక్కు పోయి శరీర దృఢత్వాన్ని చాటుతుంది. అతని కంట పడకుండా అతన్నే చూస్తు వుంది. ఇష్టానికి సిగ్గు ఎప్పుడు అడ్డుగదా?

"మీ ఫోటోను వాడుకున్నందుకు కొంత మనీ కూడ ఇస్తాం. మీరు కాంట్రాక్టు మీద సంతకం చేస్తే కొంత అడ్వాన్స్ ఇచ్చిపో తాను" అంటూ సంచిలో నుండి ఓ పేపర్ తీసి ఆమె ముందుంచి, ఎక్కడ సంతకం చేయాలో అక్కడ గుర్తుపెట్టి, పెన్ను అందించిండు.

ఆ కాగితాన్ని తీసుకుని, సంతకంచేసి తిరిగి ఇచ్చింది.

అతను చెక్‌బుక్ తీస్తు-

"మీకు బ్యాంకులో అకౌంటు వుందా" అని అడిగాడు.

వుంది అన్నట్టు తలాడించింది.

పదివేలకు చెక్ రాసిస్తు "మీ పూర్తి అడ్రస్ చెప్పండి మిగతా మనీ పోస్టులో పంపిస్తం" అని కాంట్రాక్ట్ కాగితంపై ఆమె చెపుతుంటె అడ్రసును రాసుకుని, బ్యాగ్‌లో సర్దుకుంటున్నప్పుడు-

"చాలా థాంక్స్ సార్" అంటూ గంగ ఆనందంలో కింద మీదైపోతువుంది.

"ఇది మామూలే" అన్నడు చిరునవ్వుతో లేచి నిలబడుతూ.

"సో ఇది నా కార్డు, వుంచండి" అంటూనే వంగి ముఖంమీద ముఖముంచి

## కొత్తగాలి...

**మా అమ్మ**
**ఎంత మంచిదో**
**కానీ, పాపం**
**మా ఆవిడకు మాత్రం అర్థంకాదు**

– పెన్మెత్స సూరిబాబు, హైదరాబాద్

పెదాలపై పెదవులుంచిండు. అనుకో కుండా జరిగిన దానికి కలవరపడిపోయిన గంగ తన పెదాలను చేత్తో అదుము కుంది. వంటింటి దర్వాజలో నిలుచోని చూస్తున్న పనిమనిషి ఆ దృశ్యాన్ని చూస్తు తన ముఖాన్ని పక్కకు తిప్పుకోవాలను కుంది కాని తిప్పుకోలేకపోయింది.

"అందగత్తె కనిపిస్తే చుంబనం మా మరియాద" అన్నడు చిరునవ్వు నవ్వుతు.

"మీకు తెలుగు బాగానే వస్తదే"

"దేశం తిరుగుతున్నగద" అంటు గంగ చేతిలో చేయి వుంచుతు దర్వాజ వైపు

నడుస్తూ, నడిపించిండు.

"లంచ్‌కుగాని, డిన్నర్‌కుగాని వస్తనంటె ఆంధ్ర భోజనం సిద్ధం చేస్తం"

"నో ఇప్పుడే పోతాను, పని వుంది" అన్నడు.

సరె అన్నట్టు తలాడిస్తు మౌనంగా గేటుదాక సాగనంపింది. అక్కడిదాక అతని చేతిలో ఆమె చేయివుంది. ఆ తరువాత కారు కదిలింది. ఆమె చేతివేళ్లను ముడుస్తూ తెరుస్తూ గేటు వేసింది.




అప్పుడప్పుడే తెల్లారి పొద్దుపొడుచుకొస్తుంది. రోడ్డుమీద నడిచే జనం ఆగి ఆగి మాట్లాడుకుంటువున్నరు.

'ఏ తల్లిపిల్లలో దిక్కుమాలిన చావు చచ్చిరి' అంటున్నరు కొందరు. 'తల్లిదండ్రులు ఇల్లెల్లగొడితే ఇంత పెద్ద దేశంలో ఎక్కడన్న కూలిచేసుకుని బతక్కపోదురా. ఎందుకు చావవల్సి వచ్చింది. సచ్చి ఏం సాధించిండ్రు, ప్రాణం తీసుకున్నరే తప్ప' అనుకుంటు నడుస్తున్నరు. ఈ లోపల పోలీసులు అక్కడికి చేరుకున్నరు.

అది ప్రయాణికులు కూర్చునే నాపరాళ్ల బెంచి. దానిమీద ఓవైపు యువకుని శవం. పాతికేళ్లుంటయి. మరోవైపు యువతి శవం, పద్దెనిమిది వుంటయి. ఒకరి తలకు మరొకరితల ఆనుకుని వుంది. తలల దగ్గర ఓ ఉత్తరం! ఆ వుత్తరం తీసుకున్న ఎస్సై మడతవిప్పగా-

'మా చావుకు ఎవరూ కారణంకాదు. ప్రేమించుకున్నం.. కులాలు కుదరవన్నరు పెద్దలు. ఊరుకుంటే అందర్కి మంచిది, కాదంటె కత్తులు దూసుడే అన్నరు. వేరే మార్గం కనిపించక ఈ మార్గాన్ని ఎన్నుకున్నం. మీకు శ్రమ ఇస్తున్నందుకు మన్నించండి. మా శవాలకు దయామయులు ఎవరైనా దహన క్రియలు చేయిస్తే మరో జన్మలో వాళ్ల కడుపున పుడతం. మా పేర్లు రాస్తే ఆరా తీస్తరు. అందుకని మా ఇద్దరి వేలిముద్రలు'.

ఉత్తరాన్ని అందరు వినేటట్టు చదువుతున్న ఎస్సై కళ్లలో నీళ్లు తిరిగాయి. అక్కడున్న ఆడమగ అందరి కళ్లు కన్నీటి చుక్కలను వదిలినయి. వాళ్లలో గంగ కూడ వుంది. ఆమె మరీ కదిలిపోయింది. కన్నీరు మున్నీరుగా ఏడ్చుతూ నిలుచుంది.

ఎస్సై ఆ వుత్తరంతో పాటు ఆ పక్కన్నే పడివున్న ఎండ్రిన్ సీసాను తీసుకుని పరిశీలనగా చూసి, పంచనామ ముగించి, శవాలను పోస్టుమార్టమ్ కోసం పంపించిండు. శవాలు అక్కడినుండి తరలించగానే జనం కదిలిండ్రు. గంగకు నాయుడు గుర్తొచ్చిండు.

పోస్టుమార్టమ్ ముగిసేసరికి ఒకటైంది. ఎస్సై పంచాయతీ వాళ్లను పిలిపించి అనాథ శవాలుగ దహనం చేయవల్సిందిగా కోరుతూ వాళ్లకు అప్పజెప్పిండు. వాళ్ల వెంటనే నడుస్తున్న గంగ రెండు దండలు తెచ్చి వాళ్ల మెడలో వేసింది. ఓ వయసునకు ఆ చేతలు తప్పువుగదా, ప్రేమకు కులం మతం, కట్నాలు కానుకలు ఎందుకు? ఈడు జోడు బతకగలరన్న నమ్మకం చాలు! బతికి వున్నప్పుడు తోటి మనుషుల అండకు నోచుకోని శవాలకు గంగ అండగ నిలిచి ఖననం పనులు ముగించింది. అది చూసిన జనం గంగను

అభినందించకుండ వుండలేకపోతున్నరు. అపుడపుడు ఆమె కులాన్ని ఎత్తి చూపే స్థానికులు ఈ రోజు ఆమె గుణాన్ని మెచ్చు కుంటున్నరు! అదే విషయం పత్రికల్లో కూడ వచ్చింది. అప్పటినుండి గంగ సామాజిక కార్యకర్తగ పదుగురికి తన చేత నైన ఉపకారం చేస్తూవస్తూంది.

ఓ రోజు ఉదయం పూట గుడిలో ఓ స్వామిజీ చేసే ధార్మిక ఉపన్యాసం మైక్‌లో వినిపిస్తుంది.

'ఊరైనా, పట్టణమైనా అక్కడ నివసించే జనానికి ప్రేమ సహజమే. అందరు ఒకే లాగ పుట్టినా ఒకే లాగ బతకడంలో సమస్యలు పుట్టుకొస్తుంటయి. వాటిని తట్టుకొనే శక్తి మనుషుల్లో కొరవడితే ఈర్ష్యాద్వేషాలు చోటుచేసుకుని మనుషులు రాక్షసులుగా మారి హత్యలు, అఘాయి త్యాలు చేస్తూంటరు! అందుకని మను షులు మాసిన గుడ్డలు వదిలినట్లు ఈర్ష్యా ద్వేషాలను వొదిలివేయాలి"

ఆ మాటలను వింటూ నడుస్తున్న గంగ ఎదురుగ బస్ ఆగగానే అటువైపు చూసింది. బస్‌లో నుండి మోతి దిగి దిక్కులు చూస్తుంది.

"అక్క" అంటూ ఆమె వైపు నడిచి "చెప్పాచేయకుంట వస్తివి" అంటు చేతిలో చేయివేసి, కొబ్బరి బోండాల కొట్టువైపు న డిచి ముచ్చట్లలోకి దిగిండ్రు. ప్రయాణికు లందరు వాళ్లవైపే చూస్తున్నరు. ఇంటికి పోయి మాట్లాడుకుందాం అనుకుని ఇంటి దారి పట్టిండ్రు.

"అక్కా నేను పరీక్ష పాసైన, ఇక బి.ఎ. రాయాలి" అంది గంగ.

"అట్లనా? సంతోషం. సరే మంత్రి గారి విశేషాలు చెప్పవైతివి" అంది మోతి.

ఎదురుగా వున్న అద్దంవైపు చూసింది గంగ. ఓ ఊరపిచ్చుక అద్దంలో తన రూపాన్ని చూసుకుంటూ అదే పనిగ అద్దాన్ని పొడుస్తోంది.

"అంతకు ముందు వొచ్చినపుడు ముంపు బాధితులతో వెళ్లి కలిస్తి. అప్పుడాయన ఒక్కరుండి మిగిలినవాళ్లు బయట కూర్చోండి అన్నప్పుడు, నన్ను వుంచి అందరు బయటికి నడిచిండ్రు. దరఖాస్తు ఇచ్చి నిలుచున్న. కూర్చో అంటు దరఖా స్తును టీపాయ్ మీదుంచుతూ, అదో మాదిరి చూసిండు. అప్పుడు సిగ్గు, భయం రెండు గాలివానలాగ కలిసొచ్చి ఆవరించినట్టయింది" అని ఆగింది గంగ.

"మొన్నో సారొచ్చినపుడు మరో దరఖా స్తుతో వెళ్లి గదిముందు నిలుచున్న. ఆయనకు సంబంధించిన మనిషి నన్ను చూసి లోపలికి వెళ్లి తిరిగొచ్చి, అయ్యగారు ఆఫీసర్లతో మాట్లాడుతున్నరు, అందరు అయినంకా ఆఖర్న రమ్మన్నడని చెప్పగ వరండాలో కూర్చున్న. డాక్టర్ అన్న మాటలు గుర్తొచ్చినయి. 'నెల నెలా బాగానే వుందంటున్నవు, ఓ పాప అంటు న్నవు, భర్తతో లేనంటున్నవు. ఏదో టెన్షన్ పెట్టుకున్నవు, అందుకే నిద్ర రాకపోవుడు, తల తిరుగుడు. కలలేమన్న వస్తుం టాయా? అడిగింది డాక్టరు. వస్తుంటాయ న్నట్టు తలాడించిన. 'చూడు వయస్సులో వున్నవు. ఏ వయస్సుకు ఆ కోరికలు. వాటిని అణుచుకుంటే ఇట్లనే ఆరోగ్యం పాడైతది, ఆరోగ్యానికి మించింది లేదు కదా? బి.పి.కి, నిద్రకు మందులు రాసిన' అని మందుల చీటి ఇచ్చింది. 'అవును అణుచుకోవద్దు!' అని అనుకుంటున్నప్పుడే పిలుపు వచ్చింది. లోపలికి నడిచి, నమ స్కరించి నిల్చున్న. నన్ను ఎగాదిగా చూస్తూ 'కూర్చో' అన్నడు. ఎదురు సో ఫాలో కూర్చున్న. ఆయనొచ్చి నా పక్కన కాసేపు కూర్చున్నడు. నన్నే దరఖాస్తు చద వమంటే చదివిన. ఆ తరువాత నేను బయటికి వచ్చేసరికి దూరంగా చెట్ల కింద

నిలుచున్నవాళ్లు నన్ను చూసి గుసగుసలు" అంది గంగ.

"అట్లాటివి పట్టించుకొవద్దులే. ఇంకా పక్కన కూర్చుని నడుంచుట్టూ..? " ఆగింది మోతి.

"ఆయన అన్నది ఏంలేదు బయట వాళ్లకు మేమంటేనే చిన్నచూపుగ! ఊరం దర్కి మాకులం మీద హక్కు. ఇష్టం వున్న లేకపోయినా కోరినవాని కోరిక తీర్చ వల్సిందే! అట్టతిరిగే కదా మా మేనత్త ఆ మధ్య మనం ఎన్నికల ప్రచారానికి కర్నా టకకు పోయినప్పుడే పోయింది" అంది గంగ బాధగా.

"ఆమె పెద్దావిడ అయ్యింది. తిరగాడెట పుడే పోయింది మంచిదే" అంది మోతి వాస్తవాన్ని సానుభూతిగ మలుస్తూ.

"చెప్పు, ఇంక మంత్రిగారేమన్నరు. నడుంచుట్టు చేయి, చెంపకు చెంప అంతే కదూ? " అని మళ్లీ అడిగింది మోతి.

"మంత్రి సంగతి వదిలేయి. మంది మాటలు ఈటెల్లాగుంటున్నయి!" అంది.

మొన్న సినిమాకు పోయి వస్తున్న నా వెనక ఇద్దరు నడుస్తు "రోజురోజుకు పోజు మారుతుందిరోయ్ అని ఒకడంటె మారదు మరి పూరిగుడిసె పోయి దొర లుండె ఇల్లు చేరె. మూర తక్కువ చీరె లాయె! అత్తరు పౌడర్లాయె! అవును రోయ్ నాజూకుగా తయారౌతువుందని మరొకడు అంటున్నరక్క" అంది.

"అన్నీ, మాటలేకదా. అంటే అననీ అని, నోటి తీట అణుచుకుంటరు. అవన్నీ పట్టి చ్చుకోవద్దు" అంది మోతి.

"అస్సలు ఆడది ఒంటరిగా ఎదురైన పుడు మగాడు ఆ ఆడదానిని చూడకుంట నడిస్తే ఆమెలో లోపం వుందన్నమాట. చూడగానే పలకరించడం కుదరక అట్లా అంటుంటరు. ఈలాంటివన్ని నేను రాజకీ యాల్లోకి వచ్చిన మొదటి రోజుల్లో వింటుండేదాన్ని. ఇప్పటికీ అప్పుడప్పుడు వింటునే వున్న. అనుకుంటం కానీ ఆ మాత్రం లేంది బతుకులో తీపెక్కడ! ఆడది ఐస్కాంతమైతే మొగోడు ఇనుప ముక్క సుమా!"

రాను రాను గంగకు కూడ ఎన్నో విష యాలు తెల్సి వస్తునే వున్నయి. మొదట్లో వున్న జంకును పాముకూసం వదిలినట్టు వదిలేస్తూంది. పుస్తకాలను, పత్రికలను చదవటం వల్లా విషయాలను తెలుసుకుం టుంటే మనిషిలో సంస్కారం, ముఖంలో నిగారింపు రోజురోజుకు పెరుగుతూంది.

అనాథల విషయంలో ఆమె సేవాభావం రోజురోజుకూ పెరుగుతూనే వుంది. వరద లప్పుడు సాగర్‌కు కొట్టుకొచ్చె శవాలను దగ్గరుండి ఖననం చేయిస్తుంది. స్థానికుల సహకారం, పోలీసుల ప్రోత్సాహం ఆమెకు వుంటూనే వున్నయి.




**జ**నగాంలో బయలుదేరిన బస్ సూర్యా పేట వైపు వస్తూంది. సాయంత్రం నాలుగు గంటలవేళ బస్సులో జనం ఎక్కువ లేరు. మోతి, గంగ డ్రైవర్ వెనక రెండో వరుసలో.. కిటికి వైపు గంగ, పక్కనే మోతి కూర్చున్నరు. గంగ ఎక్కెక్కి ఏడుస్తుంది. మోతి ఎంత ఊకుంచినా ఊరుకోవడం లేదు. మూతికి కొంగు అడ్డం పెట్టుకుంది కనుక ఏడ్పు చప్పుడు ఎవ్వర్కి

వినపడడంలేదు. అయినా డ్రైవర్ మాటి మాటికి వెనక్కి చూస్తున్నడు. కండక్టర్ పసికట్టినా పట్టిచ్చుకోనట్టే తన పని తాను చూసుకుంటున్నడు. బస్సు నడుస్తుంది.

"చూడు గంగ అట్లా ఏడిస్తే ఎట్లా? అయినా అది ఎప్పుడు నీ దగ్గర వుందని? ఇప్పుడూ అంతే అనుకో" అంది మోతి.

"వున్న లేకున్న ఇప్పుడు పరాయి వాళ్లకు అప్పజెప్పి వస్తున్నం కదా ఎట్లా వుంటుందో ఏమో! వాళ్లు ఎట్లా చూస్తరో ఏమో!" ఏడుస్తునే అన్నది గంగ.

"మనకంటె మంచిగనే చూస్తరు. చూస్తివిగా ఎంతమంది పిలలున్నారో! ఆట లప్పుడు ఆటలు, చదువప్పుడు చదువు"

"నిజమే కాని..."

"పుట్టిన దగ్గరనుండి ఎన్నడు నీ దగ్గర వుందనీ? ఉండదు ఉండబోదుకూడ. ఆడ పిల్ల రేపైనా మనల్ని వదిలి వెళ్లేదేకదా" అంది మోతి.

"ఎట్లుంటదో ఏమో!"

"బాగానే వుంటది. ఈ మిషనరి బడికి, హాస్టల్‌కు మన రాష్ట్రంలోనే మంచి పేరున్నది. జనగాం అంటే చెప్పలేనంత ఇది. నీవేం పరేషాన్ కాకు. మనం అప్పుడప్పుడు వచ్చి పోతుంటంగదా? ఇంటికి దూరంగ హాస్టల్లో వుండే పిల్లలు బాగానే చదువుతరు. మా ఇద్దరన్నల పిల్లల్లో ఓ అమ్మాయి సూర్యాపేటలో వుంటుంది. పెద్దన్న కొడుకేమో సాగర్ ఆర్.డి.సిలో చదువుతున్నడు" అంది మోతి.

గంగ దుఃఖాన్ని మింగుతూ, కిటికి గుండ ఓసారి ముక్కు సీది, కొంగుతో కళ్లు అద్దుకుంది.

"ఇప్పుడేమైంది? మనం సరియైన నిర్ణయం తీసుకొని బడిలో చేరిపించినం. బాగ చదువుకొని పైకి రావచ్చు, వస్తది గూడ. అక్కడ చదివిన వాళ్లు చాలా పైకొచ్చి సమాజానికి పనికొచ్చే వాళ్లయి నరు. మనమే లెక్కకు రాకుండా పోయినమా, సంతానమన్నాక నలుగురికి మేలు చేసేవాళ్లుగ తయారైతే అంతకంటే కావల్సిందేముంది? " అంది మోతి.

గంగ మౌనంగా వింటుంది. ఈలోగ ఒక్కసారిగా మబ్బులు వచ్చినయి. చిటపట చినుకులు పడుతున్నయి. ఓ మాదిరి చల్లగాలి వీస్తువుంది. అద్దాలను దించుకున్నరు. బస్సు తిరుమలగిరి చేరుకుంది. అక్కడ బస్సు నిండిపోయింది. ఓ వ్యక్తి మోతి పక్కన వున్న ఖాళీ సీటులో కూర్చున్నడు. కండక్టర్ టికెట్ పంచ్ చేస్తున్నడు. వర్షం కాస్త ఎక్కువైంది. ఆడవాళ్లు కొంగు కప్పుకుంటున్నరు. నిలుచున్న వాళ్ల వొత్తిడి ఎక్కువైంది. మోతి వాళ్ల డ్రస్ కాకుండా మామూలుగ చీరె రవికెలో వుంది. పక్కన కూర్చున్న వ్యక్తి మోతిని తాకుతు ఈదురుగాలి నుండి తప్పించుకోవాలని ప్రయత్నిస్తున్నడు. మోతి ఓసారి అతని వైపు చూసి నవ్వింది. అతనూ నవ్విండు. దాదాపు ఇద్దరిది ఒకే వయస్సు. ఆనుకొని కూర్చోవడం వల్లా చలి కొంత తగ్గినట్టు అనిపిస్తుంది వాళ్లకు. కండక్టర్ అప్పుడప్పుడు వాళ్లను చూస్తు నవ్వుకుంటున్నడు.

"సాగరి పేరు బాగుంది కదా? " అంది మోతి.

"మనం సాగర్ అనగానె ఫాదర్ 'సాగరి' అని పెడదాం అని రాసె" అన్నది మోతి మళ్ళీతానే.

అవునన్నట్టు తలాడించి "తండ్రి పేరు దగ్గర పేచివస్తది అనుకున్న" అంది గంగ.

"వచ్చేది కాని ఫాదర్ నాకు చాల ఏండ్ల నుండి తెలుసు కనుక ఆ విషయం పట్టిచ్చుకోలేదు. నేను బడికెళ్లేటప్పటి నుండి వయస్సు వచ్చేవరకు సూర్యాపేటలోని చర్చిలో పాలు పోసేటోళ్లం. ఏ వంక, వడిలేని పిల్ల.. ఈ అమ్మాయిని మా చర్చికి ఇచ్చేస్తే బాగ చదివించి దేవుని

సేవలో వదిలేస్తమనేవాళ్ళు. అమ్మమ్మ ఒప్పుకోక నాకున్నదే ఈ ఒక్క మనుమ రాలు అని గోల చేసేది"

"లేకపోతే మతంలో చేరి సన్యాసి అయ్యే దానివన్నమాట" అంటు నవ్వింది గంగ.

"వింటివి గద ఫాదర్ మాట్లాడింది. బాల్యంలో చేరమంటె చేరలేదు. ఇష్టం వొచ్చినట్టు తిరిగినవు. రాజకీయాలు నడిపి నవ్. తిన్నవు, తాగినవు. ఇక అన్నీ ఆపేసి దేవుని సేవలోకిరా అనెగదా? నేను మాట మార్చితిగ"

"చూస్తునేవున్న" అంది గంగ.

ఫాదర్‌ది, నాది దాదాపు ఒకే వయస్సు.

## కొత్తగాలి...



**ఎన్నెన్నో కంపెనీలు**
**బినామీలే**
**తరచిచూస్తే అవన్నీ**
**అవినీతి సునామీలే**

– *అంబటి వెంకట శివారెడ్డి,*
యర్రగుంట్ల, కడప జిల్లా

చిన్నప్పుడు ఆయనకు మీసాలు వచ్చేట పుడు 'నీకపుడే మీసాలు వస్తున్నయి గద' అన్న. ఆయన నవ్వుతు నీకూ వస్తున్నయి గదా అన్నడు. నాకు అర్థంకాక మూతిమీద చేయి వేసుకుని చూసుకున్న. ఆయన ఒకటే నవ్వు. అంతలో వాళ్ల నాన్న వచ్చిండు. ఆయన ఇంట్లోకి, నేను మా తండాబాట పట్టిన. 'నీకు వస్తున్నయి' అనే మాట గుర్తురాగ, ఇంటికొచ్చి అమ్మమ్మను అడిగిన. అమ్మమ్మ నవ్వుతు అవును నీకు వస్తున్నయి చూసుకో అంది. అయినా నాకేమొస్తున్నయో అర్థంకాక అమ్మమ్మ ముఖంలోకి చూస్తున్న.

మొగపిల్లవానికి మీసాలు వస్తే పెద్ద వాడు అవుతున్నట్టు లెక్కా? మరి ఆడపి ల్లకు.. అని చూస్తూ ఆమె చూపులను నా ఎదమీద నిల్పింది. అప్పుడు నాకు అర్థ మైంది. రెండు చేతులలో ముఖం దాచు కుని ఇంట్లోకి పారిపోయిన. ఇప్పటికీ అది గుర్తొస్తే నవ్వొస్తది"

బస్సు నాగారం స్టేజి దగ్గర ఆగగానే సగం బస్సు ఖాళీ అయ్యింది. వర్షం తగ్గి, చలిని పెంచింది. చేతులు కట్టుకుని కొందరు, చేతులను వళ్ళో వుంచి మరికొం దరు బిగుసుకుని కూర్చున్నరు.

నాగారం స్టేజి దగ్గర ఆరడుగులకు కొంచం తక్కువ స్త్రీ, ఎరుపురంగు చేనేత చీర, అదే రంగు రవిక! ఎండల్లో వానల్లో తిరిగి కాయి దేరిన శరీరపు చాయ. బస్సు ఎక్కగానే చాలమంది సీటివ్వడానికి కదిలి కూర్చున్నరు. ఆమె మోతి పక్కన వున్న ఖాళీ సీటులో కూర్చుంది. కండక్టర్ ఆమె వైపు గౌరవంగా చూడగ, ఆమె తన పాస్ చూపించింది. డ్రైవర్ వెనక్కు మళ్లి 'లాల్ సలాం' అన్నడు. ఆమె నవ్వుతూ ప్రతి నమస్కారం చేసింది.

బస్సు పరుగందుకుంది.

"గంగ అమ్మకు నమస్కారం చెప్పు" అంది మోతి.

గంగ చేతులు జోడించింది. అమ్మ ప్రతి నమస్కారం చేసింది.

"అమ్మా, ఈమెది నాగార్జున సాగర్, అక్కడి మహిళా మండలి అధ్యక్షురాలు"

అట్టనా అన్నట్టు చూసింది అమ్మ.

"మనం ప్రయాణిస్తున్న నేల చాల వీరో చితమైంది. ఈ ప్రాంతంలోనే గిరిజనులు తమ భూముల్లో ఎర్రజెండాలు నాటి కాపా డుకుంది. నైజాం సర్కారు ఎదురు తిరిగిన పులిబిడ్డ మల్లు స్వరాజ్యం, ఈ తల్లే!" అంది మోతి.

"పత్రికలలో చదవడం తప్పా ఎప్పుడు చూడలేదు" అంది గంగ.

"ఎటునుండి రాక" అడిగింది.

"అమ్మా, జనగాం పోయి వస్తున్నం"

"ఏమిటి విశేషం? "

"ఈమె కూతురును మిషనరీ స్కూల్లో చేర్పించి వస్తున్నం" అంది మోతి.

గంగకు సాగరి మాటి మాటికి గుర్తురా సాగింది. బస్ కిటికి గుండా చెట్లు, చేమ లను చూస్తూ సాగరి గుర్చిన ఆలోచనల నుండి తప్పించుకుంటూ మనస్సు తేలికప రుచుకుంటూ వుంది. సూర్యాపేటకు పదికి లోమీటర్ల ముందే తండాకు వెళ్లే బండ్ల బాట దగ్గర బస్సు ఆగింది. గంగ, మోతి అమ్మకు నమస్కారం చెప్పి దిగిండ్రు.

బస్సు కదిలింది. చీకటి ముదిరి పిండి ఆరబోసినట్టు వెన్నెల వుంది. క్రిమికీటకాల చప్పుళ్లు వినిపిస్తున్నయి. అంతకుముందే వర్షం రావటం వల్లా బెక బెక కప్పల చప్పుడు. సరిగ్గా అప్పుడే ఓ ఎడ్లబండి సూర్యాపేట నుండి తండాకు వస్తుంది. రోడ్డు దిగేటపుడు మోతిని చూసి "ఏ మోతి" అని పగ్గాలు గుంజి బండిని ఆపి "ఎక్కండి" అన్నడు ఒకతను.. ఇద్దరూ బండెక్కి కూర్చున్నరు.

"ఏం అమ్ముకొస్తున్నవు లచ్చికోడే" అని అడిగింది మోతి.

"పల్లికాయలు" అన్నడు. బండి ఇంటి వైపు పోతుంది కనక పరుగెత్తుతుంది.

"ఇంత రాత్రి అయ్యిందేమిటి" అన్నడు.

"ఏం చేయమంటవు వాడు తొందరగ వొదలలేదు" అని గంగవైపు తిరిగి-

"వీడు నా అత్త కొడుకు. చిన్నప్పటి నుండి కలిసి ఆడుకున్నం. ఒంటె పెదవు లకు నక్క ఆశపడ్డట్టు నాపై ఆశ పెట్టు కుని వుండేటోడు పాపం" అంది మోతి.

"ఓసారి ఏమైందో తెలుసా, ఇంట్లో ఎవరు లేరు. నేను జాలారీలో స్నానం చేస్తున్న. అమ్మమ్మను పిలిచిండు. 'లేదు' అన్న. నీవు ఎక్కడ అన్నడు. జాలారిలో అన్న. ఎంచక్క జాలారీలోకి వచ్చేసిండు. నేను ఒక్కసారె కెవ్వుమని అరిచిన. అంతే కళ్లు మూసుకుని నిలుచున్నడు. ఎందుకొ చ్చినట్టు కండ్లెందుకు మూసుకున్నట్టు? నాకు ఇప్పటికి అర్థంకాలేదే గంగ"

లచ్చికోడే నవ్వుతు ఎడ్ల తోకలను కది లించిండు. ఏదో జ్ఞాపకాలలోకి వెళ్లిపోయి "ఇది మాయల మారిది, ఏదైన చెపుతది. పోయిన మాట నిజమే కాని నేను ఏం చేయలేదే!" అన్నడు.

"అదే నా బాధ" అంది నవ్వుతు మోతి.

"పాపం లచ్చికోడే" అంది గంగ.

మోతి ఇంటి దగ్గర బండి ఆగింది. ఇద్దరూ దిగగానే బండి సాగింది.

ఇంట్లోకెళ్లి దీపం ముట్టించి వంట పూర్తి చేసుకుని తిని, పందిట్లో మంచాలు వాల్చు కుని ఇద్దరు వరిగిండ్రే కాని నిద్ర రావటం లేదు. గంగ కళ్లల్లో సాగరే కదులుతుంది. మోతికి ఫాదర్, ఆయనన్న మాటలే గుర్తొ స్తున్నాయి. అవును నిజం. ఇష్టం వచ్చి నట్టు తిరిగిన, చేయగూడని పనులెన్నో చేసిన. వీటన్నిటికి పైన నరకంలో శిక్ష లుంటాయట! ఎటువంటి శిక్షలో?

'ప్రభువును నమ్ముకుంటే ఏ బాధలుం డవు. చేసిన తప్పులను ఒప్పుకుని క్షమాప ణలు కోరుకుంటే ఇక్కడివి ఇక్కడే మాసి పోయి, పరలోకంలో హాయిగా వుండొచ్చు అని మరి మరి చెప్పాడే. ఇదే బాగనిపి స్తుంది. ఇదే చేస్తే సరిపోదూ' అనుకుంది.

మధ్యరాత్రి లచ్చికోడె వచ్చి ఎదురుగా నిలుచున్నడు. వంటిమీది బట్టలు వాటం తట అవె జారిపోయినయి. ఈసారి నేను కళ్లు మూసుకున్న. లచ్చికోడె వల్లంత తడిమి చూస్తున్నడు. ఉన్నట్టుండి లచ్చి కోడె యమ ధర్మరాజుగా మారిపోయాడు. యమలోకం తీసుకపోయి చిత్రగుప్తున్ని పిలిచి, 'మోతి అనే ఈమె ఏమేమి చేసింది చెప్పమన్నడు'

"చిత్తం ప్రభు. ఈమె ఓ వ్యభిచారిణి. ఎంతోమంది ముందు నగ్నంగ నిలుచుంది" అన్నాడు చిత్రగుప్తుడు.

"అందుకు ఈమెకు ఏ శిక్ష"

"ఏముంది మన చట్టం ప్రకారంగా సలసల కాగే నూనెలో ముంచి, ఎండ్రికాయలతో, పాములతో, తేళ్లతో కరిపించాలి" అన్నడు చిత్రగుప్తుడు.

"అమ్మో" అని అరిచింది మోతి.

ఆ కేకకు గంగ లేచి- "అక్క, అక్క" అని కదిపింది. "ఏంటక్క ఏం జరిగింది" అని అడిగింది.

"యమలోకం! యమలోకం!" అంది బొంగురు గొంతుతో.

"అర్థం అయ్యేటట్టు చెప్పు, కలా? " అని అడిగింది గంగ.

"కలో నిజమో, ఇప్పుడు కల అయినా ఇదే నిజం అయ్యేటట్టుంది. ఫాదర్ చెప్పినట్టు, చేసిన తప్పుడు పనులను చర్చిలో దేవుని ముందు చెప్పి క్షమాపణ కోరాలి. అదొక్కటే మార్గం. లేకపోతే నరకం తప్పదు" అంటూ మళ్లీ నిద్రలోకి జారుతున్నప్పుడు గంగకు గూడ భయం అనిపించింది. ఆ తరువాత ఆమెకు తెల్లార గట్ట గానీ నిద్ర పట్టలేదు!

పొద్దుపొడిచి, చెట్ల కొమ్మల నుండి, రెమ్మల నుండి ఆకుల అడ్డును తప్పించుకొని భూమ్మీద పడుతున్నయి లేత అరుణ కిరణాలు.

గంగ ఇంక నిద్ర లేవలేదు. సరిగ్గా అప్పుడే లచ్చికోడె సొరకాయ బుర్రలో తేనె నింపుకుని వచ్చి, అప్పటికే మోతి వాకిట్లో వేస్తున్న ముగ్గును పట్టి పట్టి చూస్తు నిలుచున్నడు. అతన్ని చూసిన మోతి నవ్వుతు "రాత్రే వస్తివి ఇప్పుడు మల్లెందుకొస్తివి" అంది నవ్వుతూ.

క్షణం తికమకగా చూసిండు.

"కలలోనోయ్ మగడా" అంది పడి పడి నవ్వుతు. తేనె బుర్రను అందుకొని లోపలికి నడిచి తిరిగొచ్చేవరకు అతను ముగ్గును చూస్తున్నడు.




**గం**గ తండా చేరేసరికి పొద్దు నెత్తిమీదికొచ్చింది. మోతి ఇంటి ముందుకెల్లి చూసేసరికి ఇంటికి తాళం వేసివుంది. పందిట్లో నిలుచోని మోతి వాళ్ల మేనమామల ఇంటివైపు చూస్తుంది. మోతి మేనమామ భార్య సీత గంగను చూసి రమ్మని సైగ చేసింది. గంగ వాళ్ల ఇంటివైపు నడిచింది. సీత కాళ్లకు నీళ్లిచ్చి పందిట్లో నులక మంచం వాల్చింది. గంగ మంచం మీద కూర్చుంటు "బాగున్నర? " అంది.

అంతా బాగే అన్నట్లు నవ్వుతు చూస్తు ఇంట్లోకి నడిచి, గ్లాసెడు మజ్జిగ తెచ్చి ఇచ్చింది. ఆమె పూర్తిగా బంజార బట్టల్లోనె వుంది. నెత్తిపైనుండి దుపట్ట వెనక్కు జారి వుంది. రెండువైపుల కణతలపై వెండి కుప్పెలు వేలాడుతున్నయి. రెండు చేతులకు తెల్లని వెడల్పాటి గాజులు దండరెక్కల వరకున్నయి. పాదాలకు వంకుల కడియాలు. నడీడు మనిషి అయినా వయస్సు పోయినట్టు కనపడడం లేదు.

మజ్జిగ తాగుతూ చుట్టూ చూసింది గంగ. పచ్చని చెట్లు, వాటిమీద రకరకాల పక్షుల కిలకిలారావాలు. కొంత దూరంలో పారే వాగు. దానిపై తిరుగాడే కొంగలు.

చూడముచ్చటగా వుంది. తాను వుండే డామ్ చుట్టుర అడవి వున్నా ఇంత అందంగా కనిపించదు అనుకుంది.

ఖాళీగ్లాసు ఇస్తూ "మోతక్కలేదూ? " అని అడిగింది.

లేదన్నట్టు తలాడించిందామె.

ముఖంమీద నవ్వు తెచ్చుకుంటు "నీకు ఎపుడూ చెప్పలేదా ఎటుపోయేది? ఆమె కిరస్తాన వాళ్లమ్మటి పోయింది కదా!" అం దామె మళ్లీ తానే.

గంగకు కాసేపు మాట రాలేదు.

"ఫాదర్, రమ్మంటున్నడన్నది కాని ఇంత తొందరగనా! ఇంకొంత కాలం తరువాత అనుకున్న, పోయిందా? " అంది గంగ నీర సంగా. తర్వాత మళ్లీ అడిగింది.

"ఎప్పుడన్న వచ్చి పోయిందా? "

"ఓసారి పొద్దున వచ్చి, పొద్మూకి పోయింది. మామలుండమన్నా వుండ్లే"

అట్టనా అన్నట్టు చూసింది గంగ.

"ఆ ఫాదర్ చెప్పిన మాటలు తలకెక్కి నయి. అంతే నమ్మింది, వాల్ల వెంట ఎల్లి పోయింది" అన్నది సీత.

గంగ ఆలోచిస్తూ వుంది.

"సరె తరువాత మాట్లాడుకుందాం" అంటూ ఇంట్లోకి నడిచి ఓ సత్తు పళ్లెంలో జొన్నరొట్టెలు, ఇంకో చిన్నగిన్నెలో తేనె పోసుకొచ్చి ఇచ్చింది. గంగ ఆ పలుచని జొన్నరొట్టెలనే చూస్తుంది. ఈ లోపల చెంబులో నీళ్లు తెచ్చి పెట్టింది.

"నీకు ఏం చెప్పిందో ఏమో కాని, ఆమె ఎనక చెప్పుకోలేని కథలున్నయి. వాటిని తలుచుకుని తట్టుకోలేక మారు మనస్సు కోసం ఆరాట పడ్డది. ఈమె అందచం దాలు చూసి ఓ దొర కొడుకు ఈమెనే చేసుకుంట అన్నడట. నీవు దొర కొడు కువు. అది అడవి బిడ్డ ఎట్లా కుదురుత దని, అతనిని గదిలోనె బంధించి బయ టికి రానియ్యలేదు. ఆమెను లోపలికి పోనీ యలేదు. ఈమెనే కలవరించి కన్ను మూసిండు. ఓ డబ్బున్నోనితో సోపతి పెంచుకుని ఎంట తిప్పుకుంది. భార్య ఇసం తిని చచ్చింది. ఇట్లా పొడుగూత ఎన్నో జరిగినయి. మనిషి చక్కనిది. అందుకని అందరు వెంటపడేది. మా అత్త చదువు మానిపించినా తిరుగుడు మాన లేదు. ఆ తరువాత కొన్నేళ్లు ఓ నాయ కుడు ఎంట తిప్పుకున్నడు. పైరవీలు చేయనేర్చి పైసలు సంపాదించింది. వళ్లు కాపాడుకుంది. కాని తాగుడలవాటైంది.

"అవును మీరు ఆమెకు పెండ్లి తలపెట్ట లేదా" అని అడిగింది గంగ.

"ఎందుకు తలపెట్టలేదు? మొగోళ్లు మోసకారులు, నేను నేసుకోననేది. నీకు తన గురించి అసలే ఏం చెప్పలేదా? "

"పెండ్లి చేసుకోలేదని చెప్పింది. నేను గూడ అంత ఇదిగా అడగలేదు"

"మా అత్త మొదట బాగానే పెండ్లి గురించి పట్టుపట్టింది. రాను రాను చేసు కోకుంటే చేసుకోకపాయె అని వదిలేసింది. ఆ తరువాత ఆమె ఆడిందే ఆట పాడిందే పాట. ముక్కు ముఖం చక్కగుంది. ముత్యాల పలువరస, గాజర్‌గడ్డ రంగు తేనెకళ్లు. సూటిగా చూసిందంటె ఎదుటి మగాడు గిలగిల కొట్టుకోవల్సిందే!"

గంగ ఓ పెద్ద నిట్టూర్పు వొదిలింది.

సీత ఇంట్లోకి వెళ్లి చెంబెడు నీళ్లు తెచ్చిచ్చింది.

గంగ తృప్తిగా తాగి "బావి నీళ్లేనా" అని అడిగింది.

"కాదు వాగులోని చెలిమ నీళ్లు" అంది.

"చెట్లగాలి, చెలిమ నీళ్లు అందుకే మీ రంగు, రూపం ఇట్లా వుంటది. మేం తాగే నీళ్లు ఇట్లా వుండవు. అందుకే మాద్పు రంగు వంకర టింకర వేళ్లు"

"కాస్త అట్టా అడ్డం ఒర్గరాదమ్మ"

"లేదత్త పోవాలే" అంది గంగ లేస్తూ.

అప్పుడె తండ నుండి రోడ్డువైపు ఓ ఎడ్ల బండి పోతూంది. అది చూసిన సీత "ఏయ్ నాయక్ ఎటు? " అని అడిగింది.

"ఎరువులు తేవడానికి పేటకు" అన్నడు ఎడ్లపగ్గాలను గుంజి పడుతూ.

"ఈ అమ్మను రోడ్డుదాక ఎక్కిచ్చుకపో" అంటూ తానే బండెక్కించింది సీత.

బండి పరుగుతీస్తువుంది.

"ఏ వూరమ్మ? "

"సాగర్"

"మోతి దగ్గరకొస్తివా? " అన్నడు.

గంగకు జవాబు చెప్పాలనిపించలేదు.

బండ్ల బాటన బండి పరుగెత్తుతువుంటె చక్రాల కింద నలిగె ఇసుక స్స్ మని శబ్దం చేస్తు రాళ్లొచ్చినచోట కర్ర్ర్ మంటుంది.

"ఆడింది ఆడింది ఆగిపోయింది"

"ఎవరు? " అన్నది.

"అదే మోతి, వయస్సులో ఏది కనబడ లేదు దానికి"

అతని మాటలు గంగకు నచ్చలేదు.

"ఎప్పుడు పడితే అప్పుడు ఎక్కడ బడితే అక్కడ కలుసుకునేది ఒక్క మనిషే, మరే జీవి అట్లా కాదు. అంతేకాదు తన అనే తత్వముండేది మనిషిలోనే" అన్నాడు.

నిజంగ మనిషి ఎందుకిట్లా? చూపులో, నడకలో, నవ్వులో అదే యావ. పాటలో మాటలో అదే కోరిక. తనది వున్నంక మందిదానిమీద మరలుడెందుకో! కోరిం దాన్ని పొందటంకోసం యుద్ధాలు! వ్యక్తుల మధ్య కావచ్చు దేశాల మధ్య కావొచ్చు నాడు అంతే, నేడు అంతే.

బండి రోడ్డు ఎక్కుతుంటె "ఆపండి" అంది. బండి ఆగింది. గంగ దిగింది.

సూర్యాపేట వైపు వెలుతున్న లారీ ఓటి గంగ పక్కనే ఆగి, 'వస్తవా? ' అన్నట్టు సైగ చేసాడు డ్రైవర్ ఓ మాదిరి చూస్తూ.

'రాను' అన్నట్టు తల అడ్డంగా ఊపింది. ఇంతలో బస్సురాగానే ఎక్కేసింది.

ఇల్లు చేరేసరికి దీపాలు పెట్టే వేళైంది. దుర్గ ఏదో పత్రికను తిరగేస్తూ కూర్చుంది. గేటు తీసుకుని లోపలికి నడిచి, కాళ్లు చేతులు కడుక్కొనొచ్చి కూర్చుంది గంగ.

"కవరొచ్చిందమ్మా" తెచ్చి ఇచ్చింది దుర్గ.

'గంగగారు, వందనం.

మీ కాకపొడిని ఆహార పదార్థాల పరిశోధన కేంద్రంలో పరీక్షించినం. దీనిలో ఐరన్ వుంది, ఎల్లిపాయ వుండడం వల్లా బ్యాడ్ కొలెస్ట్రాల్‌ను తగ్గిస్తది. దీనిని ఎక్కువ ఉత్పత్తి చేసి మార్కెట్‌లోకి తెస్తే మంచి గిరాకి ఉంటుంది. దీనిని కొంత కాలం నిల్వ కూడా వుంచవచ్చుట.

మీరు హైద్రాబాదు వచ్చినప్పుడు మా ఆఫీసుకు రండి, వివరాలు మాట్లాడొచ్చు

అడ్రస్: 7-12, రోడ్ నెంబర్ 12, బంజారాహిల్స్, హైద్రాబాద్.

మీ

జాన్‌సన్'

"దుర్గ మన కాక పొడికి గిరాకి రానున్నది. అది ఆరోగ్యానికి చాల మంచిదట. ఆ రోజు రాలే, ఆ జాన్‌సన్ సార్ ఉత్తరం రాసారు" అంది గంగ సంబరంగా.

"అవును మరి, కరివేపాకు, ఎల్లిపాయలు వంటికి మంచివే కదా, ఇంకేం రాసిండు"

"హైద్రాబాదు వచ్చినప్పుడు కలిస్తే మాట్లాడుకోవచ్చు" అని గూడ రాసిండు.

"ఈసారి పోయినపుడు కల్సి మాట్లాడి రారాదు"

గంగకు నాడు మహిళ సంక్షేమ శాఖ మంత్రి అన్న మాటలు గుర్తొచ్చినయి. 'మహిళలు ఆర్థిక వనరులు కల్పించుకొని జీవన ప్రమాణాలు పెంచుకోవాలి. అందుకు ప్రభుత్వ సహాయం ఎప్పుడూ ఉంటుంది. చిన్న చిన్న కుటీర పరిశ్రమలు నడుపుకుంటే బాగుంటది'

"ఈ కాకపొడి ఉత్పత్తి ఓ కొత్త మార్గం.

పెద్ద పెట్టుబడి అవసరం లేదు కాని మార్కెటింగ్‌దే సమస్య" అంది గంగ.

"అది ఆయనే చెపుతడు. మీరెళ్లండి? "

"సరే, రేపే వెళ్లి, వచ్చేటప్పుడు నల్లగొండలో ఓ రోజు ఉండి, విమలక్కను గూడ కల్సొస్తాను"

సరేనన్నట్టు తలాడిస్తూ దుర్గ అక్కడి నుండి కదిలింది.

గంగ మదిలో ఒక్కసారిగా తన అక్క కదిలింది. 'అక్కలాంటి అభాగ్యులెంత మందో! వాళ్లు కాకపొడి తయారీని కుటీర పరిశ్రమగా పెట్టుకుంటే మంచిగా సంపాదించవచ్చు. అప్పుడు వేధించే పేదరికం తొలగిపోతది' అనుకుంది.

మధ్యాహ్నం ఓ ముద్ద తిని పత్రికను తిరగేస్తూ కూర్చుంది గంగ.

"పోస్ట్" అన్న కేక విని గేటు దగ్గరికొచ్చి, సంతకం చేసి కవర్ తీసుకుంది.

చెట్లవైపు చూస్తూ "చెట్లు కాతకొచ్చినయి. ఈసారి కొబ్బరినీళ్లు తాగాలి" అన్నడు పోస్టతను.

"రావు మరి, ఐదేండ్లు దాటె" అంటూ కవర్ ఇప్పుకుంటూ లోపలికి నడిచింది.

రాష్ట్ర సచివాలయం నుండి లేఖ

'విషయం: సంచార కులస్తుల

ఉపాధి గూర్చి

సూచిక: మీ దరఖాస్తులు

మీ దరఖాస్తులను పరిశీలించిన ప్రభుత్వం నిపుణుల కమిటీ సలహాలను కోరింది. అందుకు వాళ్లు స్పందిస్తూ నల్లగొండ జిల్లానే పైలెట్ ప్రాజెక్టుకు ఎన్నిక చేసారు. ముఖ్యంగా కొన్ని గ్రామాలను ఎన్నిక చేసి ప్రభుత్వ అధికారులను పంపించి విషయం సేకరణ గావించి, రిపోర్టులను పంపించవల్సిందిగా కోరడం జరిగిందని తెలియపరచనైనది. ఈ సమస్యకు వీలైనంత త్వరలో తగు చర్యలు తీసుకోబడునని తెలియజేయడమైనది.

తమ విశ్వాసపాత్రుడు,

కార్యదర్శి

రాష్ట్ర ప్రభుత్వ సచివాలయం'

చదవడం పూర్తిచేసి, ఓ బరువైన శ్వాస తీసింది గంగ. ఇప్పటికైనా ఓ కొలిక్కొచ్చిందనుకుంది. తన ప్రయత్నం ఫలిస్తున్నందుకు కొంచెం తృప్తి కలిగింది. తరాల నుండి ఎవరూ పట్టించుకోని సమస్య ఇది. తాను ఇచ్చిన దరఖాస్తులకు సానుకూలంగా స్పందిస్తూ, ప్రభుత్వంలో చలనం తెప్పించిన నాటి మహిళ సంక్షేమ మంత్రిగారికి మనస్సులో కృతజ్ఞతలు తెలుపుకుంది. చూడడానికి సన్యాసిలా కన్పించే, రుద్రాక్షల కార్యదర్శికి కూడా కృతజ్ఞతలు చెప్పుకుంది. ఆనాడు దొంగసాములు, కొంగజపం చేస్తరని అతన్ని ఎగతాళి చేసినందుకు మనస్సులోనే సిగ్గు పడ్డది. అంతే కాదు, ఆయన దగ్గరున్న అటెండర్, ఆడవాళ్లంటే వొదలడని చెప్పి ఆయన మీద చెడు అభిప్రాయం కలిగించినందుకు, అతన్ని కసిగా తిట్టుకుంది. కొంతమంది తమ తిక్కను ఇతరులకు ఆపాదిస్తుంటరు. అలాంటి వాళ్లల్లో వీడొకడున్నట్టుంది. అసలు మోతక్కను చూడగానే వానికి నోట్లో నీళ్లూరినట్టున్నయి. దానిని ఆఫీసర్ మీదికి తిప్పి నోటి తీటను తీర్చుకున్నడనుకుంది. ఉత్తరాన్ని చదివినంకా గంగకు తన కులపుస్త్రీలకు మంచిరోజులు రానున్నయని, మనస్సంత తేలిక అనిపించింది.

మరునాడు మళ్లీ ఓ ఉత్తరం వచ్చిందని ఇచ్చిపోయిండు పోస్ట్‌మాన్.

కవర్ ఇప్పి చూడగా, అక్షరాలు మోతివి. లోపలికి పోకుండ అక్కడే చెట్టు కింద కూర్చుని చదవసాగింది.

'ప్రియమైన గంగకు,

మోతి రాయునది. ఈమధ్య జనగాం వెళ్లొచ్చిన. సాగరి బాగనే వుంది. మంచిగానే చదువుకుంటుందని ఫాదర్

చెప్పిండు. పాప నన్ను గుర్తుపట్టలేదు. గుర్తు పట్టందే మంచిదని ఫాదర్ అన్నడు.

నన్ను అందరు మతంలో కల్సింది అను కుంటున్నరు కదా. నీవు కూడా నమ్మి నాలే. ఆ నమ్మకం అట్టనే వుంచండి. నీకు చెప్పకుండా పోయినందుకు కొంత బాధ వుండే! వివరాలు తరువాత వుత్తరంలో. ఇప్పటికి వుంటా.. నీ అక్క మోతి'

ఉత్తరం కాగానే కళ్లలో నీరు తిరిగింది. సాగరి గుర్తొచ్చి కన్నీటి చుక్కలు చెంపల మీదినుండి రాలినయి. ఏం తింటుందో ఎట్లా వుంటుందో బిడ్డ అని చాలాసేపు అంగలార్చుతు వుండిపోయింది. కని ఏం సుఖం? ఓ పెంచినట్టు లేదాయె, పెద్ద చేస్తున్నట్టు లేదాయె అనుకుంది. అక్క గుర్తొచ్చింది. ఓసారి కలిసిరావాలను కుంది. ఈలోపు పని మనిషి తెచ్చిన కాఫీని చప్పరిస్తూ తన జీవిత సంఘట నలు గుర్తుచేసుకోసాగింది.

"నేనట్ల వెళ్లొస్త" అంటు తర్వాత లేచి తయారై బయటికి నడిచింది. తన తల్లి వాళ్ల గుడిసెలు చేరేసరికి మసక చీక టైంది. గుడిసె ముందు మంచంమీద కూర్చున్న జమున, గంగను చూసి ఎదు రెళ్లి- "బాగున్నవా గంగ.. ఎన్నాళ్లకు గుర్తొ చ్చినం? " అంటూ చేయందుకుని మంచం మీద తన పక్కన కూర్చోపెట్టుకుంది.

జమునకు ఒక్కసారె దుఃఖం తన్నుకొ చ్చింది. ఇద్దరు ఒకరి భుజం ఒకరు పట్టు కుని ఏడ్చిండ్రు. "పాప బాగుందా? ఎక్క డుంది" అని అడిగింది జమున.

"ఏదో ఓ చోట బాగనైతే వుందక్క"

"నీవెంత కఠినపుదానివే గంగ. బళ్ళో చేర్చినవుగదా.. ఏం పేరు పెట్టినవు? "

"అది కూడ చెప్పను, పేరు చెపితే నీవు అమ్మకు చెపుతవు. ఆ పేరును ఆరాతీసి, దాన్ని తిరిగి తెచ్చుకునేయొచ్చు అమ్మ" అంది గంగ.

**జూన్ - 2011**

**చతుర ప్రవేశిక విజేతలు వీరే!**

త్రాలో ఎంపికైన ఈ ఐదుగురికి త్వరలో బహుమతులు అందుతాయి.



1. **ఎం. అలివేలు,**
   - హిల్ కాలనీ, నల్గొండ జిల్లా
2. **లలిత దేవులపల్లి,**
   - ఉయ్యూరు, కృష్ణా జిల్లా
3. **రశీద్ శిక్షక్,**
   - సిరిసిల్లా, కరీంనగర్ జిల్లా
4. **విజయలక్ష్మి ,**
   - కె. పెంటపాడు, ప.గో. జిల్లా
5. **ఆర్. మధురిమ,**
   - వెస్ట్ మారేడ్‌పల్లి, సికింద్రాబాద్

**సరైన జవాబులు**

| | |
|---|---|
| 1. జెండావీధి | 6. నివాస్ |
| 2. మెడిసిన్ | 7. పెద్దింటి అశోక్ కుమార్ |
| 3. మాలతి | 8. 1951 |
| 4. శేఫాలీ భట్ | 9. కలబంద రసం |
| 5. పోలవ్యాన్‌లో | 10. కానిస్టేబుల్ |

"నేను అట్ల చెప్పనులేవె, ఏం పేరు చెప్పు? " అని గుచ్చి గుచ్చి అడిగింది.

"అమ్మెటుపోయింది? " అని ఓసారి చుట్టూ చూసింది గంగ.

"బజారుకు వెళ్లొస్తనని పోయింది"

తన పర్స్‌లో నుంచి కొన్ని నోట్లు తీసి ఇవి వుంచు అన్నట్టు చూసింది. అక్క వాటిని తీసుకుని జాకెట్ కింద దోపు కుంటు "అవును పాప పేరె చెప్పవైతివి" అని అడిగింది.

చెప్పక తప్పనట్టుందనుకున్న గంగ

'సాగరి' అని చెప్పింది.

"జమున, గంగ, సాగరి బాగుంది" అంది జమున.

"బాగానే వుందికాని ఈ పేరు ఎవరికైనా తెల్సిందో, ఈ మాత్రం కూడా నన్ను చూడనోచుకోవు సుమా" హెచ్చరిస్తూనే- మంచం మీదినుండి లేస్తూ "నాన్న బాగున్నడా? " అని అడిగింది.

'ఏం బాగు, తాగి తాగి ఎండిపోయిండు. ఎక్కువ కాలం బతకడనుకుంట"

"ఎవరు చేసుకున్నది వాళ్లవెంటేకదా? " అంది గంగ, అక్కడి నుండి కదులుతూ.

జమున గంగను కొంత దూరంగా సాగనంపి, తిరిగొస్తున్నప్పుడు "అక్క నేను వచ్చిన్నని చెప్పాలనుకుంటె చెప్పు. ప్రస్తుతం నేను ఇక్కడ వుండడం లేదు, హైద్రాబాద్‌లో వుంటున్న. మరిచిన.. మన కులం ఆడవాళ్లకు మంచిరోజులు రానున్నయి. ప్రభుత్వ సహాయంతో ఏదేని పనిచేసుకుంటు నలుగురిలో గౌరవంగా బతుకొచ్చు" అంటు నడకలో వేగాన్ని పెంచింది గంగ.

జమున తిరిగి గుడిసె వైపు నడిచింది.

ఇల్లు చేరేసరికి చీకటి పడింది. వచ్చి మంచంమీద వొరిగింది. తన గురించి తాను ఆలోచిస్తూ వుంది. తనలో ఏ మార్పొచ్చిందో? . ఏదో మార్పు వచ్చివుంటుంది. లేకపోతే అట్లా కొత్త మనిషిని చూసినట్టు ఎందుకు చూస్తరందరు?

"పాత ఊరే, పాత జనమే అయినా అట్లా కొత్తదానిలాగ చూస్తరేం దుర్గ? " అని అడిగింది.

"గతానికి, ఇప్పటికి మీలో మార్పొచ్చిందమ్మ.. కొంచం లావు అయినరు, కట్టు

బొట్టులో మార్పు వచ్చింది. నాతో కూడా కొంతమంది అడిగిండ్రు. మరిచా.. మీరు అటు పోయినంకా కొందరాడవాళ్లొచ్చి పోయిండ్రమ్మ. విషయం ఏమిటని అడిగితె ఏదో మహిళా సంఘం గూర్చి మాట్లాడాలె అన్నరమ్మ"

"ఇకనుండి ఎవరన్న వస్తే, అదిగో ఆ మూడో ఇంటిలో ఆఫీసు పెడుతున్నం, అక్కడ కూర్చోమను. అక్కడ పత్రికలు ఉంటయి, సొంతంగ ఏదైనా చేసుకోవడానికి కుటీర పరిశ్రమల గూర్చిన సమాచార పుస్తకాలుంటయి. చదువుకొమ్మను"

"అమ్మా ఓ మాట అడగనా? "

అడుగు అన్నట్టు చూసింది.

"ఏం లేదు, నేను గూడ ఏమన్న చేసుకోవాలనుకుంటున్న. మీరే ఏదైన చూసి, లోన్ ఇప్పిస్తే, మిమ్ముల తలుచుకుంటు బతుకుతం. ఇద్దరాడపిల్లలు పెద్దయితూనే వున్నరు"

ఆడపిల్లంటె తల్లికి. తండ్రికి ఓ బరువే కదా అనుకుంది. సాగరి గుర్తొచ్చింది.

"అమ్మ రేపు ఊళ్లో ఉంటున్నరా.. ఏం లేదు నిన్న పోస్టాయిన, ఓ పుస్తకం వచ్చింది.. ఆమెకె ఇవ్వాలి అన్నడు. సరె, పోయొస్త అమ్మ" అంటు దుర్గ కదిలింది.

మరునాడు మధ్యాహ్నం పోస్ట్‌మాన్ వచ్చి ఓ కవరిచ్చి సంతకం తీసుకుని పోయిండు.

గంగ కవర్ విప్పింది. అందులో రెండు పత్రికలున్నయి. వాటి మీద బొమ్మలను చూడగానే ఎదమీదికి చేయివచ్చింది! కళ్లల్లో కాంతులు మెరిసినయి. గుండె నిండా ఆనందం. కనుకొలుకులు తేమైనయి. పట్టరాని సంతోషం ఎవరికి చెప్పుకోవాలి. అదో ఇంగ్లీష్ మాసపత్రిక! తన ఫొటోను ప్రపంచమంత చూస్తరు. అదే బొమ్మ. అదే వాకిలి. ముగ్గేస్తున్నట్టుంది. రంగుల్లో అచ్చం ఇంటిముందు ఇప్పుడు ముగ్గేస్తున్నట్లే వుంది.

ఆ పత్రికలను అట్టాగే ఎదమీద పరుచుకుని పడుకుంది. ఎప్పుడు నిద్ర పట్టిందో.. సాయంత్రం దుర్గ వచ్చి పిలిస్తేకాని లేవలేదు. దుర్గకు ఆ పత్రిక చూపింది. చేతిలో చేయి వేసి కౌగిలించుకుంది. చెప్పలేని ఆనందాన్ని ప్రదర్శించింది.

"ఎంత బాగుందో!" అని ముద్దు పెట్టుకుంది దుర్గ.

"అమ్మా ఆ తెల్లాయన ఎపుడొస్తడో.. నేను కూడ ఓ ఫోటో తీయించుకోవాలి" అంది అమాయకంగ.




హిల్‌కాలనీ బస్‌స్టాండ్‌లో అంబేద్కర్ బొమ్మ పక్కన హైద్రాబాద్ వెళ్లే బస్ వచ్చి ఆగింది. గంగ ఎక్కి చుట్టూ చూస్తూ నిలుచుంది. డ్రైవర్ వెనక అప్పటికే కిటికీవైపు అంగన్‌వాడి శాంతమ్మ కూర్చొని వుంది. గంగను చూసి కూర్చొమ్మని సైగ చేసింది. తన బ్యాగ్‌ను పైన సర్ది కూర్చుంది.

బస్ కదిలింది.

"హైద్రాబాదుకా? " అడిగింది శాంతమ్మ.

అవుననని తలూపి-

"మీరు" అడిగింది గంగ.

"ఇక్కడికే పెద్దవూర వరకు, ఆ ఏమాయే గంగ ఏదో కుటీర పరిశ్రమ అంటివి? "

"దానికోసమే పోతున్ననక్క. త్వరలోనే ప్రారంభిద్దాం"

"మరి మిషనరీ, వగైరా"

"ఖాదీ గ్రామోద్యోగ బోర్డువాళ్లు, జిల్లా చిన్న పరిశ్రమలవాళ్లు సహకరిస్తారు. సబ్సిడీ వుంటుంది. మనం మార్జినల్ మనీ మాత్రమే పెట్టవల్సి ఉంటుంది. ఆ విషయాల్నీ విమలక్క చూసుకుంటది"

"మార్కెటింగ్ మాటేంటి? "

"ఆ విషయం మాట్లాడి పెట్టిన, వాళ్లు చూసుకుంటరు"

ఆ మాట ఈ మాట మాట్లాడుతూ వుండగానే పెద్దవూర వచ్చింది. బస్సు ఆగ గానె శాంతమ్మ దిగిపోతూ "మల్లెప్పుడొ స్తవు? " అని అడిగింది.

"ఈసారి పనులన్నీ చూసుకొని వచ్చెస రికి కొంచం టైం పట్టొచ్చు" అంటు చేయి ఊపుతు ఫ్రీగా కూర్చుంది. ఇంకా పక్క సీటులో కొత్త దంపతులు కూర్చున్నరు. తనను పెళ్లి చేసుకొమ్మన్న డాక్టరమ్మ సలహా గుర్తొచ్చి ఓ మాదిరి నవ్వు పెదా లమీద కదిలింది. సాగరిని ఓసారి చూసి రావాలి అనుకుంది.

మల్లెపల్లి చౌరస్త వచ్చింది. ఆ రోజు అంగడిలాగుంది. జనం గుంపులు గుంపులు తిరుగుతున్నరు. వాళ్లలో బంజార స్త్రీలు కనిపించగా మోతక్క గుర్తొ చ్చింది. ఆమె తెగింపు, తెలివితేటలు కళ్ల ముందు కదిలినయి.

శాంతమ్మ గుర్తు చేసిన కుటీర పరిశ్రమ గుర్తొచ్చింది. అంతేకాదు దానికి కారకుడైన జాన్‌సన్ సారు గుర్తొచ్చి గిలిగింతలు పెట్టి నట్లు అనిపించగా, చుట్టు ఓసారి చూసి వ ళ్లంత కొంగుతో కప్పుకుంది. ఆడ మగ శరీరాలు రాసుకున్నప్పుడు ఏం జరుగు తుందో వయసొచ్చిన వాళ్ళకు తెలుసు. ముందుసీటులో ఓ ప్రౌఢ ఎక్కి కూర్చుంది. ఆ తరువాత మరొక వ్యక్తి దాదాపు సమ వయస్కుడు ఎక్కి ఆమె పక్కసీటులో కూర్చున్నడు. ఆమెను పలు కరిస్తూ 'మీరెక్కడకు? ' అని అడిగిండు. ఆమె 'హైద్రాబాదు' అంది. కండక్టర్ టికెట్ అంటూ రాగానే వంద నోటిస్తూ "రెండు హైద్రాబాదు" అన్నది.

"మీ టికెట్ నేను తీసుకుంటనండి" అన్నడు తాను వంద నోటును కండక్టర్ కివ్వబోతూ.

"ఒకరిచ్చింద్రు కదా" అన్నడు కండక్టర్.

ఆమె ముదురు చామనచాయ, గంధం రంగు చీరె, రవికె అదే రంగు గాజులు. కలిగినింటామె వున్నట్టుంది.

"నా దగ్గర చిల్లెర లేకనే వంద నోటి చ్చిన. ఆయన ఎలాగో వెనకరాస్తడు. దిగె దగ్గర మనం మరిచిపోతం. ఇంతె సంగ తులు- అందుకని మీ టికెట్ గూడ తీసు కున్న" అన్నదామె ముసి ముసినవ్వుతూ.

ఆమె చొరవకు బిత్తరపోతు అతను "సరె, దిగినచోట చిల్లర ఇస్తలే" అన్నడు.

అపరిచితులు ఒకరి టికెట్ ఇంకొకరు తీసుకోవడం. కొంచం ఓ మాదిరగ అని పించింది గంగకు. బస్సు గుంతలో పరుగె డుతువుంటే ఇద్దరు నిద్దుర పోతున్నట్టు తలలు వంచి కూర్చున్నరు. ప్రయాణించి నంతసేపు కాలం కమ్మగ కరిగిపోవా లంతె. 'అమాయకపు స్త్రీ తెలివైన పురుష నికి దగ్గరౌతదో కాదో కాని తెలివైన స్త్రీ అమాయకునికి దగ్గరై తెలివైనదిగ గుర్తిం చబడాలని కోరికేమో' అనుకుంది గంగ.

నాడు జాన్‌సన్ తన పెదవులపై పె దవులుంచినపుడు ఊపిరి ఆగినట్టనిపిస్తే ముఖాన్ని కాస్త ఎడంగ వుంచుకోక తప్పిం దికాదు కాని పక్కకు తిప్పుకోవాలనిపించ నందుకు సిగ్గనిపించింది.

బస్సు కడ్డంగా ఓ ఉడుం పరుగెత్తుకు రాగ డ్రైవర్ సడన్ బ్రేక్ వేయగా, తల సీటు పైప్‌కు తగిలింది. చేతిలోన చంక

సంచిని పక్కన్నే వున్న ఖాళీ సీటుపై వుంచి, కొంగును మెడ చుట్టు తిప్పుకుని, పెదవుల మధ్య అణిచి పట్టుకుని తనలో తాను తీయగా నవ్వుకుంది. మరుక్షణం ఏదో తెలియని బాధలోకి వెళ్ళిపోతూ కిటికిలో నుండి బయటికి చూస్తూ వుండిపోయింది. బతుకులో నిప్పులు పోసినోణ్ని తిట్టుకుంది.

సచివాలయం చేరేసరికి లంచ్‌టైమ్ అయ్యింది. క్యాంటీనుకు వెళ్ళి పెరుగన్నంతో చల్లబడి, పని వున్న అధికారులను కలిసి, సాయంత్రం ఐదింటికి సుశీల సీటు దగ్గర్కి వచ్చి నిలుచుంది. ఆమె సవ్వడికి తలెత్తి చూసిన సుశీల "ఎప్పుడొస్తివి గంగ, కూర్చో" అంటు పక్కకుర్చి చూపించింది. సచివాలయం వచ్చినప్పుడు అప్పుడప్పుడు ఆమెను కలుస్తూ వుంటుంది.

"వచ్చినపని అయ్యిందా? "

"కాలేదు. ఈసారి నాలుగైదు పనులతో వచ్చినా. వారం పదిరోజులు పట్టొచ్చు. ఒక్కదాన్నే హోటల్లో వుండలేను. మీ గూట్లో కాస్త చోటు ఇస్తే-" అని ఆగింది.

"అదేమిటి గంగ, వుండిపోతవు కాని ఎత్తుకపోతవా ఏంది? మోతి వుంటె నీవు రాకనే పోదువుగద" అంది నవ్వుతూ. మోతి అంటె సుశీలకు చాల యిష్టం.

అవుట్‌వార్డ్ సెక్షన్‌లో ఆమె వున్నప్పుడు కాగితాలను పోస్ట్‌లో పంపిస్తం అంటే తన అవసరాన్ని ప్రాధేయపూర్వకంగా వివరిస్తే చేతికిచ్చింది సుశీల. అప్పటినుండి స్నేహం కుదిరింది.

"అమ్మ బాగుందా, బాబు మద్రాసులోనే వున్నడా? " అని అడిగింది గంగ.

"అమ్మ బాగానే వుందికాని ఊరెళ్ళింది. ఆమెకు కొడుకు పిల్లలంటె ఇష్టంగదా, ఏదో బలవంతంగ వుంటుంది. బాబు మొన్ననే వచ్చిపోయిండు. ఈ సంవత్సరం అయితే వాని చదువు అయిపోతది" అంది సుశీల. ఆమె భర్త సెక్షన్ ఆఫీసర్‌గ వుండే. ఆయన పోతే ఈవిడకు జూనియర్ అసిస్టెంట్ ఇచ్చింద్రు. మొత్తం మీద తనపని తాను చేసుకుంటు కొడుకును చదివిచ్చుకుంటుంది. ఆఫీసయ్యాక ఇంటికి బయలుదేరింద్రు.

ఖైరతాబాదులోనె ఆమె ఇల్లు. పెద్ద ఇల్లే. పాలవ్యాపారి మల్లన్న యాదవ్‌ది. మల్లన్న యాదవ్ గురించి చెపుతూ వుంటె వింటు నడుస్తుంది గంగ.

"మా ఇల్లుగలాయన మొదట సైకిల్ మీద పెరుగు కుండ కట్టుకుని బస్తి బస్తి తిరిగి అమ్ముకునేవాడట. ఆ తరువాత ఓ బర్రెను కొని, ఇల్లిల్లు తిరిగి ఇంటిముందే పాలు పిండి అమ్మేవాడట. అట్టా ఒకటికి

## ఇదేం సాయం?



ఓసారి సూర్యాపేటలోని గ్రంథాలయాన్ని ఆ జిల్లా తాలుక్దారు తన పర్యటన సందర్భంగా వెళ్లి చూశాడు. కేవలం ప్రజల సాయంతోనే ఓ తెలుగు భాష గ్రంథాలయం నడవడం అతడికి చాలా ధిక్కారంగా తోచింది. 'దీన్ని స్థాపించేందుకు ప్రభుత్వం అనుమతి పొందారా?' అన్నాడు.

'లేదు' అన్నారు స్థానికులు. దాంతో వెంటనే అతడు 'ప్రభుత్వం అనుమతి పొందే వరకూ దీన్ని మూసి ఉంచండి!' అని ఆదేశించాడు తననెవరూ అడ్డుకోలేరనే ఉద్దేశంతో.

దానికి మాడపాటివారు, 'తాలుక్దారు జిల్లా లోకల్‌ఫండ్ బోర్డు అధ్యక్షుడు. అలాంటి వ్యక్తి ప్రజల గ్రంథాలయాలకు ధనసాయం చేస్తారని విన్నామేకానీ మూసి వేయిస్తారని ఎక్కడా వినలేదు' అని గట్టిగా ఆ అధికారికి చురకలంటించారు. దాంతో గ్రంథాలయం నిరాటంకంగా కొనసాగింది.

రెండు చేస్తూ ఓ పది ఇరువై బర్లతో పెద్ద పాల వ్యాపారిగా మారిపోయిండు. ఇప్పుడు ఇల్లిల్లు తిరగడంలేదు. జనం షెడ్డు దగ్గరికే వొచ్చి కొనుక్కపోతరు. ఉదయం సాయంత్రం బిందెలకొద్ది పాలమ్మి కోటీశ్వరుడు అయిండు. ఆయ నకో బిడ్డ, ఇద్దరు కొడుకులు. అందరి పెండ్లీలు అయినయి. నీవు పత్రికలో చదివే వుంటావు. ఈ ప్రాంతంలో నిలబెట్టే భారీ గణేష్ విగ్రహానికి ఎక్కువ మొత్తం చందా ఇచ్చేది ఈయనే" అంది.

"వ్యాపారమనేది మనిషిని తొందరగా పెంపు చేస్తదక్క" అంది గంగ.

"వ్యాపారాల్లో తొందరగా పైకొచ్చేవి

**కొత్తగాలి...** 

**జిహాద్‌లు.. క్రూసేడ్‌లు**
**ఆపరేషన్లు.. పేరేదైనా**
**పర్యవసానం ఒకటే**
**మారణహోమమే**

– ఎ. సురేష్‌కుమార్,
హైదరాబాద్

రెండే రెండు. ఒకటి కల్లు వ్యాపారం, రెండవది పాల వ్యాపారం. ఈ రెండిం టిలో నీళ్ళ పైసలుంటయన్న విషయం అందర్కి తెలిసిందే" అంది సుశీల.

ఈలోపు ఇంటి దగ్గరికి చేరారు. అది రెండంతస్తుల ఇల్లు, చుట్టూ ప్రహరీగోడ, మధ్య పెద్దగేటు. ఓ పక్కమ్మట ఓ మనిషి పట్టేంత చిన్నగేటు. ఆ ఇంటికి కొంత దూరంలో బర్లకొట్టం. మల్లన్న యాదవ్ భార్య లక్ష్మమ్మ నిజంగా లక్ష్మీదే విలాగే వుంది. బర్ల షెడ్ ముందున్న ఓ సిమెంట్ అరుగుమీద కూర్చొని పాల పైస లను గల్ల పెట్టెలో వేసుకుంటు వుంది. నుదుట ఎర్రని కుంకుమ బొట్టు. తమల పాకు తిని పళ్ళు పెదవులు ఎరుపెక్కి మనిషి కూడ వంటినిండా నగలతో పేరుకు తగినట్టుగా వుంది. ఇద్దరు కొడు కులు, కోడళ్ళు పాలు పిండడంలో నిమ గ్నమై వున్నరు. ఎక్కడికో పోవడానికి బయటికి వస్తున్న మల్లన్న యాదవ్ ఎదురై 'ఈమె?' అన్నట్టు చూసాడు.

"నా స్నేహితురాలు అంకుల్" అంది.

ఆమె వైపు ఓసారి చూసి, "సరె" అన్నట్టు చూస్తూ బయటికి నడిచిండు. అరవైకిపైనే వుంటయి. కణతల దగ్గర తప్ప తల తెల్లబడలేదు. బుర్ర మీసాలు, నుదుట నిలువుగ ఎర్రని కుంకుమ బొట్టు. మెడలో నల్లని దారం, ముంజేతికి ఎర్రని దారాలకుచ్చె. వంటిపై తెల్లని లాల్చి పైజామ. ఆయన వయస్సులో వున్నపుడు కుస్తీలలో పాల్గొనేడట. ఆ గుర్తులు నేటికి కట్టు బొట్టులో కనిపిస్తాయి. ఇప్పటికి ఆ ప్రాంతంలో ఆయనదే దాదాగిరట. అందు కని సుశీల వంటరిగా వుంటున్నా ఎలాంటి అదురు బెదురు లేకుండా వుంటుంది. నల భైలోనే విధవరాలై వంటరి బతుకు బత కాల్సి వొచ్చింది. పైన వున్న తన పోర్షన్ తలుపు తెరిచి, టివి ఆన్ చేసింది. గంగ చూస్తూ కూర్చుంది. సుశీల క్షణాల్లో ఆ పూట వంటపనులు పూర్తి చేసొచ్చింది. ఎనిమిదింటికి తిని, మంచాలు వాల్చుకుని వరిగి, "అక్కా మీకు పుస్తకాలు చదవడ మంటె చాల ఇష్టమున్నట్టుంది" పుస్తకాల అలమారవైపు చూస్తూ అంది.

"ఆయన పోయినప్పటి నుండి వాటి తోటే నా కాలక్షేపం. ప్రతి ఆదివారం కో ఠీకి వెళ్లి పుస్తకాలు కొనుక్కొచ్చుకుంటు వుంట. పుస్తకమే మంచి నేస్తం మరి" అంది సుశీల.

"నేను దొరికిన ప్రతి పుస్తకాన్ని చదువు తూనే వుంట. మీరన్నట్టు పుస్తకం ఓ

మంచి గైడ్"

"ఈ మధ్య కొనుక్కొచ్చిన ఈ పుస్తకాన్ని నీవు చదవాల్సి వుంది" అని ఇచ్చింది.

"ఇది మొదటి మహిళా ఉపాధ్యాయురాలు సావిత్రిబాయి పూలేది" అన్నది.

గంగ దాన్ని అందుకుని సంచిలో పెట్టుకుంది.

"చెప్పు గంగ"

"మీ ఆఫీసులో ఓ ప్రమోషన్ కేసు, ఓ ట్రాన్స్‌ఫర్ కేసు, సంబంధిత మంత్రులకు మా ఎంఎల్ఏ ద్వార చెప్పించిన" అంది.

"మరి నీకేమైనా-" అని ఆగింది.

"ఇస్తరు, లేకపోతె, ఈ రాకపోకలు ఎవరు భరిస్తరు? పోగా కేసును బట్టి కొంత-"

"అదేలే ఇది కూడ నీకు మోతి చూపిన బాట అనుకుంట"

"లేకపోతె నాకేం తెలుసు ఆ అక్క దయే! ఈసారి నా సొంత పనులున్నయనుకో"

"అంటే-"

"నేను ఓ కుటీర పరిశ్రమ గురించి ఖాదీ గ్రామోద్యోగ సంస్థను కలవాలి. కాక పొడి తయారి గురించి, మెషినరి గురించి, లోన్ గురించి ప్రయత్నం. సక్సెస్ అయితే ఏ కష్టాలుండవనుకో"

"అంటే-"

"ఎల్లిపాయలు, కరివేపాకు, మిర్చిని పొడిగా సిద్ధం చేస్తే, దేశవిదేశాల్లో మంచి గిరాకి వుంటదని ఓ విదేశీ మిత్రుడు దాని పేటెంట్‌కు ప్రయత్నం చేస్తున్నడు. త్వరలో రావొచ్చు. అది వచ్చినంక మనం మహిళలచేత యూనిట్స్ తెరిపించి ఉత్పత్తిని మొదలు పెట్టించాలి. హైద్రాబాదులోనే దాని కొనుగోలు డిపో ఉంటుంది. ఆ డిపోను మనకు సలహా ఇచ్చిన విదేశీయే చూసుకుంటడు. మనం మన ఏరియాలలో పొడిని సిద్ధంచేసి వుంచితే డిపో నుండి వ్యానొచ్చి తీసుకెళ్తుంది. తర్వాత పేమెంట్ ఏర్పాటు చేస్తారు"

"ఇదేదో బాగానే వుందే"

"అందుకే ఇంత ప్రయత్నం. ఇది ఫలిస్తే పట్టణ ప్రాంతంలోని మహిళలకు ఎవరి ఇంటి దగ్గర వాళ్లకు పని. ఆర్థికంగా మెరుగుపడి మగవాళ్లమీదే ఆధారపడి వుండకుండా స్వయం ఉపాధి పొందవచ్చు"

"మంచి ఆలోచనే"

"ఈ ఆలోచన నాదికాదు. జాన్‌సన్‌ది" అంటూ కాకపొడి గురించి చెప్పింది. "ఆయనను కలవాలి బంజారాహిల్స్‌లో ఉంటాడు"

మాట్లాడుతు మాట్లాడుతు అర్ధరాత్రి దాటినంక నిద్రలోకి జారుకున్నరు.

మరునాడు జాన్‌సన్‌ను కలిసి, సాయంత్రం ఇల్లు చేరింది.

అప్పటికే సుశీల వచ్చింది.

"హాయ్ అక్క" అంటు గదిలో అడుగు పెట్టింది. "రా" అంటు ఎదురెళ్లింది. ఇద్దరు కూర్చొని ముచ్చట్లలో దిగింద్రు

"కలిసిండా? " అని అడిగింది.

కల్సిండు అన్నట్టు తలాడించింది.

గతం గుర్తొచ్చి సిగ్గుపడిపోయింది. ఆ రోజు చేతిలో చేయి వేసింది. చెంపకు చెంప అనించింది గుర్తొచ్చింది. స్త్రీ పురుష స్పర్శతో శరీరాలు ఉత్తేజ పడతాయన్న విషయం ఎవరూ కాదనలేరు అనుకుంటున్నప్పుడు మొగ్గ రేకులను విప్పుకున్నట్టు నవ్వుతో ఆమె పెదాలు కదిలినయి.

"రేపు ఎటుపోయినా పొద్దుగల రా. రవీంద్రభారతిలో కూచిపూడి నృత్య ప్రదర్శన వుంది. మా ఆఫీసర్ దానికి నిర్వాహకుడు. రెండు పాసులుగూడ ఇచ్చిండు" అంటూ పర్స్‌లో నుండి పాసులను తీసి చూపించింది సుశీల.

సరే అన్నట్టు తలాడించింది.

"ఓ పని చేయి.. నేరుగా అక్కడికే వచ్చెయ్. ఆరింటికి మొదలైతది" అంటూ

పాసులను పర్స్‌లో పెడుతూ వంటగది వైపు నడిచిందామె.

గంగ బాత్‌రూంకు వెళ్లొచ్చి, టీవీ ఆన్‌చేసింది. సుశీల కాఫీ తెచ్చింది.

మరునాడు సాయంత్రం ఆరింటికి గంగ రవీంద్ర భారతికి చేరుకుంది. అప్పటికే సుశీల వరండాలో రవీంద్ర కవీంద్రుని విగ్రహం ముందు నిల్చొని చూస్తుంది.

"హాయ్ అక్కా!"

"హమ్మయ్యా వచ్చినవా. లోపలికి పద మొదలు అవుతూ వుంది"

లోనికి నడిచి సీట్లలో కూర్చున్నరిద్దరూ. కళారాధన నృత్యం మొదలైంది. ఆ తరువాత కూచిపూడి నృత్యంలో ప్రసిద్ధమైన 'భామాకలాపం'. చారెడేసి కళ్లతో నిండైన అంగ సౌష్టవంతో పట్టు వస్త్రాలతో, నగలతో, సత్యభామ అభినయం ఆకట్టుకుంది. హాలంతా కరతాళ ధ్వనులతో మారుమోగింది. రెండు గంటల తరువాత మంగళంతో ప్రదర్శన ముగిసింది.

ఇద్దరు బయటికి నడిచి, ఖైరతాబాద్ వైపు నడుస్తూవున్నారు.

"బాగుంది కదా ప్రోగ్రాం"

"అవును నృత్యం నిండా అంగాంగ శృంగార ప్రదర్శనే! పాటలో ఆటలో శృంగార ప్రదర్శనే! విని, చూసి ఆనందించే ఈ జనం నిజ జీవితంలో దాన్ని ఆదరించరెందుకో" అంది గంగ.

"అదంతే. మన సంస్కృతి అట్లా రూపు దిద్దుకుంది"

"రూపు దిద్దుకుంది కాదు. రూపు దిద్దింద్రు మరీ" అంది గంగ.

"అవును నిజమే కూచిపూడి నృత్యమే చూడరాదా! 'భామాకలాపం' సిద్ధేంద్ర యోగి రచించి ప్రదర్శించి విశేష ప్రాధాన్యతను కలిపించిండు. దానిని శ్రమ, శ్రద్ధలతో వెంపటి, వేదాంతంలాంటివాళ్ళు బహుళ ప్రాచుర్యంలోకి తెచ్చారు. శోభానాయుడు, మంజుభార్గవి, యామినిలాంటి వాళ్లను తీర్చిదిద్ది ప్రపంచ స్థాయిలో ప్రదర్శనలు ఇప్పించి, కూచిపూడి నృత్యం పేరు ప్రఖ్యాతులను ఆర్జించేటట్టు చేసారు. మన రాష్ట్రంలో పుట్టిన ఈ కూచిపూడి నాట్యం ప్రపంచమంతా ఎంతో ఆదరణకు నోచుకుంది" అంది సుశీల.

"ఈ నృత్యరీతులు మీకు బాగానే తెలుసక్క" అంది గంగ.

"నేను ఆరేడు తరగతులప్పుడు నాట్యం నేర్చుకోవడానికి వెళుతుండేదాన్ని. హైద్రాబాదు కొచ్చినంక తరచు ఈ నృత్య ప్రదర్శనలకు వెళుతూ వున్నదాన్ని. మా ఆయనకు కూడ నృత్య ప్రదర్శన అంటే ఇష్టముండేది" అన్నది సుశీల.

"ఇదంత మగవాడు తన ఆనందానికి ఏర్పాటు చేసుకున్నదే. ఆడదాన్ని ఓ ఆట బొమ్మగా మార్చి పబ్బం గడుపుకుంటు వస్తున్నడు. అంతెందుకు? ఈ అందాల పోటీలు నిర్వహించేది కూడా అందుకే. ఆడదాన్ని అంగడిబొమ్మను చేసి అమ్ముకొంటున్నరు" అంది గంగ.

"అంతే" అంది సుశీల ఆవలిస్తూ.

రకరకాల చర్చలతో ఆ రాత్రి గడిచింది. మరునాడు ఆఫీసు టైంకు ఎవరి పనుల మీద వాళ్లు వెళ్ళిపోయి సాయంత్రం ఐదున్నరకు ఇల్లు చేరింద్రు. అలసటను పోగొట్టే ఫిల్టర్ కాఫీతో ముచ్చటలోకి దిగింద్రు.

"ఈ రోజెటు వెళితివి" అడిగింది సుశీల.

"ఎటువెళ్లితే ఏముంది. బస్సుల రాకపోకలను సాగనీయరైరి. ఇంక నయం మీరు కార్యాలయాలకు చేరినంక జనం ఎక్కడి బస్సులను అక్కడే ఆపేసింద్రు. పెంచిన బస్‌చార్జీలను తగ్గించాలని గోల. చేసే నిరసన ఏదో నిమ్మలంగా చేయొచ్చుగ. లేదు బస్సుల అద్దాలు పగలగొట్టుడు, బస్సు తగలబెట్టుడాయె? " అంది గంగ.

"అట్ల చేయటం వల్లా ఆర్‌టిసికే నష్ట మని వాళ్లకూ తెలుసు. అయినా అదంతే" అంది సుశీల నిర్వేదంగా.

"రేపు వెళ్లాలి. బస్సులుంటాయోలేదో?" అంటు లేచి సుశీల చేతిలోని ఖాళీ కప్‌ను గూడ తీసుకుని లోపలికి నడిచింది గంగ.

"ఏయ్ నేను తీసుకెళుతగా"

"ఎవరైతే ఏముంది?" అంటు తిరిగొచ్చి కూర్చుంది. టివి పెడుతున్నప్పుడు స్టాండ్ పక్కన ఓ బ్యాగ్ కనపడగా "ఇవేంటి" అని అడిగింది సుశీల.

"ఏంలేదు చీరెలు. వీటిలో మీకు నచ్చిందొకటి ఉంచుకోండి" అంటూ లేచి బ్యాగ్ లోని చీరెలను తీసి చూపించింది గంగ.

"అంటే?"

"అంటే లేదు, ఏంలేదు. కొంటిని.. అయిపాయే!" నవ్వుతూ అంది గంగ.

అక్కడే వారం రోజులుండి పనులన్నీ చూసుకుని నల్లగొండకు చేరింది గంగ.




**గే**టు చప్పుడైతే చూసింది విమల. గంగ గేటు తీసుకుని లోపలికి నవ్వుతూ వస్తోంది. వరండాలో పేపర్ చదువుతున్న విమల "రండిరండి బాగున్నారా? కూర్చోండి. చాలరోజులకు రాక! ఆ సంచినిండా పుస్తకాలే?" అంది ఆశ్చర్యంగా చూస్తూ.

అవునన్నట్టు తలూపి "హైద్రాబాదు, సాగర్ తిరుగుడే అయితుందక్క" అంటు ఎదుటి కుర్చీలో కూర్చుంది.

"విశేషాలేంటి? ఏమిటా పుస్తకం?"

"ఇది సావిత్రబాయి పూలే జీవిత చరిత్ర. మనమందరం చదవాల్సిన పుస్తకం. ప్రయాణంలో పూర్తిగా చదివేసిన. మీ దగ్గర వుంచండి" అంటు విమల కిస్తూ "మనకోసం మనం ఏదైన చేసుకోవాలి అని ఎప్పటినుండో అంటు వస్తున్నరు. మీరు ఎం.ఎల్.ఏ.గా వున్నప్పుడు కొన్ని ప్రయత్నాలు చేసింద్రు. ఈ మధ్య ఓ ఆలోచన వచ్చింది" అంది గంగ.

"రంగమ్మ మంచినీళ్ళు.. టీ" అని చెప్పి, ఏమిటా ఆలోచన అన్నట్టు గంగవైపు చూసింది విమల.

"ఆ మధ్య అనుకోకుండా ఓ విదేశీయుడు మనింట్లో టిఫిన్ చేయడం జరిగింది. అప్పుడు ఆయనకు కరివేపాకు, ఎల్లిపాయల కారం రుచి చూపిస్తే, చాల బాగుందని తీసుకపోయి పరీక్షలు చేయించిండు. ఈ పొడి ఆరోగ్యానికి చాల మంచిదని, దీనిని పెద్దమొత్తంలో ఉత్పత్తి చేసి, వ్యాపారం చేయొచ్చు, లాభాలు వుంటయి అన్నడు. దానికి పేటెంట్ హక్కులు, మార్కెటింగ్ అవన్నీ తానే చూసుకుంటనన్నడు. అందుకని మనం కుటీర పరిశ్రమగా నెలకొల్పుకొని పొడిని మార్కెట్‌కి పంపితే అన్నీ తానే చూసుకుంటడు"

ఈ లోపల టీ వచ్చింది. చెరో కప్ అందుకుని తాగుతూ కాసేపు మౌనంగా ఆలోచించింద్రు.

"మనం ఏం చెయ్యాలి?"

"మహిళా సంఘాలను పిలిచి ఓ మీటింగ్ పెట్టి విషయం తెలియపరిచి, ఇంట్రెస్ట్ ఉన్నవాళ్లతో, పరిశ్రమల కార్యాలయంలో కుటీర పరిశ్రమలకింద రిజిస్ట్రేషన్ చేపిస్తే వాళ్లే యంత్ర పరికరాలు, లోన్స్ సబ్సిడి వగైరా చూస్తరు. మనం స్వయం

సహాయసంఘాలను ఏర్పాటు చేసుకుని బ్యాంక్ రుణాలతో వ్యాపారం చేసుకోవాలి" అంది గంగ.

"అయితే అదెంత పనీ? చేద్దాం"

"మనం పొడిని సిద్ధం చేస్తే, హైద్రాబాదు నుండి వ్యానొచ్చి తీసుకపోతది. ఆ విషయం అతనే చూసుకుంటడు. మనం చేయాల్సిందల్లా పొడిని తయారుచేయడమే" అంది గంగ.

"అదే పచ్చళ్ల పంపిణీలాగ, వాటికైతే విదేశీ మార్కెట్ పెరిగిపాయే! వ్యాపారంలో రాజైపోయే! సరె, ప్లాన్ బాగానే వుంది. ప్రయత్నం చేద్దాం" అంది విమల.

అనుకున్నట్టు మహిళా సంఘాలను కదిలించి విషయాన్ని వివరించి సాధికారాన్ని సాధించాలని సంపాదన మీద ఆసక్తి పెంచిండ్రు. సంపాదించుకునే వ్యక్తి బానిసలాగ బతకాల్సిన అవసరం లేదు. భర్తల వేధింపు నుండి తప్పించుకోవచ్చు. కష్టించి బతికే వ్యక్తికుండే గౌరవం, వేరే వుంటుంది. పిల్లల పెంపకంలో మార్పు ఉంటుంది. తినే తిండిలో, కట్టె బట్టలో తేడా వస్తుంది. ఈ విషయాలన్నీ మహిళలకు నూరిపోసి పనిమీద ఆసక్తిని పెంచిండ్రు. అప్పుడే డ్వాక్రా మహిళా సంఘాలు వచ్చి మహిళల్లో కొత్త ఉత్తేజాన్నిస్తూ వున్నయి. అప్పుసప్పుల వెసులుబాటు చోటు చేసుకుంది.

ఈ తిరుగుడులో గంగకు సాగర్‌లో ఎక్కువగ గడపడం వీలు కుదరలేదు. ఈలోపు గంగ చిన్నమ్మ ఓ లారీ డ్రైవర్‌తో లేచిపోయింది. పెద్దమ్మకు జబ్బుచేసి వైద్య సౌకర్యం లేక కన్ను మూసింది. విషయం తెలుసుకున్న గంగ వెళ్లి ఖననం చేయించింది. ఆ తరువాత కర్మకాండను జరిపించింది. రాములుకు పూటకు ఎల్లని పరిస్థితి ఏర్పడింది. తాగుడు తగ్గిపోయింది. నరాల బలహీనత వల్లా వణుకుడు వచ్చి కన్ను మూసిండు. ఆ తరువాత కుటుంబ సభ్యులతో కల్సి విషాదంలో పాలుపంచుకుంది. తల్లిని పట్టుకుని తను, తనను పట్టుకుని అక్క జమున ఏడ్చి తమ మనస్సులను తేలిక పర్చుకున్నరు. వస్తే కష్టాలు ఒకేసారి వస్తయి అంటు వుంటరు కదా! అది నిజమైంది. ఈ కష్టకాలాన్ని గట్టెక్కిచ్చే బాధ్యత గంగ మీదేసుకుంది.

తల్లితో మాట్లాడి "అమ్మా! మనం ఈ బతుకునుండి బయటపడాలి. త్వరలో అన్ని ఏర్పాట్లు చేస్తాను. నీవు కాదనొద్దు. అక్క బతుకునన్న కాపాడుకుందాం. హాలియాలో ఓ ఇల్లు చూస్తున్న. అక్కడ ఏదన్న పరిశ్రమను పెట్టుకు బతుకుదాం" అని నచ్చచెప్పింది. అక్కను వొప్పించింది. కొత్త ఊరులో కొత్త చూపు.

★ ★ ★

జనగాం స్టేషన్‌లో బస్సు దిగిన గంగ అక్కడికి కొంత దూరంలో వున్న సాగరి చదువుతున్న బడివైపు నడుస్తూవుంది. తలనిండా సాగరి గురించిన ఆలోచనలే! తల్లితో తగాదాపెట్టుకుని కన్నదే కాని తాను పెంచలేక పోతున్నందుకు బాధపడుతూ వుంది.

బడిముందున్న ఖాళీ స్థలంలో పిల్లలందరు ఆడుకుంటున్నరు. స్కూల్ చుట్టూర చల్లని నీడనిచ్చే చెట్లు. అందరూ ఒకే డ్రెస్సుల్లో పావురాల్లా వున్నరు. ఇందులో ఎవరు సాగరో తెల్వుకోలేక అందరి ఆటమాటల గమనిస్తు కొంతసేపు గేటులోనె నిలుచుంది.

విరామం తరువాత పిల్లలు ఎవరి క్లాసుల్లోకి వాళ్లు వెళుతూవున్నరు. 'వాళ్లల్లో సాగరి ఏది' అనుకుంటు ఫాదర్ గదివైపు నడుస్తుంటే స్టాఫ్‌రూమ్‌లో నుండి టీచర్లు క్లాసులకు వెళుతూ ఎదురయ్యారు. వాళ్లకు నమస్కరిస్తూ ఫాదర్ గదిలోకి నడిచింది గంగ.

"నమస్కారం ఫాదర్" అంది. ఫాదర్ చిరునవ్వుతో చూస్తూ కూర్చోండన్నట్టు కుర్చీని చూపాడు.

గంగ నవ్వు ముఖంతో కూర్చుంది.

"ఆమె రాలేదా? ఆ మధ్య ఇక్కడికి వచ్చిపోయింది" అన్నడు.

"వుత్తరం రాసింది ఫాదర్"

"ఆమెను నేను మతంలోకి రమ్మంటె రాజకీయాల్లోకి వెళ్లిందట" అన్నడు పెన్నును పెదాలకు తాకిస్తూ.

"ఆమె ఎక్కడున్నది నాకూ తెలియదు"

"మీరిద్దరు జంట పక్షులు కదా? "

"ఉంటిమి, ఆ తరువాత కల్సుకోక, కన పడక చాల కాలమైంది"

"మీ అమ్మాయిని చూసారా? మొన్న ఆమెకు డబుల్ ప్రమోషనిచ్చి ఏడోతరగ తిలో వేసినం" అంటు కాలింగ్‌బెల్ నొక్కి సహాయకురాలు రాగానే "ఏడో తరగతి అమ్మాయి సాగరిని తీసుకురా" అన్నడు.

తీసుకొచ్చింది.

"ఈమె ఎవరు? " అడిగిండు సాగరిని.

పోల్చుకోలేకపోయింది సాగరి. గంగకు దుఃఖం ఆగలేదు. అది చూసిన ఫాదర్ "నోనో" అంటు చూపుడు వేలును అటు ఇటు కదిలించిండు. అప్పుడు గంగ తమా యించుకుంటు సాగరికంట పడకుండ చేతి రుమాలుతో కళ్లొత్తుకుంది.

"సాగరీ.. ఈమే నిన్ను ఈ స్కూల్లో జాయిన్ చేసింది"

సాగరి గంగవైపు మళ్ళుతు చేతులు జోడించింది.

అది చూసిన గంగ కళ్లు కాలువలైనయి. ఫాదర్ మళ్లీ చూపుడు వేలును చూపిం చిండు. గంగ నిగ్రహించుకుంటు "ఎలా వున్నవమ్మ? బాగా చదువుకుంటున్నవా? " అడిగింది పిల్లను దగ్గరికి తీసుకుంటూ.

తలాడించింది సాగరి.

"చాలా తెలివైనది. ఆమెపై ప్రభువు

దయవుంది. ఇకముందు కూడ వుంటుంది. ప్రెయిజ్ ది లార్డ్" అని "ఇక క్లాసుకు వెళ్ళు" అన్నాడు పాపను.

గంగ సాగరిని ముద్దాడింది. సాగరి ఇద్దరికీ నమస్కరించి కదిలింది.

"చెప్పండి గంగగారు, నేను వారిస్తూనే వున్న మీరు రోదిస్తే ఎట్లా? మీరు చాల కాలానికొచ్చింద్రు కదా. అందుకే గుర్తించ లేదు. మోతి అయితే కౌగిలించుకునేదే"

"మొదట్లో ఆరు నెలలకు సంవత్సరానికి వస్తుంటె, మీరే రావద్దు. ఊర్కే వస్తుంటే పిల్లల మనస్సు తల్లితండ్రుల మీదికి, ఇంటి మీదికి మళ్లి చదవరన్నరు. అందుకే మన స్సును అణుచుకుంటున్న. అందుకని రాలేదు. లేకపోతే రావడానికేం? " అన్నది.

"వస్తే పాప ఇంటివైపు మనస్సు పెడత దని అంతే" అన్నడు.

మోతి గుర్తొచ్చి "ఆమె ప్రభువును నమ్మికోలేదు. నీవన్నా నమ్ముకుంటే ఇక దుఃఖాలు వుండవు. ప్రభువు దయామ యుడు, అందర్ని చల్లగా చూస్తడు"

గంగ మాట్లాడలేదు. 'మా మతంలో పుట్టినందుకే ఈ బానిస బతుకులు ఈ మతంలోకి మారితె మంచిగ చూస్తరా? అప్పుడు ఫలానా కులపు క్రైస్తవురాలు అంటరో' అనుకుంటున్నది.

"వెంటనే చెప్పక్కరలేదు. ఆలోచించు కోండి.. మీ బాధలన్నీ తొలగిపోతయి" అంటూ లేచి నిలుచున్నడు ఫాదర్.

గంగ నిలుచుంది.

"నేను రౌండ్స్ వెళ్లాలి. ఈసారొస్తె ఆది వారం రండి తీరిగ్గా మాట్లాడుకుందాం" అంటూ బయటికి నడిచిండు. గంగ చేతులు జోడిస్తూ గేటువైపు నడిచింది. నడుస్తూ నడుస్తూ సాగరి కనిపిస్తదేమో అని మళ్లీ మళ్లీ చూసింది. కాని క్లాసు రూంలో వున్న సాగరి ఎట్లా కనిపిస్తది?

గేటువేపు నడుస్తూ వుంటే బాట కిరువై పుల వున్న చెట్లమీద నుండి ఓ కోతి దూకి అడ్డంగా పరుగెత్తుకెళ్లింది. దాని కడుపును గట్టిగా పట్టుకుంది దాని పిల్ల. ఆ దృశ్యం గంగను కదిలించగ నిట్టూర్చింది.

గేటు దాటి రోడ్డెక్కి బస్‌స్టేషన్ వైపు మళ్లింది. పలుచోట్లకు వెళ్ళే బస్సులు, అవి బయలుదేరవల్సిన బోర్డుల ముందు నిలు చున్నయి. గంగవెళ్లి భువనగిరికి వెళ్లే బస్సెక్కి కూర్చుంది. అప్పుడే ఓ అంధుడు చేతిలోని చిరుతల మోతతో పాట పాడుతూ సీటు సీటు దగ్గర్కి వస్తూవు న్నడు. ఆయనకు ఆసరగా ఓ ఏడేండ్ల అమ్మాయి ముందు నడుస్తూ చేయి చాపుతూ పైసలు ఇచ్చినవార్కి ఇవ్వనివార్కి మొక్కుతునే వుంది. బస్సు కదిలింది.

ఆలోచిస్తు నిద్రలోకి జారుకుంది గంగ.

గుట్టకు మళ్ళే మలుపు రాగానే డ్రైవర్ బ్రేక్ వేసిండు. బస్సు ఆగగానే ఐదుగురు ఆడవాళ్లు, మొదట ముప్పదేండ్ల స్త్రీ ఎక్కింది. కట్టుబొట్టు కుటుంబస్త్రీలా ఉంది. ఆమె వెనక మరో పాతికేళ్ల యువతి సోకు చేసుకుంది, ఆకేసుకుని వుంది. మరొకామె ఆఫీసు ఉద్యోగినిలా ఉంది. ఇంకో యువతి పంజాబీ డ్రెస్‌లో వుంది. చివరన ఓ చిన్నది లంగా ఓణీ రెండు జడలేసుకుని కళ్లకు కాటుక నుదుట మెరుపుబొట్టు పెట్టుకుంది. ఆ ఐదుగురి వెనక ఓ పోలీసు చేతిలో లాఠితో ఎక్కగానె బస్సు కదిలింది.

వాళ్లెవరో చూడగానె అర్థమైంది. వాళ్లను కళ్లతోనే పలకరిస్తూ ఆదరణగా చూసింది. వాళ్లొచ్చి గంగ ముందు వెనక ఖాలీ సీటుల్లో కూర్చున్నరు. వాళ్లతోపాటు జర్దా వాసన, నాసిరకం పౌడర్ వాసన గుప్పు మని వొచ్చింది. కొత్తగా వచ్చిన ఎస్సై ఎట్లా రైడ్ చేయించింది, విటులు ఎట్లా తప్పిచ్చుకున్నది, పోలీసు చెపుతువుంటె కండక్టర్ రెప్ప కొట్టకుండా వాళ్లవైపె

చూస్తున్నడు.

ఇంతలో ఢాం అని పెద్ద చప్పుడై బస్సు పక్కకు పోయింది. డ్రైవర్ సడన్‌బ్రేక్ వేసి బస్సు పక్కకు ఆపిండు. ప్రయాణికులంత ఒక్కసారె ఉలిక్కిపడి తేరుకున్నరు. డ్రైవర్ కండక్టర్ దిగి పేలిపోయిన టైర్‌ను చూసి చక్రాన్ని మార్చే ప్రయత్నం చేస్తున్నరు. ప్రయాణికులు ఒక్కొక్కరే దిగి పక్కకు చేరుకున్నరు. అంతకుముందు ఎక్కిన స్త్రీలు పక్కన్నే వున్న చెట్టు కిందికి చేరి ముచ్చట్లలోకి దిగారు. వాళ్లకు కొంచం దూరంలో పోలీసులు.. పొగ పీల్చుతు నిలుచున్నరు.

తప్పిచ్చుకోవాలన్న తమ ప్రయత్నాలు ఎట్లా ఫలించలేదో చెప్పుకుంటు, కోర్టు గురించి, కోర్టులో అడగబోయె ప్రశ్నల గురించి, కట్టబోయే ఫైన్ గురించి మాట్లాడుకుంటున్నరు ఆ అమ్మాయిలు.

గంగ వాళ్ల గురించే ఆలోచిస్తుంది. ఈ స్థితి ఎన్నడు మారుతదో, పొట్టకోసం బట్టలు ఇప్పడం నేరం! మధ్యన పోలీసుల దౌర్జన్యం, కంపినమ్మల దోపిడి, అంగట్లో అమ్మకాలు, కంపెనీల కథనాలు, ఎన్ని ఘోరాలు కలపోతగ తలుసుకుంటు నిట్టూర్చుతు చెంపమీద పట్టి వేసుకున్నామె "బాగ తాగివున్నడు. ముఖాన్ని చేతుల్లోకి తీసుకుని కసిగా కొరుకుతుంటే ఏంచేస్తం అక్క" అంది లంగావోణి అమ్మాయి.

"హుక్స్ ఊడేవరకు ఊర్కోడాయె" అంది మొదట ఎక్కిన స్త్రీ ఊడిపోయిన తన జాకెట్ చూసుకుంటు.

ఆ రాత్రి వాళ్లకు జరిగిన సంఘటనలు ఒకరికొకరు చెప్పుకుంటు ఓదార్చుకుంటు వుంటె వాళ్ల బాధలు వింటూ మధ్య మధ్య, బాధగ నిట్టూర్చుతు వున్న గంగను చూస్తున్న పోలీసు ఇదీ కేసె వున్నట్టుంది అన్నట్టు చూసిండు, అప్పుడె వచ్చి నిలుచున్న కండక్టర్ వైపు.

కానట్టుంది అన్నట్టు చూసిండతను.

## న్యాయవాద వృత్తి అంటే..?

అప్పట్లో తన సహచర న్యాయవాదులపై మాడపాటివారు సున్నితమైన వ్యంగ్యంతో చలోక్తులు విసిరేవారు. ఓసారి ఆయన తన మిత్రులపై, 'కొండా వెంకటరంగారెడ్డిగారు ఈ వృత్తిని విజయవంతంగా కొనసాగించి రాణించారు. నేనేమో అతికష్టంగా షష్టి పూర్తివరకు సంసారపక్షంగా లాగాను. మందుముల నరసింగరావేమో ఏడెనిమిదేళ్లు ఇందులో ఉండికూడా అది తన మనఃప్రవృత్తికి గిట్టక వదిలేశారు. ప్రతాపరెడ్డి రెండేళ్ల అనుభవంతోనే తప్పుకున్నారు. ఇక మా అందరికన్నా రామానుజరావుదే గొప్ప ముందడుగు. ఎందుకంటే లా పట్టా తీసుకుని, వృత్తికి కావాల్సిన అన్నీ కలిగివుండి కూడా అసలు కోర్టులోకే అడుగుపెట్టలేదు' అని హాస్య బాణాలు సంధించారు.



"అయ్యా మీది పోలీసు కన్ను" అన్నడు.

"అన్నీ ఆడదాని వయస్సు వంటిమీదనే కదా? ఆకర్షణ అది ఇది" అన్నడు పోలీసు.

జానకీదేవిగారు చెప్పిన విషయాలు గంగకు గుర్తొచ్చినయి. నాటి గుళ్లు, దేవదాసీలు గుర్తొచ్చింద్రు. నాడైనా నేడైనా, ఇష్టమున్నా లేకపోయినా ఆడదాని బతుకు ఇంతేకదా? కాకపోతే ఉన్నవాడికి ఉంపుడు గత్తె. అదీ తప్పైనా కాస్త గుడ్డిలో మెల్ల లాంటిదేమో! ఆ రోజుల్లో ఆస్తయినా దక్కేది, భద్రత ఉండేది. ఇప్పుడున్న ఈ విధానంలో మార్పు రావాలి! మీరు చేస్తున్నది సరియైన పని కాదని చెప్పాలనిపించింది. కాని వాళ్లు వింటారా? పని చేసుకునే పద్ధతుల్లోకి తేవాలి. వాళ్లు వొళ్ళు అమ్ముకునే స్థితి నుండి వస్తువులు అమ్ము

కునే మార్గంలోకి మళ్లించాలి! ముందు అక్షరజ్ఞానం వస్తే అన్ని వాటంతట అవే మారిపోతయి. అది జరగడానికి ఇంకా సమయం కావాలి' అనుకుంటు సర్దుకుని కూర్చుంది.

బస్ స్టేషన్‌లో ఆగింది. అందరు దిగుతున్నరు. వీళ్ళూ దిగిపోతుంటె జనంలోని ఆడవాళ్లు అదోమాదిరి అసహ్యంగా, మొగాళ్లు అదో మాదిరి ఆశగా చూస్తున్నరు. వాళ్లుదిగి కోర్టువైపు, తాను దిగి ఎక్కవల్సిన బస్సువైపు నడుస్తూ అక్కడున్న మొగాళ్ల చూపు తనవైపు మళ్లడం చూసి భుజం చుట్టు కొంగు కప్పుకుంటు 'ఆడది ఒంటరిగా కనిపిస్తే చాలు, మెలికలు తిరిగి పోతనేవుంటరు. మీసం మొలిచే పోరని నుండి, తలనెరిసిన ముసలయ్య వరకు ఒకే తీరు చూపు' అనుకుంటు నడిచింది.

★ ★ ★

సాగర్ చేరి ఇంట్లో అడుగు పెట్టేవరకు సాయంత్రమైంది. దుర్గ సందాకిలి ఊడిచి ఆ రోజు పేపర్ చూసుకుంటు వరండాలో కూర్చుంది. లోపలికి వస్తున్న గంగకు ఎదురెళ్లి సంచందుకుని లోపల వుంచి టవల్ తో వచ్చి బాత్‌రూమ్ నుండి బయటికొస్తున్న గంగకిచ్చింది.

తర్వాత దుర్గ ఇచ్చిన ఉత్తరాలు చూస్తు దీని మీదిరాత మోతక్కదున్నట్టుంది అంటు కవరిప్పింది గంగ. మోతి నుండి వచ్చిన ఉత్తరమే. మౌనంగా చదువుకుని మళ్లీ కవర్‌లో వుంచింది. 'ఢిల్లీ చేరినవా? ఇన్ని రోజులకు ఉత్తరం రాస్తవా?' అనుకుంది. ఈలోపు వచ్చిన దుర్గ "ఎక్కడుందట, ఏం చేస్తుందట?" అని అడిగింది. "చెపుత" అంటు దాటేసింది గంగ.

కవ్‌ను ఖాళీచేసి, రెండో కవర్‌ను ఇప్పింది. అది ప్రభుత్వం నుండి వచ్చింది. దానిని పూర్తిగా చదివి "దుర్గ మన ప్రయత్నం ఫలించింది. ప్రభుత్వం సంచారకులాలోళ్లకు పునరావాసం కల్పిస్తామని, ఇళ్లు కట్టిస్తమని, కుటీర పరిశ్రమలు పెట్టుకుంటే తగు ఆర్థిక సహాయం అందిస్తామని జి.ఓ. తీసారు" అని మురిసిపోతున్న గంగ కళ్లు తడిగ మారాయి.

ఆ రాత్రి రకరకాల ఆలోచనలతో ఆలస్యంగా నిద్రపోయింది. ఉదయం తన అమ్మవాళ్ళింటికి వెళ్లింది.

కాలం పరుగెడుతునే వుంది. ఉగాది పోయి మరో ఉగాది రానే వచ్చింది. ప్రభుత్వం సంచారకులాలను బడుగు వర్గాలుగ గుర్తించింది కనుక ఇళ్లు కట్టించడం, కుటీర పరిశ్రమల స్థాపనకు ఆర్థిక సహాయం అందిస్తూవుంది. ఒక్క కాకపొడి పరిశ్రమె కాక ఎవరికి తోచిన పరిశ్రమ వాళ్లు పెట్టుకుంటున్నారు. కొవ్వొత్తుల తయారి, అగ్గిపుల్లల తయారిలాంటివి చేపడుతున్నరు. ప్రతి మనిషి పని చేసి బతకాలన్న నిర్ణయానికి వస్తున్నరు.

వీళ్లను చైతన్య పరచడంతో జిల్లావ్యాప్తంగా విమలక్క పాత్ర ప్రముఖమైంది. కార్యాలయాల్లో, బ్యాంకుల్లో ఆమె చొరవతోనే పనులు చకచక అవుతూవున్నాయి. అన్నట్టుగానె తల్లిని, అక్కను హాలియాలో ఉంచి, కాకపొడి తయారీ పెట్టించింది గంగ. రోజు తప్పించి రోజు హైద్రాబాదు నుండి వచ్చె వ్యాను కాకపొడిని తీసుకెళ్ళి తిరిగి వొచ్చెటప్పుడు డబ్బు తెచ్చి ఇచ్చిపోతుంది. ఉత్పత్తి, పంపిణి అన్ని చకచకా జరిగిపోతునేవున్నాయి. చాలామందికి తిండి బట్టల్లో మార్పు చోటుచేసుకుంటుంది. ఉత్సాహం కలగొల్పుతనం పెరుగుతూవుంది. ఇంతకు ముందున్న ఈసడింపులు మెల్లమెల్లగా తొలగిపోతూవున్నయి. నీరు కట్టిన పాలకూర ఆకులా నిగనిగలాడినట్టు సంపాదన అందగానే బడుగు బతుకుల ముఖాలలో కళాకాం



తులు కనిపిస్తున్నాయి. రోజులు మంచి గానే గడుస్తూవున్నాయి.

★ ★ ★

మధ్యాహ్నం చెట్టు కింద కూర్చోని తాను చదువుతున్న 'ఏడు తరాలు' నవల పూర్తి కాగానే దానిని మూస్తూ పరిపరి విధాల ఆలోచనల్లోకి వెళ్లింది గంగ. ఆ రోజుల్లో వాళ్ల బానిస బతుకులకు పోలికలున్న ఈ దేశపు స్త్రీల బతుకులు కళ్ళముందు కదిలి నయి. విమలక్కతో కలిసి కొన్ని గ్రామాలను తిరిగినపుడు, ఆ గ్రామాలలోని స్త్రీలను చూస్తుంటె 'అవో బతుకులేనా?' అనిపించింది. 'వంటినిండా బట్టలు లేని అర్ధనగ్న శరీరాలు. పనిచేస్తున్నప్పటి దుమ్ము ధూళి, ఎండ వానకు కాయి రంగుగా మారిన శరీరపు రంగు, నూనె

సరిగ్గ అంటుకోని గడ్డిపోచల్లాంటి జుట్టు, కాట్లతో, మర్రలతో కాల్చిన గుర్తులతో అదో మాదిరి రూపాలు! చేసిన కష్టం ఎటుపో తుందో కూడా తెలియని తెలుసుకోలేని బతుకులు. చాకిరితప్పా దోపిడిని ప్రశ్నించ లేని అమాయకత్వం. పొద్దున లేస్తే తప్పని ఇంటి చాకిరి, పిల్లల్ని కనడం, పెంచి పెద్ద చేయడం, తప్పించుకోలేని పొలం పనులు, ఇంటి చాకిరీ, లైంగిక దోపిడితో శారీరకంగా, మానసికంగా నలిగి పోతూ హత్యలకు ఆత్మహత్యలకు గురయ్యే పరిస్థితులు. వాటన్నిటికీ కారణం అధైర్యం, అక్షర జ్ఞానం లేని అజ్ఞానమే.

అందుకని మొదట వాళ్లకు సావిత్రి బాయి పూలె అన్నట్టు అక్షర జ్ఞానం కలి పించాలి. ఆ మధ్య మొదలైన చదువు వెలుగు కార్యక్రమం ఆగిపోయిందికాని? చదువంటె తనకు తాను నిలదొక్కుకోవడా నికే కాకుండ, పిల్లలను తీర్చి దిద్దడంలోను ఉపకరిస్తుంది కదా? అందుకు ప్రయత్నం ప్రతి స్త్రీ చేయవల్సివుంది' అనుకుంది.

సాయంత్రం నాలుగయింది. దుర్గ వస్తునే "అమ్మ నేను మరిచిపోయిన నిన్న పొద్దున మనింటికి పోలీసు జమెదారు వచ్చి మట్టికట్ట దగ్గర్కి రెండు శవాలు కొట్టుకొచ్చినయి. ఖననం చేయించాలి, గంగగారున్నారా అని అడిగిండు. ఊరికి వెళ్లారని చెప్పిన. మధ్యాన్నమేమో మహిళా సంఘపోళ్లొచ్చి గుడిదగ్గర కులాంతర వివా హాలున్నయి.. మేడం లేదా అని అడిగిపో యిండ్రు" అని చెప్పి లోపలికి నడిచింది.

"దుర్గ నీవు ఓ ఇల్లు కిరాయికి తీసుకుని ఓ గిర్ని పెట్టుకో, ఒకామెను పెట్టుకుంటే ఆమె దానిని చూస్తుంటది. మనం ఆ మూడో క్వార్టర్‌లో మహిళా సంక్షేమ సంఘాన్ని పెట్టాలనుకున్నం కదా.. రేపు టెలిఫోన్‌కు అప్లయిచేస్తే మరునాడే కన క్షన్ ఇస్తామన్నరు. ఇక ఓ బోర్డ్ రాయిం చాలి. మేనేజర్‌తో మాట్లాడినాను. లోన్ ఇస్తానన్నడు. ఎందుకైనా మంచిది నీవు ఎనిమిది తరగతి అంటివిగదా ఈసారి పదో తరగతి పరీక్షకు ఫీజు కట్టు. ఆ తరు వాత ఇంటర్. విషయ అవగాహనకు చదువు ఆసరా" అంది గంగ.

సరేనమ్మ అన్నట్టు తలాడించింది దుర్గ.

"పట్టుదల వుండాలిగాని చదువు ఓ సమస్య కాదు. ఏ పనైనా మొదట కష్టం అనిపిస్తది మొదలు పెడితె అదే మోకరిల్లు తది సుమా" అంది గంగ.

మూడో క్వార్టర్ ముఖాన 'మహిళ సంక్షేమ సంఘం' బోర్డు వెలిసింది. ఆనాడు జిల్లా నుండి విమలక్క, ఇతర సభ్యులు, సాగర్‌లో వుంటున్న స్థానికులు వచ్చిండ్రు.

కార్యాలయం ముందు వేసిన షామి యాన కింద తమ అభివృద్ధికి చేపట్టదలి చిన విషయాలను, విధానాలను చర్చించు కుని, గంగ ఏర్పాటు చేసిన మధ్యాహ్న భోజనాలను ముగించుకుని ఎవరి ఊర్లకు వాళ్లు బయలుదేరిండ్రు. విమలక్క ఆరోజు అక్కడే వుండగ రాత్రంతా వివిధ విష యాల మీద మాట్లాడుకున్నారు. ఆ మధ్య గంగ ఇచ్చిన సావిత్రిబాయి పూలె పుస్తకం గుర్తుచేసి 'ఈ పుస్తకం పది పదిహేను ఏళ్ల ముందు చదివితె ఎంత బాగుండేదో' అని విచారించిందామె.

"నాకూ ఆలస్యంగానే దొరికింది కదా? " అంది గంగ.

"ఇందిరాగాంధి కాలంలో నాకవకాశం దొర్కింది. అది ఇది అనే లోపే ఐదేళ్లు గడిచిపాయే. అనుకున్నది సాధించలేకపో యిన. ఓ రెండు టర్ములన్నా వుంటె ఎంతో కొంత మనోళ్లకు ఏదన్నా చేయొచ్చు"

"అదీ నిజమే అక్క! అటు మీరు బాగు పడలేదు ఇటు ఇతరులను అనుకున్నంత

చేయలేక పోయింద్రు" అంది గంగ.

రాత్రి బాగా పొద్దుపోయింది. పక్కన అడవిలో నక్కలు ఊళ పెడుతున్న శబ్దాలు. నిద్రలోకి జారుకున్నరు. పొద్దున్నే లేచి గంగ కలెక్ట్ చేసిన పుస్తకాలవైపు చూస్తూ "నీకు నచ్చితే కనిపించిన పుస్తకాన్నల్లా కొనేటట్టుంది. బీరువానిండా అవే" అంటు ముక్కున వేలేసుకుంది విమల.




పత్రికను చూస్తు కూర్చున్న గంగకు కాఫీ ఇస్తు, పత్రికలోకి తొంగిచూసింది దుర్గ. 'కనగల్ రోడ్డు మలుపులో ఎన్‌కౌంటర్: ఓ మావోయిస్టు మృతి. ఆయన భార్య పరారు. ఆమె ఆచూకితోపాటు ఆమెకు సహకరించిన మరో స్త్రీ కోసం ఆరాతీస్తున్న పోలీసులు' పెద్ద అక్షరాలతో వున్న శీర్షికను చూసిన దుర్గ కాళ్లలో వణుకు.. కళ్లలో మసక కమ్మింది.

"అంతా చదవండమ్మ" అంటు పక్కన్నె కూలబడింది దుర్గ.

వార్తను పూర్తిగ చదివింది గంగ.

'నిన్న సాయంత్రం నల్లగొండ నుండి సాగర్ వస్తున్న బస్సు కనగల్ రోడ్డు మలుపు దగ్గరకు రాగానే ఓ గర్భవతి బస్సెక్కింది. బస్సు పద్నాలుగో మైలు రాయి దగ్గరకు రాగానె తుపాకుల శబ్దం! అది విన్న ఆమె ఒక్కసారె సొమ్మసిల్లి పోయింది.

నిడమానూర్ చేరే వరకు ఆమెకు నొప్పులు ఎక్కువకాగ అక్కడి ప్రయివేట్ నర్సింగ్ హోంలో చేర్పించగా ఆమె అక్కడే ప్రసవించింది. బస్సులో ప్రయాణిస్తున్న ఓ ప్రయాణికురాలు సహకరించి ఆ తరువాత ఆమె అక్కడి నుండి వెళ్లిపోయింది. తెల్లవారు జామున ఆ బాలింతరాలు మంచం మీద కొంత డబ్బుంచి పాపతో ఎటో ఎల్లి పోయింది. ఆమె ఓ మావోయిస్టు భార్యే! కాకుంటే స్వయంగా నక్సలైటేనట. ఇద్దరు రాచకొండ పట్టెకు చెందిన దళం వారట!' అని ముగించగానే-

"ఆమెకు సహకరించిన స్త్రీ కోసం ఆరా అని వుంది కదమ్మా? " అడిగింది దుర్గ.

అవును అన్నట్టు తలాడించింది గంగ.

"ఆపతి పడుతుంటే సాటిస్త్రీగా సహకరించడం తప్పా" అని అడుగుతున్నప్పుడు దుర్గ గొంతులో భయం..

"తప్పేం కాదు కాని- "

"మరి ఆమె కోసం ఎందుకు పోలీసుల ఆరా? " అని అడిగింది దుర్గ.

"ఏముంటది, ఆమెను కూడ పట్టుకుంటె ఏమన్న క్లూ దొరుకుద్దేమోనని కావొచ్చు"

"అయితె ఆమెనూ అరెస్టు చేసే తీరుతరామ్మా? " ఆత్రంగా అడిగింది దుర్గ.

గంగ చూపులు మిగతా వార్తల వెంట పరుగెడుతున్నయి.

"అయితె పుణ్యానికి పోతే పాపం చుట్టుకున్నట్టా? " బరువైన శ్వాస పీల్చింది దుర్గ.

"అయితె రెండుమూడు రోజులు బయటికి ఎల్లనమ్మ" మళ్లీ తానే అంది దుర్గ.

గంగ ఆ మాటలు విన్నట్టు లేదు. ఆమె చూపు, మనస్సు 'అమ్మాయిలను అమ్ముతున్న ముఠాను పట్టుకున్న పోలీసులు' మీద పడగా ఆ వార్తనే చదువుతుంది.

దుర్గకు మనస్సు మనస్సులో లేదు. పోలీసులు వచ్చినట్టు, తనను పట్టుకు

న్నట్టు కళ్లల్లో కదిలి కళ్లు తిరిగినట్టై కింద కూలబడింది.

గంగ గాబరాగా 'ఏయ్ దుర్గ.. ఏమైంది? " అంటు రెండు చేతులతో ఆమెను లేపి గోడకు కూర్చోపెట్టింది. నీళ్ల మగ్గును నోటికందించి "ఏమైంది దుర్గ" అంటు అటూ ఇటూ కదిలించింది. తర్వాత వంటింట్లోకి వెళ్లి కాఫీ తెచ్చిచ్చింది.

తేరుకున్న దుర్గ "తప్పకుండ పోలీసులు పట్టుకుని తీరుతారా? " అని అడిగింది.

"పట్టుకుంటారో, పట్టుకోరో మనకెందుకు చెప్పు" కొంచం విసుగ్గా అంది.

"ఆ సహకరించిన ప్రయాణికురాల్ని నేనమ్మ" దుర్గ అనగానే గంగకు మాట పెగల్లేదు.

"నిన్న నేను నల్లగొండ నుండి వొస్తున్న బస్సులోకె ఆమె ఎక్కింది. నా పక్కన్నె ఖాళీగా వుంటె కూర్చుంది. బస్సు కుదుపులను భరించలేక పోతూ వుంది. అది గమనించిన డ్రైవర్ నిడమనూర్ నర్సింగ్ హోం ముందు ఆపిండు. ఆమెను దింపి, లోపలికి తీసుకెళ్లి నేను తిరిగొస్తుంటే, ఆమె నా రెక్క పట్టుకొని ఆపి, 'కొంచంసేపు ఉండిపో అక్క' అంది. ఆమె చంకకున్న సంచిలో ఓ చీరె, రవికె, ఇంకొన్ని గుడ్డలున్నయి. అట్నే అని వుండిపోయిన. అది ఇది అనే లోపలే పండంటి కొడుకును కన్నది. బాబును కడిగి పక్కలో వేసిందాక వుండి, నేను వచ్చేసిన"

ఇప్పుడెట్లా అన్నట్టు చూసింది దుర్గ.

"ఎట్ల లేదు.. ఏం లేదు. నీ పని చేసుకోపో. నీవు కావాలని ఆమె దగ్గర్కి పోయినవా ఏంది? బస్సులో కల్సింది, ఆపదలో వున్న ఆ స్త్రీకి మరొక స్త్రీ ఆసరా కాకపోతె ఇంకెవరవుతరు? " అంది గంగ.

"అమ్మా మీకు తెల్సిన పోలీసు సామి ఉండెకదా? "

"ఆయనిప్పుడు లేడు ట్రాన్స్‌ఫరైపోయిండు" మౌనంగా ఉండిపోయింది గంగ.

ఆ రోజు అట్లా గడిసింది.

మరునాడు కూరగాయలకు పోయిన దుర్గ "అమ్మ ఈరోజు బజారు బందు" తాను చూసొచ్చింది చెప్పింది.

"పేపరులో వొచ్చింది గదా మావోయిస్టు బందని"

ఫోను మోగింది.

"ఫోనెత్తు దుర్గ" అంది గంగ చదివె పుస్తకాన్ని పక్కకు పెడుతూ.

"అమ్మ నేనెత్తనమ్మ ఆ ఫోను పోలీసోల్లదో ఏమో"

గంగే ఫోనెత్తింది "హల్లో" అవతలి కంఠం, బాగ పరిచయమున్నదే. గంగ ముఖం విప్పారింది. దుర్గ వంటింట్లోకి నడిచింది.

"ఆ చెప్పక్క"

"ఎట్లున్నవ్, ఏం చేస్తున్నవు గంగ"

"తోచింది, చేతనైంది చేస్తు తిరుగుతున్న అక్క. మీ క్షేమ సమాచారం తెలవకనే చాల రోజులాయె! ఉత్తరం రాయవైతివి"

"మాట్లాడుదాం అనె రాయలేదు. నేను ఇక్కడ బాగానే వున్న. ఢిల్లీ అంటె మామూలు నగరం కాదుకదా? నేను ఇక్కడికొచ్చింది మనవాళ్లకు తెలియదు. అందరు మతంలో మారి, వాళ్లెమ్మటె పోయింది అనుకుంటున్నరు. అట్టనే అనుకోని.. లేకపోతే కట్టు కథలు అల్లుతరు. నేను ప్రస్తుతం వుంటున్నది అప్పుడు మన క్యాంపులో ఓ పెద్దాయన వుండే చూడు, నీకు వందరూపాయలిచ్చినాయన ఇంట్లో వుంటున్న. ఆయన ఇప్పుడు భారతీయ గిరిజన సమాఖ్య చైర్మన్. ఓ పెద్ద ఆఫీసు, ఉద్యోగులు, దేశం నలుమూలలు తిరగాలి, గిరిజనుల బాగోగులు తెలుసుకుని వాళ్ల సంక్షేమానికి పని చేయాలి. ఆయనకు నేను ప్రత్యేక కార్యదర్శిని. ఆయన ఇంట్లోనే వుండాలి, ఆయన వెంటే వుండాలి. బాగానే




నడుస్తుంది. చూస్తు చూస్తు మూడేళ్లు గడిసే! నిన్ను ఓసారి ఇక్కడికి పిలిపించు కుంట. ప్రభుత్వం నుండి నీవు నడిపే మహిళా సంక్షేమ కార్యక్రమాలకు నిధులు ఇప్పిస్త."

"సరె అక్క మీరు ఎక్కడున్నా క్షేమంగా వుంటే చాలు."

"పెద్దాయన చాల మంచోడు. ఆయన బంగళా, కార్లు అన్ని వాడు కొమ్మంటడు. ఆఫీసు కొచ్చె క్షేత్రస్థాయి గిరిజన స్త్రీలతో మాట్లాడి, వాళ్లు ఇచ్చె కాగితాలను తీసు కుని ఇతర శాఖలకు పంపాలి ఆ పని చూసుకునే ప్రభుత్వ కార్యదర్శులుంటారు. వాళ్లమీద ఓ చూపుంచాలంతె. ఏదేని అవ కతవకలు జరిగితే పెద్దాయన దృష్టికి తేవాలి. అంతే నా పని. ఇప్పటికి వుంట" ఫోన్ పెట్టేసిన శబ్దం.

గంగ ఉబ్బి తబ్బిబ్బైంది. తనకు ఢిల్లీ లె వెల్లో ఓ అండ దొర్కిందని మురిసిపో యింది. అప్పుడే దుర్గ వచ్చి "ఎవరమ్మ ఇంతసేపు మాట్లాడింది. పోలీసోల్లేనా? "

"మోతక్క ఫోను! ఢిల్లీలో మంచి పద విలో వుందట"

"మనకేమన్న సహాయం చేస్తదటనా? " అడిగింది దుర్గ ఆత్రంగ.

"చేస్తది! ముందు మనం సరైన మార్గాన్ని వెతుక్కుంటె ఆమె చేస్తది" అంటు ఏవో ఆలోచనల్లోకి వెళ్లిపోయింది.

ఉన్నట్టుండి కాలనీలో గొల్లున ఏడుపులు వినిపించినయి.

"దుర్గా.. ఏందో చూసిరా."

దుర్గ ఏడుపులు వినిపిస్తున్న వైపు నడి చింది. కొంతసేపైనంక తిరిగొచ్చి "దవాఖా నలో పని చేసే సిస్టర్ లేదామ్మ.. ఆమె ఇంటి ముందే ఈ ఏడుపులు. ఆమె పెండ్లీ డుకొచ్చిన బిడ్డ పురుగుల మందు తాగిం దట. అది ఇది అనెలోపే ప్రాణం పోయిం దట. బిడ్డ నిద్ర పోతున్నట్టెవుంది"

"ఏం జరిగిందో, ఎవరు కారకులో! ఏం జరిగినా ఎవరు కారకులైనా చావటమేనా పరిష్కారం? ఇంటికి తాళం వేయి చూ సొద్దాం.. ఎంతో ఉషారమ్మాయి" అంది గంగ పుస్తకాన్ని మూసి పట్టుకుంటు.

ఇంటికి తాళం బెట్టి బయలుదేరిండ్రు.

★ ★ ★

"దుర్గ, రాత్రి నుండి సాగరి మరి మరి గుర్తొస్తుంది. మూడేండ్లయింది పోక! నేను జనగాం వెళ్లొస్త. నీవు ఈ రోజు మెకాని క్ని పిలుచుకొచ్చి నీ గిర్నిని ఫిట్ చేయించు. తొందరగా పని మొదలు కావాలి. ఇప్పటికే ఆలస్యమైంది" అంటు

**కొత్తగాలి...** 

**సగానికి పైగా భూమి**
**నీటిలో**
**సగానికి పైగా జీవితం**
**రహస్యంలో**

– మంత్రి లక్ష్మీనారాయణ,
సిరిసిల్ల

బస్‌స్టాండ్ వైపు నడిచింది గంగ. బస్సు సిద్ధంగావుంది. వెళ్లి కూర్చుంది. రాత్రి అమ్మాయి చేసుకున్న ఆత్మహత్య గుర్తొచ్చి మనసు కలత చెందింది. చురుకైన అమ్మాయి, డిగ్రీ వరకు చదివి హఠాత్తుగా చనిపోతే కన్నతల్లి ఏంకాను? ఎందుకు ఈ పిల్లలు ఇంత నిర్దయగా, తెగింపుగా వుంటరో? పోయినసారి సాగరిని కల్సిన పుడు ఆమె మాటలూ అదోమాదిరిగా వున్నాయి ఎందుకో? కట్టె విరిచినట్టు, పొడి పొడిగా వుండే. స్కూల్ వాళ్లు ఎప్పుడు బడితె అప్పుడు రావొద్దు అంటె పోలేదు కాని ప్రేమలేకనా? ఎలాంటి ఇబ్బంది కలి

గించక వుంచడం వల్లే బాగా చదివి ఓ ఎస్సెస్సీలో ఫస్ట్‌క్లాస్ వొచ్చింది. పక్కన వున్న బ్యాగ్‌వైపు చూసి కాలేజికి వెళ్ళ నుంది కనుక పట్టు పరికిణి, పట్టుచున్ని, మరో పంజాబీ డ్రస్సు అనుకుంటు మురిసి పోయింది.

బస్సు నడుస్తూనే వుంది. మధ్యాహ్నాం వరకు గంగ జనగాం చేరుకుంది.

స్కూల్ ఆవరణలో అడుగు పెట్టి ఫాదర్ గదివైపు నడుస్తూ, ఇరువైపుల వున్న చెట్ల వైపు చూసింది. చెట్లు గుబురుగ పెరిగి చల్లని నీడలను పరుస్తున్నయి. ఇంతకు ముందున్న కోతులు ఇప్పుడు కనిపించ లేదు. అందుకే కొమ్మలు రెమ్మలు పచ్చగ వున్నయి. 'అయినా ఇక్కడ కోతులు ఎక్క డుంటయి. స్కూల్లోనే పెద్ద పెద్ద కోతు లుండే' అనుకుని నవ్వుకుంది. తాను గదిలో అడుగు పెట్టగానె ఎదురుగా కూర్చున్న ఫాదర్ చిరునవ్వుతో "రండి రండి శుభాకాంక్షలు మీ కూతురు ఫస్ట్‌క్లా స్‌లో పాసైందిగ" అన్నడు నవ్వుతు.

"థాంక్స్ ఫాదర్" వినమ్రంగా అంది.

"కూర్చోండి" అన్నడాయన ఆమె శరీ రంలో వచ్చిన నిండుతనం, కట్టుబొట్టులో వచ్చిన మార్పును గమనిస్తూ.

గంగ కూర్చుంది.

"తెలివైన అమ్మాయి బాగ చదివి డాక్టర్ అవుతది అనుకున్న కాని-" అని ఆగిండు.

"ఇప్పుడేమైంది, చదివించుదాం, నా ఆర్థిక పరిస్థితులు మెరుగైనయి ఫాదర్"

"మీ ఆర్థిక పరిస్థితులు మెరుగైనయి కాని ఆమె మానసికస్థితి మారి పోయింది గదా!" అన్నడు మెల్లగ.

"అంటే" ఒక్కసారె అయోమయంలో కూరుకపోయింది గంగ.

"గాబరా పడకండి - మనమోటి తలిస్తే దైవం ఓటి తలుస్తది అంటరు గదా! అదే జరిగింది" అన్నడు ఆ మాటలో ఓదార్పు ధ్వని వుంది.

"నాకేం అర్థం కావటంలేదు ఫాదర్" అంటున్నప్పుడు ఆమె వళ్ళంతా చెమటలు చిమ్మాయి. కొంగుతో ముఖం అద్దుకుంది.

ఫాదర్ బెల్ నొక్కి అటెండర్ రాగానే "అమ్మగారికి మంచినీళ్లిచ్చి, సాగరిని పిలు చుకురా" అన్నడు.

గంగ గ్లాసు ఖాళీచేసి టేబిల్ మీదుంచి, ఒంటరితనం కోసం బయటికి నడిచి మెట్ల మీద నిలుచుంది. హాస్టల్ నుండి సాగరి ఫాదర్ రూమ్‌వైపు వస్తువుంది. తల్లి అటు వైపే చూస్తుంది.

అది గమనించిన ఫాదర్ అన్నడు "గంగగారు ఆ చెట్టుకింది అరుగుమీద కూర్చోని మాట్లాడుకోండి. అమ్మాయి మొదలే మీపై గుర్రుగా వుంది"

గంగ లోపల కుర్చీ దగ్గరవున్న సంచిని తీసుకుని అరుగువైపు నడిచి అక్కడ కూర్చోని వస్తున్న బిడ్డనే చూస్తూంది. 'సాగరి చాల ఎత్తుగా పెరిగింది. శారీర కంగా బలపడింది. ముఖం విప్పారింది. మరి పదహారు కదా?' అనుకుంటున్న ప్పుడు మరీ దగ్గరగా వచ్చింది సాగరి. 'రాగానే అమ్మ అని మీద వాలుతుంది. ఆత్మీయ స్పర్శతో పులకరించవచ్చు. ఆనందబాష్పాలను రాల్చుతు భవిష్యత్తుకు బాటలు వేసుకోవచ్చు' అనుకుంటూ

## కొత్తగాలి...

**నీ జీవితం**
**తెరచిన పుస్తకమా?**
**లాభం లేదు**
**అన్నీ తెల్లకాగితాలే**

– ప్రతాప వెంకట సుబ్బారాయుడు,
సికింద్రాబాద్

వుంది. సాగరి వచ్చి నిలుచుంది.

గంగ లేచి, "తల్లీ ఎట్టా వున్నావు? " అంటూ చేతులు సాచిందికాని సాగరి నోరు విప్పలేదు. చేతులలోకి పోలేదు. కనీసం చేతులను తాకనూ లేదు. గంగ కనులు కాలువలైనయి. వణుకుతున్న గొంతుతో "మాట్లాడవేం తల్లీ? " అంది.

సాగరి నోరు విప్పలేదు కదా కనీసం తల్లి ముఖంలోకి చూడనుగూడ చూడ లేదు. అట్టనే మౌనంగ నిలుచుంది.

"నీవు ఫస్ట్ క్లాసులో పాసైనవట" అంటు ఆగకుండ రాలుతున్న ఆనందబాష్పాలను కొంగుతో అద్దుకుంది.

"ఇవిగో నీవు కాలేజికి వెళ్లేటపుడు వేసు కోవడానికి తెచ్చిన" అని బ్యాగ్‌లోని పట్టు లంగ, పంజాబి డ్రస్‌లను చూపించింది.

"నేను కాలేజి చదివితెగదా!" అతికష్టంగా నోరు విప్పింది సాగరి.

"ఎందుకు? ఇప్పుడు మన పరిస్థితి మెరుగైందిర. నిన్ను ఎంతంటే అంత చది వించగలను" అంది గంగ ఆతురతగా.

"నీ ఆర్థిక పరిస్థితి మెరుగు కాకున్నా నేను చదువుకునే వనరులు కలిసొచ్చినయి, కాని నాకు చదవాలని లేదు" చూపుడు వేలుతో పెద్దవేలును రాస్తూ అందామె.

"ఎందుకని" అంది ఆదుర్దాగా చూస్తూ.

"నన్ను ఎన్నడూ ఏమి అడగలేదు, ఏమి చెప్పలేదు. ఇప్పుడు అట్లాగె వుంటె మంచిది" అంది సాగరి. ఆ గొంతులో కొంచెందుఃఖం, మరికొంచెం కాఠిన్యం కలిపి పేరుకుంది.

"నేను ఎలాంటి పై చదువులు చద వను. ఉన్న చదువుతోనే జనానికి సేవలు చేయాలని నిర్ణయించుకున్నాను" అనికూడా అంది, ఇక మాట ముచ్చటకు అవకాశం లేదన్నట్టు చూస్తూ.

"అంటే" తన ఆశలను సుడిగాలి చుట్టే సిన చూపులతో అడిగింది గంగ.

"మదర్ థెరిస్సా సేవా సదన్‌లోకి సిస్ట ర్‌గా వెళుతున్నాను" అంది.

"ఎంతపని చేస్తున్నవు తల్లి? " అంటు దుఃఖంతో కుమిలి పోతూవుంటే సాగరి తల్లి తెచ్చిన బట్టలవైపు చూస్తూ "చాలా ఆలస్యంగా ఈ బట్టలు తెచ్చినవు. ఇప్పుడు నాకు కావల్సినవి ధవళ వస్త్రాలు. అవి ఈ మిషన్‌వాళ్ళే ఇస్తారు" అంది.

గంగ ఏడుస్తూనే వుంది.

"ఏడవకండి. కాలం ఎప్పుడు ఆగదుకదా ఎప్పుడేం జరగాలో అది జరిగిపోతునే వుంటది" అంది వేదాంతిలాగ కూతురు.

గంగకు సుడిగుండంలో పడ్డట్టయింది.

"ఒక్కమాట అడుగుత, నిజం చెప్పగ లవా? తల్లివి నీవు, తండ్రి ఎవరమ్మ? "

గంగ మాట్లాడలేదు. ఆమె కళ్లు నీటి ధారలను వొదులుతున్నయి.

"చెప్పవు. చెప్పేదానివైతే ఎప్పుడో చెప్పే దానివి. అసలున్నడా? లేక అందరు అనే రూపాయి బిడ్డనా"

గంగ కుడిచేతితో సాగరి నోరు మూస్తూ "అంత మాటనకు తల్లి. నా గుండె ఆగిపో తది" అంటూ బిడ్డను కడుపులోకి తీసు కుంది కాని శబ్దం సరిగా రాక గొంతులో ఏదో అడ్డొచ్చినట్టయి మాట తెగింది.

"నీవు నాన్న పేరు చెప్పవు! అసలు వుంటె నా దగ్గరికి ఒక్కసారైనా వొచ్చు

## కొత్తగాలి...

**సూర్యుడు**
**సిగ్గుపడుతున్నాడు**
**పెట్రోలు ధరలా**
**మండనందుకు**

– పి.వి.ఎన్. ప్రసాద్,
నవులూరు, గుంటూరు జిల్లా

కదా? " సాగరి దుఃఖాన్ని మింగుతుం డడం వల్లా శబ్దం సరిగా రావటంలేదు.

"ఆయనిక్కడ లేడు"

"ఎక్కడున్నడు? "

"తెలియదు. నిన్ను కడుపుల వేసిపోయి ఇప్పటివరకు రాలేదు. ఉత్తరం కూడలేదు. తొందరపడి బతుకు ఎడారి చేసుకున్న. ఒయాసిస్సులాగ నీవున్నవనుకున్న. నీవూ నీదారి చూసుకున్నవు. ఇక మిగిలింది నేనే. నేను ఇక-" అని గంగ ఆగింది.

సాగరి మాట్లాడలేదు.

అప్పటిరకు నిలబడి మాట్లాడుతున్న గంగ అరుగు మీద కూర్చుంటు సాగరిని పక్కన్నే కూర్చోబెట్టుకుంది. కొంగుతో తన కళ్లు వొత్తుకుని, "నీకు చెప్పకుండా దాసిన విషయాలను ఇక చెప్పక తప్పదు. ఇందాక నీవన్నట్టు మనది రూపాయకు పిల్లలు కనె కులమె. మన పూర్వీకులు, ఆ తరువాత మా అమ్మలు, అత్తలు, అక్కలు అందరు ఆ శాపగ్రస్తులే. పెండ్లీలు లేవు, పెడాకులు లేవు. లంగ కట్టక ముందే తల్లి - తండ్రీ వ్యభిచార కూపంలోకి తోసి, వాళ్ళు తెచ్చె పైకంతో తిని తాగుతరు. వేరే పనేలేదు. వయస్సు మళ్ళినంక ఈరుపా నలు అమ్మటం, పందులను సాదుడు.

సాగర్ పనులు మొదలు కాగానే మా మేనత్త వచ్చి సాగర్లో స్థిరపడింది. దేశం నలుమూలల నుండి ఇల్లు, భార్య పిల్లలు వొదిలిపెట్టి ఎందరో కూలీలు వచ్చింద్రు. పొద్దంత పనిచేసినాకా రాత్రికాగానే వాళ్ళకు సార- సాని కావల్సొచ్చేది. అందు కని మాఅత్త బాగా సంపాదించడమె కాకుండా చుట్ట పక్కాలను గూడ పిలుచు కుని, కులవృత్తి చేపిస్తుండేది. వాళ్లలో మా అమ్మ గూడ ఒకతి. పోగ ఎందరు భార్య లుంటె అంత డబ్బు వస్తదని మా నాన్న ఇంకిద్దర్ని ఏసుకొచ్చి ఆ పనిలోకే దింపిండు. మా అక్కను పదేండ్లకే వ్యాపారంలో దింపింద్రు. నేను బడికి పోవటం వల్లా నన్ను అంత తొందర పెట్ట లేకపోయింద్రు. కొస్త చదువుకుని కట్టు బొట్టుల్లో మార్పు వొస్తె ఆఫీసర్ల దగ్గర్కి పంపి ఇంకా ఎక్కువ సంపాదించొచ్చని బడికి పంపింద్రు. అప్పట్లో ఎనిమిదో తర గతి చదవగానే ఆపి ఓ కాంట్రాక్టర్ ముస లోడితో కాలు తొక్కించే ప్రయత్నం చేసింద్రు. నేను ఎదురుతిరిగి కూలికి వెళ్ళే దాన్ని. అక్కడా మోసమే జరిగింది. నాయుడని ఒకాయన మాతో పని చేపించే టోడు. ప్రేమిస్తున్ననని ఓ గుడి దగ్గర పసుపుతాడు కట్టి, నుదుట కుంకుమ పెట్టి 'నీవు నా భార్యవు' అని కాపురం పెట్టిండు. మూడు నెలలు గడవగానే ఓరోజు మిషన్స్ బాగు చేయించడానికి ఉత్తర భారతం వెళుతున్న, వారం రోజుల్లో వస్త నని పోయి ఇప్పటివరకు రాలేదు. ఓ ఉత్తరం లేదు. తరువాత తెల్సింది ఆ నాయుడు కాంట్రాక్టర్ కాదు, గుమస్తా అని. అప్పటికే నీవు కడుపులో పడ్డావు. కష్టాలు తట్టుకుని నిన్ను కన్నాను. ఇప్పుడు చెప్పమ్మ నేను చేసింది తప్పా? " అని అడిగింది గంగ.

సాగరి పెదవి విప్పలేదు. ఎక్కెక్కి ఏడ్చింది.

"నాటినుండి ఆయన కోసమె ఎదురు చూస్తువున్న. మోతి పెద్దమ్మ నిన్ను వాళ్లమధ్య వుంచొద్దని, ఈ స్కూల్లో తెచ్చి చేర్చింది. స్కూల్‌వాళ్లు, మోతక్క గూడ నీవు ఇక్కడికి ఎక్కువ రాకు.. అమ్మాయి చదువు సాగదంటె ఇన్నాళ్లు గుండెను బిగ పట్టుకుని వున్న. పోయినోళ్లు పోంగ మిగి లిన మా అమ్మను, అక్కను ఆ వృత్తి నుండి తప్పించి ఏరే పని చూపించిన. నీ దగ్గర్కి వచ్చేసరికి, నీవేమో.." అంటుంటే ఆమెగొంతు పూడుకుపోయింది.

తర్వాత ఏడుస్తున్న సాగరి కళ్లు తుడిచి

తలనిమిరి, శూన్యంలోకి చూస్తువుంది.

సాగరి తన తల్లి ఎదమీద తలవుంచి ఏడుస్తూ వుంటె అవమానపు అలలు ఆవి రైపోయినయి!

"నెల ముందొచ్చినా బాగుండేది. లేదా ఇంతకుముందే ఇదంతా చెప్పిన బాగుం డేది" అంది సాగరి కళ్లద్దుకుంటు.

అంతే! గంగ ఒక్కసారె బోరుమని ఏడ్చింది.

ఫాదర్ బయటికొచ్చి చూసి తల్లీబిడ్డ కూర్చున్న వైపొచ్చాడు.

"ఈ ప్రపంచంలో వున్న దుఃఖాన్ని పోగొట్టుట కోసమే ప్రభువు శిలువ మోసాడు. ప్రభువును తలుచుకోండి. దుఃఖం దూరమౌతుంది" అంటు తన ఎద మీది శిలువని కళ్లకద్దుకున్నడు. తర్వాత-

"నీ కూతురు సిస్టర్‌గా మారటం నీకిష్టం లేదనుకుంట"

అవునన్నట్టు తల ఆడించింది గంగ.

"సాగరిని పంపిస్తే నేను చదివిచ్చుకుం టా ఫాదర్"

"ఇప్పుడు కుదిరే పనికాదు. ఈ అమ్మాయి మిషనరీవాళ్లకు రాసి ఇచ్చింది మేరీమాత మీద ఓత్‌ని! ఓ నెల విజయ వాడ ట్రైనింగ్‌కు కూడా వెళ్లొచ్చింది"

గంగ గొంతు మూగపోయింది.

"ఈమె ఇప్పుడు కలకత్తాలో ఒక సంవ త్సరంపాటు శిక్షణకై వెళ్లవలసివుంది. పోయి అయితే రానీ.. తరువాత ఆలోచిం చుదాం. నేను మీ అమ్మతో మాట్లాడినం కనే నిర్ణయం తీసుకో అన్నాను. వినలేదు. మీ పేరెత్తితేనే చిరుబుర్రులాడేది. మేం ఎక్కువ చెప్పలేం కదా? " అన్నడు ఫాదర్.

పొరపాటైందన్నట్లు చూసింది సాగరి.

"మీరు ఈ రోజు వుండిపోండి" అంటు గంగవైపు చూసిండాయన.

"అవునమ్మా! ఉండిపో" అంది సాగరి.

సరే అన్నట్టు తల ఊపింది గంగ. .

"జీసెస్ చాల గొప్పవాడు. ప్రైజ్ ది లార్డ్" అంటూ ఫాదర్ కదిలిండు.

ఆ రాత్రి బిడ్డతో కలసి తిన్నది గంగ. కలసి పడుకున్నది. ఇద్దరికీ నిద్రపట్టలేదు.

"అమ్మా" అంది సాగరి.

"చెప్పు తల్లీ" అంది.

"నిద్ర రావటం లేదు కదా? " అని అడు గుతు చెంపకు చెంప ఆనించగ ఇద్దరికళ్ళు వర్షించినాయి.

"ఫ్యాన్ తిరుగుతున్నా ఊపిరాడడం లేదు. కాసేపు బయట కూర్చుందామా? "

తలాడించింది తల్లి. ఇద్దరు లేచి వెళ్ళి బయట మెట్లమీద కూర్చున్నరు.

"నేను వెళ్ళిపోతున్నందుకు బాధపడుతు న్నవు కదా!" అడిగింది సాగరి.

తల్లి మాట్లాడలేదు. కడుపులో తలపె ట్టిన బిడ్డనెత్తిన కన్నీరు చుక్కలు చుక్క లుగా పడుతోంది.

"మన గురించి ఎన్నో రాత్రులు ఆలో చించి ఏడిచేదాన్నమ్మా. తేలింది, మిగి లింది ఆకలి, అవమానం, ఏడుపు. కులం అనేది ఓ పుట్టుమచ్చ! పుట్టుమచ్చను మనం చెరపలేము, దాయలేము. బతికిన న్నాళ్ళు మనతోనే వుండి చచ్చినాక మన తోనే పోతది. మధ్యన మార్చుకున్నా మారదు. మతాన్ని మార్చుకున్నా అప్పటికీ అది వెంటాడుతూనే వుంటుంది. నేను

---

## కొత్తగాలి... 

దిక్కులు
ధ్రువాలు
కలవడమే
రాజకీయం

– గంపా శ్రీదేవి,
సింహాచలం

---

నీలాగ కాదలుచుకోలేదు. నేనో బిడ్డను కని ఈ బాధలకు గురిచేయదలుచుకో లేదు. అందుకని నేను ఈ సేవా సమాజా నికి వెళుతున్నాను. నన్ను నిండు మన స్సుతో ఆశీర్వదించమ్మ" అంటూ తల్లి ముఖంలోకి చూసింది సాగరి.

ఆ చీకటిలో కంటితడి తగలడం తప్పా మరేం కనిపించడంలేదు. తల్లి వళ్ళో వున్న తన బిడ్డ కన్నీటిని తుడుచుతూ "వయ స్సులో చిన్నదానివైన బుద్ధిలో ఎంత ఎది గిపోయినవు తల్లీ" అని గుండెలకు హత్తు కుంది గంగ. అప్పుడు సాగరిలో ఓ మాదిరి ప్రశాంతత చోటు చేసుకుంది. తన గుండెలమీద బిడ్డ పడుకున్నపుడు గంగకు గతం గుర్తొచ్చి మరింత బిడ్డను అదుము కుంది. అప్పుడు సాగరి కన్నీళ్ళు తల్లికి వెచ్చగా తాకినయి!




'దుర్గ చిల్లీస్ గిర్ని' బోర్డు పెట్టి కాక పౌడర్ తయారిని ప్రారంభించింది దుర్గ. ప్రారంభోత్సవం గంగనే చేసింది. భర్తను కిరాణం కొట్లో పనిచేయటం మానిపించి గిర్ని మీదుంచింది దుర్గ. తాను మునపటి లాగె గంగ దగ్గర, మహిళ మండలితో తన పనిని కొనసాగిస్తూ అప్పుడప్పుడు గిర్ని పనిని చూస్తుంది.

వివిధ ప్రాంతాలలో స్టార్ట్ చేసిన గిర్ని లన్నీ బాగనే నడుస్తున్నయి. హైద్రాబాదు నుండి దినం తప్పించి దినం వాహన మొచ్చి పొడిని తీసుకుపోతూ మరునాడు పేమెంట్ తెచ్చిచ్చిపోతువున్నరు. అనుకు న్నట్టు వ్యాపారం ఏ ఆటంకం లేకుండా సాగుతూ వుంది. హాలియాలో గంగ వ్యాపారం మంచిగానే నడుస్తూవుంది.

మహారాష్ట్రలో, కర్ణాటకలో వర్షాలు బాగ కురవడంవల్ల కృష్ణ, గోదావరులు పొంగి పొర్లుతున్నయి. వరదల వల్లా సాగర్ నీటి మట్టం బాగ పెరిగింది. అన్ని గేట్లు తెరి చారు. వరదల్లో ఎక్కడెక్కడి నుండో కొట్టుకొస్తున్న జంతువుల కళేబరాలు, మనుషుల పీనుగలను ప్రాజెక్టు దగ్గర ఉ ధృతి తగ్గగానే పక్కకు నెట్టేస్తే మట్టికట్ట దగ్గర ఆగినయి. పోలీసులు, తాము వె ళుతూ గంగను రమ్మని కబురు పెట్టింద్రు. రిక్షా రాములు, ఇద్దరు ముగ్గురు బడిమా నేసి తిరిగే పిల్లలు వెంటరాగ మట్టికట్ట వైపు నడిచిందామె. ఓ పొడవాటి కర్ర సహాయంతో పీనుగుల్ని గుంజి కట్టమీద పడుకోబెట్టి, జేబులు చెక్‌చేసి పది, ఏబది నోట్లుంటె రిక్షా రాములుకు వెంట వున్న పిల్లలకు ఇచ్చింది. పంచనామ, పోస్టు మార్టం ముగించి పోలీసులు వెళ్లగానే ఆమె రాములు రిక్షాలో వాటిని తీసుకెళ్లి వర్రెల్లో, వంపుల్లో పాతిపెట్టి మట్టి కప్పిం చింది. ఇట్లా ఆ వారమంతా ఇదేపని!

ఆ రోజు ఓ పీనుగ కొట్టుకొచ్చిందని రిక్షా రాములు ద్వార కబురు అందుకున్న గంగ, అదే రిక్షాలో కూర్చొని మట్టికట్ట దగ్గరికి చేరి నిలుచుంది. నీటిమీద పీనుగ తేలి వుంది. ఖరీదైన పాంటు, షర్ట్ ధరించి వున్నాడు. నలభైపైన దాటినవాడు! శవం అంతగా ఉబ్బలేదు. కళ్లు, కనుబొమ్మలు బాగానే వున్నయి. ప్రవాహంలో ఒడ్డులకు తాకిన బట్టలు చినిగున్నయి. గంగ అతన్నే చూస్తూ నిలుచుంది. పీనుగను కట్టమీదికి లాగి, హెడ్‌కానిస్టేబుల్ చెక్ చేస్తూ

"ఏముందమ్మ మీరే చెక్ చేసి చెపితె పంచ నామ ముగించేవాళ్లం" అన్నడు.

"ఏమో ఎందుకొచ్చిన ఇది? అటు చూడండి. ఆయన చేతికున్న ఉంగరాన్ని, వాచ్‌ని ఎవరో వొలుచుకున్నరు. మీరు చూసింద్రు కాబట్టి సరిపాయె! లేకపోతే అనుమానాలకు తావేకదా? " అంది పరిశీలనగా చూస్తూ.

"మిమ్మల్ని అనుమానించడమా? మీరు చేస్తున్న ఈ సేవలకు మెప్పే కాని తప్పుండదు" అన్నడు హెడ్ గంగ వైపు చూస్తూ. పంచనామ ముగించి "రాములు రా. పీనుగను రిక్షాలో..." అంటూ వెళ్లిపోయాడు.

రాములు పీనుగను వెలికిలా తిప్పిండు. అతని చేతివేలు ఉంగరపు హద్దును, రిస్ట్ వాచ్‌అచ్చును చూస్తూ రెట్టవైపు చూసింది. అంతే! కళ్లుతిరిగి పడిపోయింది.

రిక్షా రాములు పీనుగను వొదిలి గంగను పట్టుకున్నడు. కాసేపటి తరువాత తేరుకుని పీనుగ రెట్టమీద వున్న 'గంగ' పచ్చను చూసి దుఃఖంతో పీనుగను తన వళ్ళోకి తీసుకొని బోరున ఏడ్చేసిందామె.

రాములు బొమ్మవోలె చూస్తూవున్నడు. అక్కడికి పిల్లలు-పెద్దలు చేరుతూవున్నరు. వాళ్లకు గంగ ఎందుకేడుస్తుందో అర్థంకాక చూస్తూ నిలుచున్నరు. వచ్చిపోయె జనం కూడ గంగను, ఆ పీనుగనే చూస్తువున్నరు. గంగ పీనుగ మీద తలవుంచి ఏడుస్తూ వుంది. ఆమె మనస్సులో, అతని పరిచయం, ఎత్తిపోతల గుడి దగ్గర నుదుట కుంకుమ బొట్టు పెట్టింది, అడవిలో తిరిగింది, ఒక్కొక్కటే గుర్తువస్తూ వుంటే దుఃఖం అలలుగా ఎగిసి పడుతూ వుంటే తట్టుకోలేక పోతుంది. మాచర్లలో గడిపిన రోజులు, సాగరి కడుపులో పడి కష్టాలు వచ్చిన తట్టుకుని ఎన్నడో ఓ నాడు తిరిగొస్తాడని, ఎదురుచూస్తున్నది.

"నీ బిడ్డ నన్ను కాదనిపోయింది. నీవూ పోయావా? నా బతుకులో ఇక మిగిలిందేమిటి? " అంటు నెత్తినోరు కొట్టుకుంటుంది. రిక్షా రాములుకు ఏం అర్థంకాలేదు కాని ఆయనకు ఈమెకు ఏదో సంబంధం ఉన్నదని గ్రహించి గంగను ఓదార్చిండు.

అప్పుడే పోలీసు సిఐ అటు వచ్చి ఏమిటని అడిగి తెలుసుకున్నడు. అతను గంగను గుర్తుపట్టిండు. ఆ శవాన్ని గుర్తుపట్టిండు. ఒకప్పుడు తన ఇంట్లో కిరాయికి వున్న జంటేనని నిర్ధారించుకుని గంగను ఓదార్చిండు. రిక్షా రాములును పిలిచి పీనుగను తీసుకురా అని చెప్పి తాను దగ్గరుండి కర్మకాండను జరిపించిండు.

వయస్సంతా ఎదురుచూపులతో గడిపిన గంగకు ఇక మీదట ఎదురుచూపులుండే ప్రశ్నే లేకుండా పోయింది! ఎవరి కోసమైతే తపించిపోయిందో ఆ దీపం ఆరిపోయింది. తాను ఏకాకిగ మిగిలిపోయింది. కులవృత్తికి ఎదురు తిరిగినందుకు లభించిన ఫలితమా అని రోదిస్తూ తిరిగి చూడకుండా వెళ్లిపోయింది.

ఏది ఆగినా కాలం ఆగదు కదా? పాత జ్ఞాపకాల మధ్య, బాధాకరంగా ఓ ఆరు నెలలు గడిచిపోయినయి. ఎంత వ్యాపారంలో తలమునకలవుతున్నా గతం గుర్తొచ్చి బాధిస్తూనే వుంది.

దుర్గ కారంగిర్ని దగ్గర గంగ కూర్చొని ఉండంగ వచ్చిండు జాన్‌సన్.

"ఆలస్యంగా తెలిసింది, వెరీ సారీ"

అతనితో మాట్లాడుతునే ఉన్నట్టుండి గంగ కళ్లు తిరిగి పడిపోయింది. జాన్‌సన్ తన కారులో డాక్టరు దగ్గరికి తీసుకెళ్లిండు. గతంలో కూడా గంగ ఆమెకే చూపించుకునేది. ఆమె రాసిన మందులను వేసుకోవటం తప్ప ఆమె చెప్పిన విషయాలు అంతగా పట్టించుకునేది కాదు. అందుకే అప్పుడప్పుడు ఈ తిప్పలు తప్పడం లేదు. అడగవల్సిన ప్రశ్నలన్నీ అడిగి తాను ఇంత

కుముందు చెప్పిన సలహాలను గుర్తు చేసింది డాక్టర్.

గంగ మాట్లాడలేదు.

"చూడమ్మ పాలు కాగపెడుతుంటే పొంగుకొస్తది. ఆ పొంగు మూతను పడే స్తది. మూతను కదిలిస్తే పొంగు తగ్గిపో తది అంతేనా? " అని అడిగింది.

అవునన్నట్టు తలాడించింది.

"మనిషి కూడా మనస్సులో కదిలే కోరి కలను అణిచి పెట్టడంవల్లా అవి పాలు పొంగినట్టే పొంగి మనిషిని పడేస్తయని ఇంతకు ముందు చూచాయగా చెప్పినట్టు గుర్తు. వాస్తవానికి మీకు ఏ రోగం లేదు. మీ వెంట వచ్చినాయన ఎవరు? " అని

## కొత్తగాలి... 

**ముఖ్యమంత్రులారా!**
**హెలికాప్టర్లమీద ఎగరకండి**
**ఎందుకో అవి ఈమధ్య**
**ఆత్మహత్యలు చేసుకుంటున్నాయి**

– ఎ. సూర్యప్రకాశ్,
నిజామాబాద్

అడిగింది.

"ఆయన మా వ్యాపారాలు చూసే ఎం.డి." అంది గంగ.

"ఎలాగుంది మీ కాకపొడి వ్యాపారం? " అని అడిగింది డాక్టర్.

"చాలా బాగా నడుస్తుంది" అంటూ ఫీజు ఇవ్వబోయింది.

"మీరు సమాజసేవ చేస్తూవుంటే మీ సేవ మేం చేయొద్దా? " అంటూ చేయి అడ్డుపెడుతూ-

"మళ్లీ కలుద్దాం. మీ ఎం.డి.గార్ని ఓ సారి లోపలికి పంపండి" అంది.

గంగ బయటికి నడిచి, జాన్‌సన్‌ను లోపలికి పంపింది.

"వందనములు డాక్టరుగారు" అంటు లోపలికి వచ్చి ఎదురుగా నవ్వుతు కూర్చు న్నడాయన.

"గంగకు ఏ జబ్బు లేదండి. కొంచం హిస్టీరియా అంతే" అని దాని లక్షణాలు ఏమిటి, ఎందుకొస్తుంది, ఎలా తగ్గుతుంది వివరించింది.

"మీ దేశంలో ప్రతిదీ తప్పే! ఇష్టం వున్నది చేయగూడదు. ఇష్టం లేనిది వద లగూడదు. అన్నిటికి సంప్రదాయం, సంఘ భీతి, మా దగ్గర ఇవన్నీ వుండవు. ఇద్దరు పిల్లలు అయినంకా నా భార్య- నేను తన దగ్గర ఎక్కువ ఉంటలేనని విడా కులు ఇచ్చింది. ఇద్దరు పిల్లలతో వేరే వుంటుంది. నేను అప్పటికే ఇండియా రావటం జరిగింది. నా పనులు నావి. ఏది మనం అనుకున్నట్టు కావుకదా అంతా ఆ లార్డ్ చిత్తం" అని నవ్విండతను.

"ఎవర్కి ఏం జరిగినా అన్నిటిని మరిచి మన ఆరోగ్యం కాపాడుకోవాలి. గంగ నాకు తెలిసినంతవరకు తన ఆరోగ్యం గురించి పట్టిచ్చుకోదని తెల్సిపోయింది" అ ని తనే మళ్లీ అన్నడు.

"మీరు చెప్పాల్సింది" అంది డాక్టర్.

"ఎంత చెప్పినా పట్టిచ్చుకోదు. ఆమెకు సుఖజీవనం తెలియనట్టుంది. తెలిస్తే ఆ తీరే వేరుంటది కదా? మెడిసిన్‌తో కుదు రదా? " అని అడిగాడు జాన్సన్.

"కొన్ని రోగాలకు మందులుండవు మరి. అందుకనే ఈ థెరపీలు! వాటిని మందుల్లా ఆచరించాలి. చెపితిగా ఆమెకు ఏ రోగం లేదు, మానసిక వొత్తిడి తప్పా. దానికి మందు రాస్తిని కదా.. కంపోజ్ అంతే! దానివల్లా హాయిగా నిద్రలోకి జారుకుం టరు" అంది డాక్టర్.

"ఇదైతే నిజమే! డ్రింక్ తీసుకుంటే కూడా అన్ని మరిచిపోయి నిద్రపోవచ్చు.

## మందుల కొట్టా? సాహిత్య దుకాణమా?

అప్పటి నిజం

మధ్యాహ్నంవేళ- గోదావరి స్టేషన్‌లో రైలు దిగి మెయిన్ రోడ్డుమీద వస్తున్నారు- ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి. 'గంధర్వకళ-తియ్యని లేహ్యము' అనే బోర్డు కనబడింది. అది శ్రీపాద వారి మందుల కొట్టు. దాన్ని ఇంటి నుంచి బజా



రులోనికి ఎప్పుడు తరలించారా? అని ఆశ్చర్యంగా చూస్తున్నారాయన. "రండి, రండి, అలా చూస్తారేం? ఇది మన ఆశ్రమం- మన అంతరంగం చిన్న కథలయితే- బహిరంగం ఈమందులూ, ఆసహాలూ, అరిష్టాలూనూ" అంటూ శ్రీపాదవారు అరుగుమీదికి వచ్చారు. లోపలికెళ్ళేసరికి భమిడిపాటి కామేశ్వరరావు, శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, పిలకా గణపతిశాస్త్రి ఉన్నారు. 'ఇది మందుల కొట్టా? సాహిత్య దుకాణమా?'- ఆశ్చర్యం కలిగింది ఇంద్రగంటివారికి. శ్రీపాదవారు కుశల ప్రశ్నలు వేస్తూనే ఉన్నారు. ట్రేలో అయిదు కాఫీలు సాక్షాత్కరించాయి. 'సంగీతము మరగి బేరసారములుడిగెన్' అన్న మాట జ్ఞాపకం వచ్చి నవ్వుకున్నారు ఇంద్రగంటి వారు కప్పును అందుకుంటూ. ఇంతట్లో ఎవరో పల్లెటూరాయన 'ద్రాక్షారిష్టం వుందండీ?' అంటూ అరుగుమీదకి వచ్చి వారి కాఫీ కలాపం చూసి బిత్తరపడి నిలబడ్డాడు. శ్రీపాదవారివి పాము చెవులు, పేరుకు తగ్గట్టుగానే. వారు కబుర్లు చెప్పుకుంటూనే వున్నారు. శ్రీపాదవారు ఎప్పుడు బీరువా తెరిచి సీసా తీశారో- ద్రాక్షారిష్టం ఇచ్చి, డబ్బులు పుచ్చుకొని, ఆ సాహితీవేత్తల దగ్గర చప్పుడుకాకుండా చతికిల పడ్డారు. ఒక చేతితో తియ్యని కథలూ, ఇంకో చేత్తో ద్రాక్షారిష్టం అందజేసే ఆంధ్రసవ్యసాచి- శ్రీపాద. అలాగే ఆయన దేశమంతా తిరిగి, తేనెటీగలా ఒక్కొక్క బొట్టు సంపాదించి తెచ్చి, తేనెపట్టు వంటి 'ప్రబుద్ధాంధ్ర'ను నడిపారు. ఆ పత్రిక ద్వారా ఆ తెలుగువారిని నిజంగా ప్రబుద్ధాంధ్రులనే చేశారు.

---

నేనైతే అదే చేస్తుంట. మరీ బోరుగా వుంటే కాల్‌గర్ల్‌ను పిలుచుకుని పబ్‌కు పోతుంటా అంతే! అన్ని సమస్యలకు ఫుల్‌స్టాప్" అన్నడతను తృప్తిగా నవ్వుతూ.

"మనిషికి కావల్సినవన్నీ కావాలంతే! అప్పుడే అన్ని సజావుగా సాగుతయి" అంటు బెల్ నొక్కింది డాక్టర్.

జాన్‌సన్ బయటికి నడిచిండు.

జాన్‌సన్ రావడం చూసి లేచి నిలుచున్న గంగ అతనిని అనుసరించింది. ఇద్దరు ఇల్లు చేరుకుంటున్నప్పుడు అడిగింది "చాలాసేపు మాట్లాడుకున్నారు"

"ఏముంది తెలియని విషయాలను అడిగి తెలుసుకున్న" అన్నడు నవ్వుతూ. ఆయన నవ్వితే పాలొలికినట్టు వుంటది.

"ఏదో విడాకులు అది ఇది అంటుంటివి"

"అవును గంగ, నీకు చెప్పే టైం దొరకలేదు. అమెరికాలో నా వైఫ్ నాకు విడాకులిచ్చింది"

"ఎందుకో"

"ఎందుకేముంది? యుఎస్‌లో వుంటలేదు. నన్ను, పిల్లలను సరిగా చూడటం లేదని కోర్టుకెక్కి ఎట్లయితేనేమి ఆమె గెలిచింది. పిల్లలు ఆమె దగ్గరే వున్నరు?" అన్నడాయన.

"అయినా మీ దేశంలో సంసార జీవితానికి విలువే ఇవ్వరట. ఇష్టమొచ్చినన్ని రోజులు కలిసి వుండటం, వద్దనుకుంటే విడిపోవటమట కదా?" అంది గంగ తాను తెలుసుకున్నది బయట పెడుతూ.

"అవును నిజమె, ఇక్కడిలా ఏడ్చు కుంటూ కూర్చోరు"

గంగ మాట్లాడలేదు. మరికొంత దూరం వెళ్లాక- "ఇంతకు నాకు ఏం జబ్బో చెప్పిందా? " అడిగింది.

"చెప్పింది" అన్నడు స్టీరింగ్‌వైపు చూస్తు.

"ఏందట"

"ఏంలేదు. వంటరిగా ఆలోచిస్తు కూర్చో వద్దట. మందిలో తిరుగుతు వుండాలట. నవ్వుతు నవ్విస్తు బతకాలట. తింటు తాగుతు తిరగాలట. అంతే అన్నీ దూరం అవుతాయట" అంటూ కారు అపిండు.

కారు ఆగిన శబ్దం విన్న దుర్గ పరుగెత్తు కొచ్చి గేటుతీసి వాళ్లు లోపలికి రాగానే, వెనకే నడుస్తూ "ఎందుకు కళ్లు తిరిగినయి టమ్మ" అని అడిగింది.

"ఏంలేదు, అంతా మామూలే. వేళకు తిని తాగాలట" అంటు జాన్‌సన్ వెనక్కు మళ్లి కారు డోరుతీసి వెనక సీటులో వున్న ఓ బ్యాగ్‌ను తీసుకుని వచ్చిండు.

"చూడు దుర్గ, రొయ్యల వేపుడు చేయి" అంది గంగ.

తల ఊపింది దుర్గ.

"లైట్ వేసి గ్లాసు కడుక్కొచ్చి టీపాయ్ మీద పెట్టు-" అంది.

"సరేనమ్మ. ముందు మీరు ఒకరి తరు వాత ఒకరు స్నానాలు చేస్తుండండి, క్షణంలో అన్నీ సిద్ధం" అంటు బయటి కొచ్చి పక్కింటి అబ్బాయిని బజారుకు పంపి తాను మిగతా పనుల్లో పడింది దుర్గ. బజారుకు వెళ్లిన బాబు వచ్చిండు. క్షణంలో అన్నీ తయారైనయి. గ్లాస్ టీపా య్ మీద వాలింది. తాను తెచ్చిన ఫ్రెంచ్ బ్రాంది మూతతీసి వంచుకున్నడు జాన్‌స న్. ఈలోపు అన్నీ అక్కడికొచ్చినయి.

గంగవొచ్చి ఎదురుగా కూర్చుంది.

జాన్‌సన్ బ్రాందిని చప్పరిస్తూ, ముక్కను నోట్లో వేసుకుంటు-

"మీరు-" అన్నాడు.

గంగ మాట్లాడలేదు.

"పనైపోయింది. అన్నీ టేబిల్ మీద సర్దిన. ఇక నేను వెళ్లనామ్మా" అంది దుర్గ.

"సరే" అంది గంగ.

"ఎందుకైనా మంచిది.. మంచినీళ్ల కోసం మరోగ్లాసు వుండనీయండి" అంటూ ఓ ఖాళీ గ్లాసును టీపాయ్ మీదవుంచి జాన్‌సన్ ఎదవైపు అదో మాదిరిగా చూస్తూ వెళ్లింది దుర్గ.

"నామాట విని మీరుకొంచెం" అన్నాడు.

గంగ మాట్లాడలేదు.

గ్లాసులో బ్రాంది వొంచి, నీటిని కల్పి గంగకు అందించిండు.

కాదనలేని గంగ ఓ గుటక వేసింది. గొంతులో భగ్‌మనిపించగా కనుబొమ్మలు కదిలించింది. అది చూసిన జాన్‌సన్ "నీళ్లకు ఏంకాదు, సోడా అయితేనే గొంతు సుర సుర మంటది" అన్నాడు.

జాన్‌సన్ సాసర్‌ను ఆమెకు అందించగ ఆమె అందులోని కాజును, రొయ్యను కల్పి నోట్లో వేసుకుంది.

ఖాళీ అయిన గ్లాసులో మరోపెగ్‌ను వొంచుకుంటు, "నా భార్య విడాకుల తరు వాత ఇదే నా భార్య అయి నిద్ర బుచ్చు తుంది. మీకు డాక్టర్ రాసిన కంపోజ్ గోలీలో ఉన్నది ఇదే! అదేమో ఘన

### కొత్తగాలి...

**తెలుగువారి ముంగిట్లో**
**తెలుగు పలికితే దండన**
**ఆంగ్లం మాట్లాడితే 'దండ'నా?**

*– పట్ల యాదగిరి,*
*గుండాల, నల్గొండ జిల్లా*

రూపం. ఇదేమో ద్రవరూపం!, రెండు చేసే పని ఒకటే. రెండూ మనస్సును తేలిక పరుస్తుంటయి"

రాత్రి అయింది. తాగడం ఆపి, డిన్నర్ ముగించిండ్రు. ఆ రాత్రి నిద్ర బాగ పట్టింది. దుర్గ వచ్చి గేటు తెరిచి లోపలి కొచ్చేసరికి జాన్‌సన్ చెట్టు కింది మంచంలో గాఢ నిద్రలో ఉన్నది చూడగనే ఆమె భుజాలు పైకి కిందికి అయి కనుబొమ్మలూ కదిలినయి. అంతేకాదు పెదవులు ముడిపడినట్లై మళ్లీ యథావిధిగా ఉండిపోయినయి. ఏ మనస్సులో ఏముంటదో తెలియదు కదా? సరిగ్గా అప్పుడే వార్తల పావురం వాకిట్లో వాలింది. దానిని అందు కొని ఇంట్లోకి నడిచింది. నడుస్తూ నడుస్తూ తనలో తానే నవ్వుకుంటు ఓసారి వెనక్కు మళ్ళి మంచంవైపు చూసింది. మంచంనిండా మనిషే!

సరిగ్గా అప్పుడు దుర్గకు తన భర్త గుర్తొచ్చిండు. 'తాను బెండకాయలాగ సన్నగా పొడుగ్గా ఉంటడు! ఎంత తిన్న బలవడు!' అని అనుకుంటు తలుపు తెరిచింది. గంగ గాఢ నిద్రలో ఉంది. పాదాల నుండి నడుం వరకు దుప్పటుంది. దుర్గ తన పనిలో తాను మునిగింది.

చూస్తు చూస్తు నెలరోజులు గడిచినయి. పొద్దున్నే టీ తాగుతుకూర్చుంది గంగ.

ఫోను మోగగానే ఎత్తింది.

"హల్లో, శుభాకాంక్షలు!" అవతలి గొంతు పరిచయమున్నదే!

"నమస్కారం విమలక్క"

"నమస్కారం! పేపర్ చూసినవా"

"మాకింకా రాలేదు"

"త్వరగా చూడే అమ్మా! పేపర్ నిండా నీ గురించే, నీ ఫోటోలే!"

"నాకర్థం కాలేదక్క"

"చెపితె అర్థంకాదు, చూస్తేనే అర్థం అవుతది. ఆ తరువాత నాకు ఫోను చేయి, ఉంటా" అంటూ ఫోను పెట్టేసిందావిడ.

గంగ మనస్సులో ఉత్కంఠ మొదలైంది. ఏంది ఈ విమలక్క సంగతేమిటో చెప్ప దాయె! అనుకుంటున్నప్పుడు మరో ఫోన్!

ఎత్తింది గంగ.

"హలో నేను సిఐని మాట్లాడుతున్న మేడం శుభాకాంక్షలు!" అన్నడు.

ఎందుకో ఏం చెప్పాలో తోయలేదు.

'సార్' అని మాత్రం అంది.

"నేను తరువాత జీప్ పంపిస్తాను, ఓ సారి వచ్చి పొండి"

ఏం అర్థంకాకపోయినా "సరే సర్" అంది.

ఫోను పెట్టేసిన శబ్దం!

మళ్ళీ ఫోన్ మోగింది. ఎత్తగానే "హల్లో నేను హాస్పిటల్ ఆర్‌ఎంఒను మాట్లాడుతున్న. కంగ్రాట్స్ మేడం! నేను ఎప్పుడో అనుకున్న మీకు ఈ కీర్తి వొస్తుందని"

ఏంకీర్తో ఏమిటో అని మనస్సులో అనుకుని "థ్యాంక్స్ సార్" అనగానే అవతల ఫోను పెట్టేసిన శబ్దం.

గేటు చప్పుడైతే "దుర్గ చూడు" అంది.

దుర్గ గేటువైపు నడిచి పత్రికను అందుకుని చూస్తూ నడుస్తుంది.

"రా.. రా.. తొందరగా రా" అని ఎదురెల్లి పత్రికను చూస్తుండిపోయింది.

'అవును, విమలక్క అన్నట్టు పత్రికలో అరపేజి తన గురించే!' మనస్సు గంతులేసింది. కళ్ళల్లో నీరు ఊరుతువుంది.

దుర్గ పెదాలు విప్పుకున్నయి! 'అనాథల అభయ హస్తం!' 'మానవసేవే మాధవ సేవ అని నిరూపిస్తున్న ఓ మగువ' ఎన్నెన్ని పొగడ్తలో!

గంగ చెప్పడంతో దుర్గ బజారుకెళ్లి తెలుగు, ఇంగ్లీషు పేపర్లు అన్ని తెచ్చింది. టి.వి.లోను ప్రముఖంగా ఇదేవార్త! గంగ ఎంతో మురిసిపోయింది. మహిళామండలి ఆఫీసుకు వెళ్ళేసరికి అప్పటికే అక్కడకి



చేరుకున్న మహిళలు గంగను అభినందనలతో ముంచెత్తింద్రు. స్వీట్స్ పంచిన్రు. ఊరికి పెద్దపేరే తెచ్చిందని మెచ్చుకున్నరు.

గంగ జాన్‌సన్‌కు ఎన్నిసార్లు ప్రయత్నించిన లైన్ కలవలేదు. కాసేపు మౌనంగా ఆలోచించింది. తాను ప్రచారాన్ని కోరి ఆ పనులు చేయలేదని మనస్సు మరీమరీ చెపుతూనే ఉంది. ఉన్నట్టుండి ఫోను మోగింది. ఫోనెత్తి "హల్లో" అంటూనే అవతల గొంతును గుర్తుపట్టి "అక్కా నమస్కారాలు" అంది.

"శుభాకాంక్షలు! ఈ రోజు 'హిందూ', 'ఎక్స్‌ప్రెస్' పత్రికల్లో నీ ఫోటో చూసి గుర్తు పట్టా. మా కార్యాలయపు పి.ఏతో చదివించుకున్న. నిస్వార్థంగ చేసిన ఏపని ఉట్టిగ పోదు కదా? " అంది మోతి.

గంగ మాట్టాడలేదు.

"అక్క నీ ఫోన్ కోసం ఎదురు చూసిన! నీవేమో నీ నెంబర్ ఇవ్వనైతివి. సాగరి మదర్ సేవాసదన్‌కు ఎల్లిపోయింది"

"అరే, అట్టనా? ఎందుకట్టా సేసిందో" అంది బాధగ మోతి.

"నేను పట్టిచ్చుకోలేదన్న కోపం"

"అట్టా జరగవల్సి లేకుండే. పోని ఏంచేస్తం"

"ఏది నేను అనుకున్నట్టు జరగలేదక్క" దుఃఖపు పొరలు అడ్డొచ్చి గంగ మాటలో మార్పొచ్చింది.

"బాధపడకు, మరోసారి మాట్లాడుకుందాం" ఫోను పెట్టేసింది మోతి.

గంగ కాసేపు సాగరి జ్ఞాపకాలలోకి వెళ్ళి మౌనంగా ఉండిపోయింది.

నిశ్శబ్దాన్ని భంగపరుచుతు ఓ జీపొచ్చి బయట ఆగింది.

జీపు దిగి వొస్తున్న పోలీస్ సిఐకి నవ్వుతు స్వాగతం చెప్పింది గంగ.

ఇద్దరు ఆఫీసులో కూర్చున్నరు.

"పత్రికల వాళ్ళు బాగ రాసారు"

"మీ పోలీసుల సహకారం ఎంతో ఉంది సిఐగారు" అంది గంగ.

"మాది డ్యూటీ, మీది సేవ మేడమ్"

గంగ నవ్వింది.

"వస్తమరి, హైలాన్‌లో ఏదో యాక్సిడెంట్..వెళ్ళాలి" బయటికి నడిచిండతను.

## 14

గంగ వ్యాపార వ్యవహారాలు చూస్తూనే వీలు దొర్కినపుడల్లా సేవా కార్యక్రమాలలో పాల్గొంటువుంది. వృద్ధులకు, అనాథలకు సహాయ సహకారాలను అందిస్తూ వారి సమస్యలను తీర్చుతుంది. ముఖ్యంగా వరదల్లో కొట్టుకొచ్చే శవాలను ఖననం చేయించడంలో రోజురోజుకు శ్రద్ధ పెరుగుతూనే వుంది.

ఓ రోజు జాన్‌సన్ వచ్చేసరికి గంగ ఇంట్లో లేదు, మహిళామండలి కార్యాలయంలో లేదు. దుర్గను అడిగితే మట్టి కట్ట వైపు వెళ్లిందని చెప్పగా దారి చూపడం కోసం దుర్గను కూర్చోబెట్టుకుని మట్టి కట్ట వైపు కారును మళ్లించి చూడగా-

చీరెను గోచిలాగ బిగించి, కొంగును నడుంచుట్టుకొని, జడను కొప్పులాగ ముడుచుకుని, పొడవాటి కర్రతో నీటిపై తేలుతూవస్తున్న శవాన్ని వొడ్డుకు గుంజుతూ వుంది. దగ్గర్కి వచ్చినాక కట్ట మీదికి పొర్లించడానికి, కొందరు పిల్లలు, ఓ పోలీసు, రిక్షా రాములు శవాన్ని అందుకున్నరు. అది చూసిన జాన్‌సన్ తన కెమెరాతో ఫోటోలు తీసిండు.

గంగ జాన్‌సన్‌ను చూసిన పలకరించకుంటనే తన పనిలో లీనమయి వుంది. పోలీసు పంచనామా ముగించింది. ఆ తరువాత పోస్టుమార్టం చేసి పీనుగును గంగకు అప్పగించారు. ఆమె రిక్షా రాము



లుతో కల్సి వెళ్లి ఖననం చేసింది.

జాన్‌సన్ ఆ దృశ్యాలను కూడ కెమెరా లోకి ఎక్కించిండు. ఆ తరువాత అందరు గంగ ఇల్లు చేరారు. ఇది చూసిన దుర్గ తక్షణ ఏర్పాట్లు చేస్తూనే, సోఫాలో కూర్చున్న జాన్‌సన్‌ను మధ్య మధ్య చూస్తూ సిగ్గుల మొగ్గై ముసిముసిగా నవ్వుకుంటు 'ఈసారన్న నా ఫోటో తీస్తాడో' అనుకుంటుంది.

అప్పుడే- "ఏం దుర్గ నాస్త ఏం చేసినవు" అని అడిగిండు.

"పూరి, కిమా సార్" అంది. అప్పుడామె చేతిలో ఓ గరిటె వుంది.

అది చూసిన జాన్‌సన్ నవ్వుతూ "అదేమిటి నన్ను కాల్చుతవా ఏంది" అన్నడు.

గంగ స్నానాల గదిలో ఉన్నది కనుక చేతిలో గరిటెను వంటింట్లో పెట్టొచ్చి చనువుగా దగ్గర్కొచ్చి "నాదో ఫోటో తీయరా! సార్" అంది మెల్లగా.

"ఓ షూర్ తప్పకుండా" అన్నడు ఆ రోజు దినపత్రికను తిరగేస్తూ. అంతేకాదు 'బ్లాక్ బ్యూటి' అంటూ చూపుడు వేలుతో ఆమె చెంపమీద చిటిక వేసిండు.

స్నానాల గది తలుపు తెరుచుకున్న శబ్దం రాగానే దుర్గ నాలిక్కరుచుకుని అక్కడి నుండి కదిలి వంటింట్లోకి నడిచి,

వంటకాలు తెచ్చి టేబిల్‌మీద పెట్టింది.

ఇద్దరు ఒకరినొకరు కొసిరి కొసిరి తిని పించుకున్నరు.

"మీరు చేస్తున్న సోషల్ సర్వీస్ చాలా గ్రేట్ గంగ. ఈ విషయంపై నేను ప్రింట్ మీడియాలో ఆర్టికల్ రాస్తాను. లోకానికి మీ సేవలు తెలిసేలా చేస్తాను" అన్నప్పుడు మౌనంగా చూసింది గంగ.

"కాలం జీవితంలో కొట్టె దెబ్బలను మరిచిపోవడానికి నేనీపనులు చేస్తున్నాను తప్పా ఎవరికో ఆదర్శంగా వుండడానికి కాదు జాన్‌సన్‌గారు" అందామె చిన్నగా.

"ఇవి అందరితో అయ్యే పనులు కావు" అంటు ఆమె చేతిని తీసుకుని ముద్దు పెట్టుకున్నడతను.

అప్పుడు ఆమె కళ్లల్లో నీళ్లు తిరిగినయి. జరిగిన మోసం గుర్తొచ్చి "నాయుడు మోసం చేసిండు" అన్నది.

"అవును చేసిండు, అతను పోయిండన్నవు కదా? " అన్నడు.

గంగ మాట్లాడలేదు. తనను వదిలిపోయిన సాగరి గుర్తొచ్చి కాబోలు కళ్ళల్లోని నీరు టపటప చుక్కలు చుక్కలుగా అతని అరచేతిలో రాలినయి.

జాన్‌సన్ "నోనో గంగ గతాన్ని తలుచుకుని బాధపడొద్దు. నా గతం చెప్పమంటవా, నేను మా దేశంలో ప్రేమించి పెళ్లి చేసుకున్న. ఆమె జాబ్, నేను ఫ్రీలాన్స్ జర్నలిస్టును. మొదట జీవితం బాగానే సాగింది. ఒక కొడుకు కూడ పుట్టాడు. ఉన్నట్టుండి నీవు ఇట్లా తిరిగితె విడాకులు ఇవ్వాల్సి వుంటుంది అన్నది"

అయితే ఏమైంది అన్నట్టు చూస్తూ "ఇచ్చిందా ఏమి? " అడిగింది గంగ.

ఇచ్చింది అన్నట్టు తలను కదిలిస్తూ "అప్పుడు ఇవ్వలేదు కాని నేను ఇండియా కొచ్చిన వెంటనే వెళ్లలేకపోయాను కదా! దానిని అదునుగా తీసుకుని విడాకులిచ్చింది" అని ఆగిండు. అప్పుడు ఆయన గొంతులోను దుఃఖం పొంగింది.

"ఏది మనం అనుకున్నట్టు జరగదు గంగా! జరిగేదానికి మనం తట్టుకోవాలి. అంతా ప్రభువు దయ" అన్నడు తర్వాత.

గంగ మౌనంగ కళ్లను వొత్తుకుంటు పొడవైన శ్వాస తీసుకుంది.

"మీరు ఈమధ్య చాలా డిప్రెషన్‌లో వున్నారు. హైదరాబాద్‌కు రండి కొన్ని రోజులు ఉండొచ్చు"

గంగ మాట్లాడలేదు.

"ప్లేస్ మారితే ఆలోచనలు మారుతాయంటారు. రాదలుచుకుంటె చెప్పండి, గుంటూరు వెళ్లి తిరిగి మళ్లి ఇటునుండే వస్తాను. అన్నట్టు మన వ్యాపారం విస్తరిస్తోంది. కొన్ని టన్నుల పొడి కావాలని విదేశాల నుండి ఆర్డర్స్ వచ్చినయి. మన వాళ్ళకు డబ్బు తెచ్చి ఇస్తే వాళ్లు ఓ రోజు సరుకు కొనుక్కొని మరునాడు పొడిని సిద్ధం చేస్తున్నరు. ఆ తరువాత దినం తీసుకెళుతువున్నరు. అట్లా కాకుండా ఒకేసారి మనం సరుకుకొని అందరికి వేస్తే కంటిన్యూస్‌గ పొడి తయారు అవుతుంది గదా, ఆ ఏర్పాట్లు చేస్తున్నాను. మీరూ ఈ పనుల్లో హెల్ప్ చేయవలసి వుంటుంది".

గంగ వింటూ ఆలోచిస్తూ వుంది.

"మరీ వస్త నేను" అంటు లేచిండు.

గంగ లేచి నిలుచుంది. ఆమెలో వయస్సు తెచ్చె మార్పులు కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నాయి.

వీళ్ల మాటలనే వింటున్న దుర్గ వంటింట్లో నుండి బయటికి వచ్చింది.

అతను వెళ్లిపోయాడు.

"సారు రమ్మంటున్నట్టుంది వెళ్లిరండి" అంది దుర్గ.

గంగ కూర్చుంటు "మంచి నీళ్లు" అంది. దుర్గ మంచినీళ్లు తెచ్చిస్తూ "ఆయనా ఒంటరిగానే వున్నట్టుంది" అంది.





గంగ సూటిగ చూసింది.

దుర్గ తమాయించుకుని "అవునమ్మ డాక్టరమ్మ కూడ ఒంటరితనం వదలమని చెప్పింది కదా. అందుకని అంటున్న" అంది కొంచం తడబడుతు.

"మనం అనుకున్నయన్ని అవుతయా? "

"మనస్సుంటె మార్గముంటదమ్మ" అం దామె ఇంకొంచం ముందుకుపోతు.

"ఆడది ఒంటరిగుంటె ఎవరు బతకని స్తరు. మీరేదో జనాలకు సేవ చేస్తూ అందర్కి తెలుసు కనక సరిపోతుంది. అక్కడికి ఎవడో ఒకడు మన ఇంటివైపు చూస్తూనే వుంటడు. నన్నెంతమంది అడు గుతరనుకున్నరు. ఒక్కతె ఎట్లావుంటదని"

"మరీ నీవేమంటుంటవు? "

"ఏమంట? వున్నమాటే అంటుంట. అయినా వాళ్లు నమ్మరే"

గంగకు ఒకరోజు జరిగిన సంగతి గుర్తొ చ్చింది. వేసవి రోజులు మంచం బయట వాల్చుకొని పడుకుంది. ఇంకా నిద్ర పోలేదు. ఒకడు బయట రోడ్డుమీద రెండు మూడుసార్లు అటు ఇటు తిరి గిండు. ఆ తరువాత వచ్చి గేటు శబ్దంకా కుంట తీసి లోనికి వొచ్చే ప్రయత్నం చేస్తుంటే- "దుర్గ! అక్కడ మూలన కర్ర వుందందుకో. తెల్ల మేకలాగుంది, గేటు నెట్టుకొని లోపలికొస్తుంది. కాళ్లిరగ గొడదాం" అంది తను లేచి కూర్చుంటు. వెంటనే తెరుచుకున్న గేటు మూసుకుంది. మేకది పరుగే పరుగు!

ఇట్లా చాలసార్లు చాలా విధాలుగా కొందరు చేసే ప్రయత్నాలు చేస్తూనే వస్తు న్నరు. ఎప్పటికప్పుడు కాలం కాపాడు తూనే వస్తుంది. ఆడది ఒంటరిగా వుంటె వొచ్చే ప్రమాదాలు తనకు తెలిసినా భయ పడలేదు, లొంగనూలేదు. కాని ఎన్నాళ్లు? బతికినంత కాలం అని తనకు తానే సమా ధానం చెప్పుకుంది!

"అమ్మ నేను వెళ్లొస్త" అంటు బయటికి నడిచింది దుర్గ.

గంగ సోఫాలో జారగిలపడి వారపత్రి కను తిర్గేస్తూంటే ఫోన్ మోగింది.

ఎత్తి "హాల్లో" అంది.

"హాల్లో" అన్న అవతలి గొంతును గుర్తు పట్టి- "చెప్పక్క అంతా క్షేమమా? ఎన్నా ళ్లకు? " అంది గంగ.

రొటీన్ ఆఫీసు పనులు, కొంచెం ఆరోగ్యం బాగవుండడంలేదు. ఆడవాళ్ల కుండే ప్రత్యేక సమస్యలు వుంటయిగదా! మొన్న బాత్‌రూమ్‌లో పడిపోయిన గాని ఏ ప్రమాదం జరగలేదు? " అంది సుశీల.

"అట్టనా.. బాబు ఏం చేస్తున్నడు? "

> **కొత్తగాలి...**
>
> **బతికుండగా**
> **గంజినీళ్లు లేవు**
> **చచ్చేక తల్లిదండ్రులకు**
> **బ్రహ్మకపాలంలో పిండప్రదానం**
>
> – దూసి నీహారిక,
> బెంగళూరు

"చదవయిపాయె, యుఎస్ ఎల్లిపాయే"

"చెప్పనన్న చెప్పలేదు"

"ఎక్కడ.. క్యాంపస్ ఇంటర్‌వ్యూలో సెలె క్టఅయి వెంటనే ఎల్లిపాయె"

"శుభాకాంక్షలు"

"థాంక్స్! ఈసారొచ్చినప్పుడు ఇంటికిరా. వ్యాపారం బాగ నడుస్తుందని విన్న"

"అవునక్క"

"శుభం, వుంట" అని ఫోన్ పెట్టేసింది.

సుశీల తన కొడుకు యుఎస్ పోయిండు అనగానే గంగకు సాగరి గుర్తొచ్చింది. సాగరి ఒకవేళ కొడుకైతే ఈరోజు తనకు

కొండంత ధీమా వుండేది అనుకుని ఓ నిట్టూర్పు విడిచింది.

సాయంత్రం అయ్యింది. గేటు ముందు కారాగిన శబ్దం. గంగ బయటికెళ్ళి చూసింది. జాన్సన్!

"నేను వెళుతున్న, వస్తరా? " అడిగిండు.

గంగ దుర్గను పిలిచి "దుర్గ నేను హాలియా ఎళ్లొస్త" అంటు వెళ్ళి కారులో కూర్చుంది. కారు కదిలింది. హాలియాలో ఊరు చివరన ఆగి అక్కడి కారంగిర్నిని చూసి, వెళ్లిపోయిండు.

గంగను చూడగానే తల్లి ఏడుస్తూ ఎదు రొచ్చింది.

"ఏం జరిగింది? " అడిగింది గంగ.

## కొత్తగాలి... 

**మేలు చేసిన వానికి**
**చేటు చేసితివేని**
**తుదకు నీకే హాని**

– రశీద్ శిక్షక్,
సిరిసిల్ల

ఆమె మాట్లాడలేదు.

"అక్కేది" అని మళ్లీ అడిగింది.

"గిర్నిరూంలో ఉంది" అంది దుఃఖపు గొంతుతోనే.

ఎందుకేడుస్తున్నవే అంటూ చూపుల తోనే అడుగుతు గిర్నివైపు నడిచి "మంచిగ పనిచేస్తుంది గదా" అంది.

గంగ వెంట మెల్లగా నడుస్తూ తల్లి "మీ అక్క ఒకనికి మరిగింది" అంది.

"మరగనీ"

"వాణ్నే పెండ్లి చేసుకుంట అంటుంది"

"చేసుకోనీ"

"వాడు తురక"

"తుర్కో, తూర్పోడో మనకు మొదటి నుండి ఆ తేడాల్లేవుకదా? " అంది గంగ.

తల్లి మాట్లాడలేదు.

"చూడమ్మ! నేను అక్కతో అన్నీ మాట్లాడి పోతలే" అంటూ అక్క దగ్గర్కి వెళ్లి నిలుచుంది.

గంగను చూసి జమున మిషన్ ఆఫ్ చేసి "ఎప్పుడొస్తివి" అని అడిగింది, ముక్కు నోరుకు అడ్డంగ కట్టుకున్న గుడ్డను తొలిగిస్తూ.

"ఇపుడే వచ్చిన, రాంగానే అమ్మ ఏదో రాద్ధాంతం చేస్తూవుంది"

"ఆమె అంతే! ఆమె ఎన్నడు మనల నిమ్మలంగ బతకనిచ్చిందని" అంది జమున విసుగ్గా.

"ఆమె పదిమంది దగ్గర పండపెట్టి న్నాడు తప్పులేదు. ఒక్కనితో వుండాలను కుంటుంటే గోల!. నేను తప్పు చేస్తున్నం టవా గంగ" అంది జమున.

"సాగర్‌లో వున్నప్పుడు అక్కడ చూసిన వాళ్లు ఇక్కడున్నది చూసి, రాత్రిపూట వొచ్చి తలుపు తడుతూవుండేది. వీళ్లకు ఎంత చెప్పినా వినక నిద్ర పాడుచేసేది. ఎవర్నో ఒకర్ని వుంచుకుంటే వీళ్లరాక బంద్తైతదని, ఈ ఊరి లారీఓనరుకు దగ్గరైన. అతనంటే ఈ ఊళ్లో ఓ భయం గూడ. అతనే నా వెంట బడిండు. సరె అన్న. పెళ్లి చేసుకుంట అంటుండు. నేనే నీ దగ్గరికి వచ్చి మాట్లాడుదాం అనుకున్న. ఈ లోపల నీవే వచ్చినవు" అంది జమున.

"ఇంతకుముందు ఆయనకు పెండ్లి అయ్యిందా? "

"అయ్యిందట. భార్య ఇద్దరు పిల్లల తరు వాత కన్ను మూసిందట. ఆ పిల్లలు వాళ్ల అమ్మమ్మ దగ్గరుంటరట"

"పిల్లల తండ్రిని చేసుకుని నీవేం సుఖప డతవక్క"

"సుఖపడే రోజులు మనకెక్కడివి. నీ

జాగలో నీవుండి గిర్నీ నడుపుకో, నాకేమి ఇవ్వొద్దు. నేనే నీకిస్తుంట" అన్నడు.

"నాకు తెలియందికాదు, స్త్రీ ఒంటరిగా బతకడం. కాని ముందే ఆలోచించుకో"

"అన్నీ ఆలోచించిన గంగ, ముందు నాకు అండ కావాలె. నన్ను తన మతంలో కలుపుకుని నిఖా చేసుకుంట అన్నడు"

"ఆయనను నాతో మాట్లాడీయి. నాకైతె ఏ అభ్యంతరం లేదు. గోల చేయకుండా అమ్మకు అన్ని చెప్పిపోతలే" అంది.

"సాగరి ఎట్లుంది, బాగుందా? "

గంగ మాట్లాడలేదు.

సాయంత్రంవరకు పనులు చూసుకుని ఇల్లు చేరింది గంగ. గిర్నీ దగ్గరున్న దుర్గను గంగ రమ్మని సైగచేసి తాను వొచ్చేస్తుంటే మహిళామండలివాళ్లు మధ్యన కలిసి మాట్లాడుతు వున్నరు. దుర్గ ముందే వచ్చి గేటు తీసి, లైట్లేసింది. గేటుదాక వచ్చిన మహిళలు అంబేద్కర్ ఆలోచనలు వంటి వివిధ విషయాలను మాట్లాడి చివర మహిళా బిల్ మీద చర్చిస్తూ, ఈరోజు కాకున్న రేపైన రూపుతాల్చుదా అని ముగించి మళ్లీ కలుసుకుందాం అంటూ ఎవరింటి దారిన వాళ్లు వెళ్లింగ్రు. గదిలో అడుగు పెట్టిందో లేదో ఫోను మోగింది.

హలో అనగానే గొంతు గుర్తుపట్టి "నమస్కార్ చెప్పండి" అంది.

"ఏం చెప్పమంటవ్! చెప్పింది చేయవు" అనగానే గంగ చిన్నగా నవ్వింది.

"మీరు నవ్వుతున్నట్టుంది చాల సంతోసం! కాని మీరు ఇంకా సంతోషంగా వుండాలంటే ఓసారి హైద్రాబాదు రండి" అవతలి కంఠం.

"సరె" అని ముక్తసరి జవాబు.

"వచ్చే ముందు ఫోన్ చేయండి" అంటూ ఫోన్ పెట్టేసిన శబ్దం.

గంగ స్నానం చేసొచ్చి బయట మంచం మీద కూర్చుంది. తలనిండా ఆలోచనలే! అక్కకు తోడు కావాలి. అవును, ఆమె వెతుక్కుంది. మరి అమ్మ ఆరాటం ఏందీ? ఆ కులం మతం గురించిన పట్టింపు లెందుకు? అట్లా పట్టింపు వచ్చిందంటే ఆమెలో కొంత మార్పు చోటు చేసుకున్నట్టే! అంటే తాను కలలు కంటూ వస్తున్న మార్పు వస్తున్నట్టే కదా? మును ముందు ఇంకా మార్పులు రావచ్చు!

అంతలో దుర్గ "అమ్మ పోయొస్త" అంది. సరె అన్నట్టు తలాడించింది. దుర్గ వెళ్లిపోయింది.

ఆ రాత్రి ఏదేదో ఆలోచిస్తూ నిద్ర పోయింది.

ఉదయం టిఫిన్ చేస్తూ "దుర్గ హైద్రాబాద్ వెళ్లొస్త... బట్టలు సర్దు" అంది.

"రెండు మూడు రోజులకు సరిపోయే టట్టు చూడు" అంది మళ్లీ.

దుర్గ సర్దిపెట్టేసింది. ఇంటికి తాళంవేసి ఇద్దరు బస్‌స్టాప్ వైపు నడిచింగ్రు. బస్ సిద్ధంగా లేదు. స్టాండ్‌లో నిలుచున్నరు. తనకేదో తట్టినట్టు దుర్గ "అమ్మా ఈ రోజు మన వ్యాన్ వస్తదికదా" అంది.

"వస్తది, వస్తే? అందులో అంతా కారం వాసన! పోగ అది ఎన్నోచోట్ల ఆగుకుంట పోతది గదా? " అంది.

"అవును కదా" అంది దుర్గ.

హైద్రాబాద్‌కు వెళ్లే బస్సొచ్చింది. గంగ వెళ్లి కూర్చుంది. బస్సులోని జనం గంగ వైపు చూస్తూవున్నరు.

కండక్టర్ "హైద్రాబాదెకదా" అంటు టికెట్ ఇచ్చి "ఈమధ్య మీ ఫోటో పేపర్లో వచ్చినట్టుంది కదండి" అన్నడు నవ్వుతు.

గంగ తలాడించింది తప్పా నోరు విప్ప లేదు. బస్సులో వున్న మహిళలు ఆమె వైపు తలలు మలిపింగ్రు.

★ ★ ★

జాన్‌సన్ ఇంటి ముందు ఆటో ఆగింది.

లోపల అడుగుపెట్టేసరికి కొంతమంది హాల్లో కూర్చోని వున్నరు.

ఆఫీస్ బోయ్ ఎదురొచ్చి "అమ్మా మీ కోసమె ఎదురు చూస్తున్నరు, కాస్త ఫ్రెష్ అయి రండి" అనగానే, గంగ పక్క గది లోకి వెళ్లింది. తర్వాత జాన్సన్ వచ్చి అక్కడి వాళ్లకు పరిచయం చేశాడు.

"ఈ మేడం పేరు గంగ. మా వ్యాపా రంలో మూలస్తంభం. చాల మంచి మనిషి. మనుషుల్లో దేవత. అంత పెద్ద మాట ఎందుకంటున్నంటే ఆమె దీనులకు, అనాథలకు సేవ చేస్తూంది" అంటూవుంటే అందరు ఆసక్తిగా చూస్తూవున్నరు.

కొందరి కెమెరాలు, మరికొందరి వీడియో కెమెరాలు చమక్, చెమక్ మని మెరిశాయి.

"ఈమె నివాసం సాగర్‌లో. సాగర్ డామ్‌లోకి వరదలు వచ్చేది మనకు తెలుసు. ఆ వరదల్లో, జంతువుల కళేబ రాలు, మనుషుల శవాలు కొట్టుకొస్తూ వుంటాయి గద. వాటిని బయటేసి, ఆ తరువాత ఖననం చేయవలసి వుంటుం దిగ. ఆ పనిని ఈమె చేస్తుంది. ఇది సహ నంతో, సేవాభావంతో చేసే సర్వీస్. ఈమె చేస్తున్న సేవను దేవుని సేవే అంటాను" అంటున్నప్పుడు కెమెరాలు మళ్లీ క్లిక్‌మ న్నయి కరతాళధ్వనులు మోగినయి.

గంగ మౌనంగా నిలుచుంది.

"ఈమె జీవితంలో అన్నీ కష్టాలే! అవే వరదల్లో భర్త పోయిండు. ఉన్న ఒక్క కూతురి సేవలు ప్రభువుకు కావల్సివొచ్చి ఆమె మదర్‌థెరిస్సా సేవా సదన్‌లోకి ఎల్లి పోయింది. మనుషుల సేవలే మాధవసేవ కదా? ఆ బిడ్డ అట్లా వెళ్లింది. ఈ తల్లి ఇట్లా సేవలందిస్తూవుంది. ఇంతేకాదు ఇంకా స్త్రీ జాతికి ఈ అమ్మ ఎన్నో సేవలు అందిస్తూవుంది! ఈమెకు ప్రభువు అండ ఉంది కాబట్టే ఇవన్నీ చేయగలుగుతుంది. ఎవ్వరి పైసా ముట్టకుండా తను స్వయంగా తిండి, బట్టను కష్టపడి సంపా దించుకోవటమే కాకుండా ఆదర్శప్రా యంగా బతుకుతూ ఉంది. ఈమెను మనం మనసార అభినందించవల్సివుంది" అంటూ జాన్సన్ చప్పట్లు కొట్టిండు.

ఆ సంతోష సమయంలోనూ గంగ తల నిండా గత కాలపు గాలులే! సాగర్‌లో తాను పెరిగిన గుడిసె, తన చదువు ఆపే యటం. ఆ తరువాత ఎదురైన అనుభ వాలు ఒక్కొక్కటి గుర్తుకు రాసాగినయి. కళ్లలో నీరు ఊరుతూవుంది. పెదవులు వణకుతూ వున్నాయి.

ఈలోపు జాన్సన్ లక్ష రూపాయలు చెక్ ఆమె చేతిలో వుంచి, ఓ పుష్ప గు చ్ఛాన్నీ అందించిండు. 'అనాథల మాత' అని బిరుదు ప్రదానం కూడ చేసిండు. అందరు చప్పట్లతో అభినందించిండ్రు. కార్యక్రమం ముగిసినాక అందరు విందు లో పాల్గొన్నరు. ఆ విందులోనూ అందరి మధ్యా ఆమె గురించిన చర్చలే!

అక్కడికొచ్చిన మహిళా జర్నలిస్టుల ప్రశ్నలకు టూకీగా జవాబులు ఇస్తు కొంత సేపు గడిపింది గంగ. అన్నీ ముగిసినాక అందరు వెళ్లిపోయిండ్రు.

ఆ గదిలో గంగ, జాన్సన్‌లే మిగిలిన్రు!

"మీరు ఎందుకు అంత సిగ్గుగ ఫీలయి తరు. ఉన్నదే మాట్లాడినం. మీరు నోరు విప్పలేదు. గతాన్ని వొదిలేయాలి. వర్తమా నాన్ని అనుభవించాలి. ప్రెస్‌మీట్ పెట్టా లనిపించింది. పెట్టిన అంతే!" అంటు ఆమె కళ్లలోకి చూసాడతను.

ఆమెవి సాద సీదా చూపులు- ఆ చూపు ల్లోను ఓ కొత్త కాంతి వుంది.

"దుర్గను తీసుక రావల్సింది"

"ఇట్లా వుంటదనుకోలేదుగా, ఏదో వ్యాపారపు పని వుండొచ్చు" అనుకున్న.

"మంచి సరదా అమ్మాయి"





గంగ నవ్వి ఊర్కుంది.

"హమ్మయ్య! నవ్వుతున్నరు కదా? "

"ఆమె వెనకా ఓ విషాద గాథ ఉంది. మొదట్లో అస్సలు మాట్లాడేది కాదు. ముఖం మాడ్చుకుని కూర్చునేది. నా కర్థం కాక- ఎందుకు దుర్గ ఏదో పోగొట్టుకున్న దానిలా ఉంటవు- అని అడిగితె మొదట దాటవేసింది. చెప్పేదయితె చెప్పు లేకపోతే పోనీ అన్న. ఒక్కసారె గుడ్లనిండా నీరు నింపుకుని నేలను చూస్తు ఏడ్చేసింది. నేను ఓదార్చి చెప్పకుంటె మాయె, ఏడవకు అన్న. అప్పుడామె కళ్లు తుడుచుకుని, ముక్కు చీదొచ్చి.

'మా ఊర్లో పనులు దొరకక బెజవాడ వైపు చెరుకు నర్కడానికి పోయినం. రెండు మూడు ఏండ్లు ఓ ఆసామి దగ్గర వుండి పనిపాట చేస్తు వస్తున్నం. నేను రోజు అమ్మనాన్నల వెంట పోయేదాన్ని. అప్పుడు నాకు పదమూడు పడినయి. ఊళ్లో వున్నంతవరకు చదివి ఆపి వొచ్చినం. ఒక్క కూతురును కదా బాగా సాదటం వల్లా వళ్లుచేసి పదహారు పది హేడు ఏళ్లలాగ కనిపించేదాన్ని. లంగవోని వేసుకునేదాన్ని.

ఎండాకాలం రోజులు, మేము పనిచే స్తున్న ఆసామి ఇంటికి అమ్మగారి అన్న కొడుకు సెలవులని వచ్చిండు. పేరు శివ. ఇరవైఏళ్లు దాటినోడే. సందు దొర్కిన ప్పుడల్లా నావైపే రెప్పకొట్టకుండా చూస్తు వుండేటోడు. తరువాత పలకరించడం మొదలెట్టిండు. పిలిస్తే పలుకుతాం కదా, అట్టా అట్లా నవ్వుతు నవ్విస్తు వుండేది.

ఓరోజు అందరు చెరుకు నరికే పనిలో వున్నరు. నేను మంచి నీళ్లకని మేముం టున్న కొట్టంలోకి వచ్చిన. ఎప్పుడొచ్చి కూర్చున్నడో ఆ కొట్టంల, వొచ్చి నా వొనీ తోనే నా నోరు మూసి..' అని ఆపి, ఏడ్వ సాగింది. అర్థమైంది నీవు చెప్పక్కరలేదు అంటు ఆమె కన్నీరు తుడిచిన. తర్వాత మళ్లీ చెప్పింది.

అప్పుడు ఈ విషయాన్ని అమ్మకు చెప్పిన, నెత్తి నోరు కొట్టుకొని వెళ్లి ఆసామి భార్యను అడిగింది. ఆమె 'అయ్యింది, అయితే ఏం చేయమంటవు? వాడు సరదా తీర్చుకున్నడేమో అంతే. ఎంత కావాలి చెప్పు? గుట్టుచప్పుడు కాకుండా ఇచ్చేస్త' అందట. అమ్మ నెత్తినోరు కొట్టు కుని దాని బతుకు ఏంకావాలే అందట. 'ఏమైతది ఏంకాదు, లోకం మీద ఎన్ని జర గటం లేదు. మీకు బాధయితే పనిలో నుండి ఎల్లిపోండి, అంతే' అందట. అంతే అమ్మ మారుమాట్లాడకుండ నాన్న దగ్గరికి వెళ్లి అమ్మాయి పెద్ద మనిషై రెండేండ్లు. మనం ఇక్కడేవుంటె దానికి పెళ్లి సంబం ధాలు రావు. మన రాజ్యం పోదాం పద. ఆ లెక్కలు చూసుకుని, రావల్సినయి తీసు కుని పోయి పిల్ల పెండ్లి చేసేద్దాం అని పోరుపెట్టింది. అలా ఊరు చేరినం. జరి గింది కడుపులో దాచుకున్న అమ్మ ఆ విష యంలో నోరు విప్పలేదు. ఊరు చేరిన కొన్ని రోజులకే మా మేనబావతో పెళ్లి జర పించిండ్రు. మా బావ చాలమంచోడు. మా నాన్న పిల్ల ఎదిగివుంది తండ్రి అని కాళ్లు పట్టుకుంటె, కట్నం లేకుంటా చేసు కుండు. కాని ఎందుకో అమ్మగారు,

## కొత్తగాలి...

**ఆకర్షణలన్నీ ప్రేమలుకావు**
**కాయలన్నీ పండ్లుకావు**
**మరి, ప్రేమికులంతా**
**దంపతులు కాలేరు**

– పెరుక రాజు,
నర్సింగాపూర్, కరీంనగర్

ఆనాటినుండి నాకు నవ్వబుద్ధి కావటంలేదు.

మనస్సు విప్పి మాట్లాడలేను అంటు ఆమె మళ్లీ ఏడ్చింది. ఓదార్చుతు, 'నీవు చెయ్యాలని చేసుకున్నది కాదు. ఓ దుర్మార్గుని దురాగతానికి బలైపోయినవు. అంతే అందుకని బతుకంతా కుమిలిపోతూవుంటె ఎట్లా? నలుగురితో నడుపు నీవు, నీ బావ దేవుడంటున్నవు కదా ఇంకేమి? జరిగింది అమ్మకు తెలుసు. నీకు తెలుసు కాని ఏ పరిస్థితిలో నీ భర్తకు చెప్పకు సుమా. అయినా ఐదేండ్లాయె, ఇద్దరు పిల్లలాయె! అన్నీ మర్చిపోయి అందరితో కలివిడిగా వుండు. ముభావంగా వుంటె రానురాను అదో రోగంగ మారిపోయి ముచ్చుదానివై తవు' అని చెప్పిన. అప్పటి నుండి కాస్త మాట ముచ్చట్లలో పాల్గొంటు వుంటది. మంచి తెలివైనదే. వాళ్లఊళ్లో గడవకపోతే సాగర్‌కు వలసవొచ్చింద్రు. ఇక్కడ పనిదొర్కక భర్తను ఓ కిరాణం కొట్లో వుంచి తాను ఇళ్లల్లో పనిచేస్తూ కాలం ఎల్లతీస్తూ, మా ఇంటికొచ్చి పనిలో చేరింది. అప్పటి నుండి నాతో వుంటు చలాకీగా మారి అందరితో కలివిడిగా వుంటు వస్తువుంది. మహిళా మండలిలో చేరింది. పొదుపు సంఘాలలో చేరింది. ఇప్పుడు కారంగిర్ని పెట్టుకునె. నేను కూడ ఆమెను బాగనే చూసుకుంటు వున్న. దగాపడిన చెల్లెలు కథ అది" అంది గంగ ముగిస్తు.

"ఎప్పుడో ఏమో జరిగిందని బతుకంతా బాధలమయం చేసుకుంటె ఎట్లా? మా దేశంలో ఇట్లా వుండదు సుమా? అక్కడ ఈ విషయాలను తేలికగా తీసుకుంటరు. ఎవరిదారి వారిది"

"అది దేశకాల పరిస్థితులను పట్టి ఉంటుంది మరీ" అంది గంగ.

"ఏం పరిస్థితులలో మేడమ్? తెలిసో తెలియకో లేదా విపరీత పరిస్థితులలో ఏదో ఓటి జరిగిపోతది, ఇక దానికి హత్యో, ఆత్మహత్యో పరిష్కారమా? ఒక వ్యక్తి చేసే తప్పుకు ఆ ఒక్కరే కాదు బాధ్యులు. సమస్యలు వస్తూనే ఉంటయి. సూదిని కంటి దగ్గర పెట్టుకుంటే దూలం, దూరంగ పెట్టి చూస్తే సూదే అంటరు. సమస్యను మనం తీసుకునే తీరులోనే వుంటుంది మరి" అన్నడు జాన్‌సన్.

గంగ మాట్లాడలేదు, వేళ్లగోళ్లను చూసుకుంటు 'వేలంతా మెత్తగా గోరేమో పెంకు లాగ' అనుకుంది. అట్లా ఎందుకనుకుంటుందో ఆమెకు తెలియదు, కాని అయినా అనుకుంటు ఉంది అంతే!

"సరె మేడమ్. బాగ రాత్రైంది. మీరు విశ్రాంతి తీసుకోండి" అంటు తన గదివైపు నడిచిండు జాన్‌సన్. గంగకు ఓ పొడవైన ఆవలింత వచ్చి పోయింది.




హైద్రాబాదు నుండి వస్తు, విమలక్కను కలవడానికి రామగిరి వెళ్ళి చూస్తే ఆమె ఇంటికి తాళం వేసివుంది.

వచ్చిన రిక్షలోనే "మిరియాలగూడ రోడ్‌కు పద" అంది గంగ.

"పెట్రోల్ బంక్‌నుండి బిటియస్ వరకు అదే రోడ్డు. ఆ రోడ్డున ఎవరిల్లు" అన్నడు రిక్షా అతను.

'చెప్త పద' అన్నట్టు చూసిందామె.

"నేను ఆ రోడ్డుకే ఉంట ఎవరింటికాని"

"పాత సామాన్లు ఏరుతది ఆమెఇంటికి"

"ఓహో కాళీసీసాల సుశీల ఇంటికా"

"తెలుసా"

"ఎందుకు తెలవదు. వాళ్ళక్క సుజాత ఉన్నప్పుడు, ఊళ్లోని మొగ పక్షులన్నీ ఆ ఇంటి చుట్టే తిరిగేవి"

"ఆమె ఇప్పుడు లేదా"

"లేదు, పోయింది. ఏంమనిషండీ చే యెత్తు మనిషి, చెక్కిన విగ్రహం. తెల్లని రంగు, నల్లని కనుసొగలు. నవ్వితె ముత్యాలు రాలేవి. నడిస్తే భూమి అది రేది. ఆమె గాజులు, మట్టెల చప్పుడుకు ఆ గళ్ళంతా గందరగోళమె అనుకో. ఆ రోజుల్లో కొత్త పోరగాళ్ళందరు ఆమె చుట్టే. ఆమె చెల్లె ఈ సుశీల. కాని సుశీల ఆమెలా కాదు, సంసార పక్షి. పొద్దంతా మొగుడు పెళ్ళాం కష్టపడి పిల్లల చదివిం చుకుంటున్నరు"

"మరి ఆ రొంపి నుండి ఎట్లా తప్పించు కుందో"

"అక్క బతుకు చూసి, ఆ వృత్తిని అస హ్యించుకుని పెళ్ళి చేసుకుంది. అందరి లాగ ఆమె బతుకుతుంది"

రిక్షా మిరియాలగూడ రోడ్డెక్కి సుశీల ఇంటి ముందాగింది.

"ఇదేనమ్మ కాళి సీసాల సుశీల ఇల్లు" అంటు ఆపిండు.

గంగ ఇచ్చిన ఐద్రూపాయల నోటు తీసుకుని, అతను కదిలిండు.

సుశీలది రెండు గదుల పెంకుటిల్లు, ముందు వరండా, మూడు పక్కల ప్రహరీ గోడ. రోడ్డు వైపు బయటి దర్వాజ తలుపు బార్ల తీసే వుంది. లోపల పాత సామాను, ఖాళీ సీసాల బస్తాలు, వరం డాలో పాతపేపర్ల కట్టలు కనిపిస్తున్నాయి.

దర్వాజ దగ్గర్కి వెళ్లి గొళ్లెం చప్పుడు చేసింది గంగ.

సుశీల తడి చేతులను కొంగుకు అద్దు కుంటు వచ్చి, నవ్వుతు లోపలికి రాండమ్మ అన్నట్టు కళ్లతోనే పిలిచింది. సుశీలకు చదువు అంతగా లేదు కాని జనం మధ్యన తిరగడం వల్లా మాట మర్యాదలను నేర్చు కుని ఎవరితో ఎలా మెలగాలో తెలుసు కుంది. అందుకే ఒక రోజు ఎంఎల్ఏ గారి ఇంట్లో చూసింది గుర్తుకు తెచ్చుకుని, పలకరింపులో మర్యాదను కనబర్చుతు వెళ్లి వరండాలో కుర్చీవేసి కూర్చోబెట్టింది.

గంగ ఓ మాదిరి దగ్గరి తనంతో కదిలి ప్రేమగా చూస్తువుంది.

సుశీల లోపలికి వెళ్లి, మంచినీళ్ళను కూతురితో పంపి, తాను టీ పెట్టింది.

ఈలోపు మంచినీళ్ళ గ్లాసును అందుకు ని అమ్మాయిని మాటల్లో దించింది గంగ.

"నీ పేరు"

"పల్లవి"

"ఏం, చదువుతున్నవు"

"నర్స్ ట్రెయినింగ్‌లో ఉన్నాను"

"అప్పుడే నర్స్ ట్రెయినింగా, ఇంక చద వాల్సింది" అంది గంగ.

"ఉద్యోగం తొందరగా వస్తదని" అని ఆగి, గోళ్ళు గిల్లుతు నిల్చుందాపిల్ల

సుశీల నవ్వుతు టీ గ్లాసులతో వచ్చి, గంగకోటిచ్చి, తానొకటి పట్టుకుని స్టూల్‌ను గుంజుకుని గంగకు ఎదురుగా కూర్చుంది.

"మీరు గంగ కదమ్మ"

అవునన్నట్టు తలాడించింది.

"విమలమ్మగారే ఓ రోజు చెప్పింది. మీరు పేదమహిళలకు లోన్లు ఇప్పించి కారంపొడి గిర్నీలు పెట్టిస్తున్నరని"

అవునన్నట్టు తటాడించింది.

"మరి బాగ నడుస్తున్నయామ్మా!"

"అనుకున్నదానికంటే ఎక్కువే"

"నేనూ పెట్టాలి"

"ఈ వ్యాపారం బాగలేదా"

"బాగానే ఉంది. పిల్లలున్నరు గదమ్మ"

"సరె పెట్టండి. ఈ టౌన్‌లో కూడ నాలుగున్నాయి. ఓసారెళ్ళి చూడండి"

సరె అన్నట్లు తల వూపిందామె.

"మీ ఇంటి పేరు" అడిగింది గంగ.

"గాజుల" అంది

"మా ఇంటి పేరు అదే"

"అట్లనా, అయితే వెనకట ఒకే వంశం వాళ్లమన్న మాట" అంది దగ్గరితనాన్ని ప్రదర్శిస్తూ.

"మొదటి నుండి ఈ పాత సామానుల బేరమేనా"

"కాదు ఇది పదేళ్ళకింద పెట్టుకుంది"

"ఈ ఊళ్ళో మా అక్క సుజాత ఉండే. ఏంచక్కని మనిషి? ఆరడుగుల ఎత్తు, చెక్కిన బొమ్మలాగుండి, ఆకరికి రోగాల కుప్పయి కన్నుమూసింది"

**కొత్తగాలి...**

**కాకులుండబట్టే**
**కోకిలలు బతుకుతున్నాయి**
**పల్లెలుండబట్టే**
**బస్తీలు వెలుగుతున్నాయి**

– త్రిపాల్,

పెద్దచెల్మెడ, మెదక్ జిల్లా

సుశీల బిడ్డ "అమ్మ నేను వెళ్తొస్త" అని బయటకు నడిచింది.

"మరి నిన్ను, మీ అక్కను దింపినట్టు కులవృత్తిలో దింపలేదా? "

"దింపాలని చూసింద్రు. మా అక్క బాధలను చూస్తు, చూస్తూ ఎట్ల దిగుత. దిగలేదు. అప్పుడు మనోనికి ఇచ్చి పెండ్లి చేసి పది పందులను ఇస్తే వాటినీ పెంపు చేసుకుంటూ కూలీనాలికి పోయేది. పొద్దున్నే వాటి పెంటను ఏరుకొచ్చేది. మొత్తం మీద బాగానే కాలం గడుస్తూ వచ్చింది. ఏదో మెదడువాపు రోగాలని వాటినీ పెంచనీయనైరి. ఇక పాతసామానులు, పాత సీసాలు ఏరుకొచ్చి అమ్ముడు మెదలు పెట్టినం. అక్కడి నుండి బతుకు మారిపోయింది. వేలు చూసినం. పిల్లల్ని చదవించడం, మంచిబట్ట, ఇల్లు పొల్లు నలుగురిలో కల్సిపోయినం" అంది సుశీల.

"చేసేది పాత సామాను బేరమైన కొత్త బతుకునిచ్చిందన్నమాట. నేననేది అదే చేతనైన పనిచేసుకోవాలని, మన కులస్తులకే కాదు వేరె మహిళలకు చెపుతువస్తున్న. చిన్న చిన్న వ్యాపారాలు కావచ్చు అవి సంఘంలో గౌరవాన్ని తెచ్చిపెడతాయి. నీ గురించి విమలక్క ఆ రోజు చెప్పింది. అందుకే నీతో మాట్లాడడానికి వచ్చిన" అంది గంగ.

"వ్యాపారం మనిషిని, మనిషి బతుకుని మార్చేస్తుందమ్మ. మొదట్లో మా ఇంటిల్లిపాది ఈ పాత సామానుల కోసం తిరిగేది. పిల్లలు బడి టైంకాగానే తెచ్చింది ఓ చోటవేసి బడికెళ్ళేవారు. మొదట పందుల పెంటకు తిరిగినపుడు పెంటకుప్పల దగ్గర పడి వుండే ప్లాస్టిక్ సామానులను చూసేదిగా. ఆ తరువాత చాల ఇండ్లల్లో కాళి సీసాలు దొరికేది. అట్లా అట్లా ఈ వ్యాపారంలో దిగినం. ఈలోపు ఊళ్ళో స్కూటర్లు పెరిగే, మోటర్లు పెరిగే, నట్లు బోల్ట్సు, ఇనుపముక్కలు ఒక్కటేమిటి.. ఇరిగినయి, పగిలినయి.. మొదట నెలకో లారీ. ఆ తర్వాత వారానికో లారీ పంపితిమి. పదేండ్లకింద రైల్ స్టేషన్ పడే! ఇగ కాలి కాటన్స్ చెప్పనక్కరలేదు. ఇప్పుడు రెండు రోజులకో లారీ నింపుతున్నం. ఇగ మా బతుకులో వచ్చిన మార్పు, మమ్ముల చూసి చుట్ట పక్కాలు కూడ ఇదే పని మొదలు పెట్టిరి" అని ముగించింది సుశీల.

"నా ప్రయత్నమంత ఈ మార్పు కోసమే. మన కులంవాళ్ళు ఆ వృత్తిని మర్చిపోవాలి. మనం పదిమందిలో తలెత్తుకొని తిరగాలి. రోజులు మారుతు

న్నాయి. మారుతున్న కాలంతో మనం మారాలి. అందుకోసం పిల్లలను బాగ చదివించాలి, మగ పిల్లలు ఏం చదువుతున్నరు? "

"పెద్దోడు టీచర్"

"ఇంకా చదివించవల్సింది"

"చిన్నోడు ఇంకా చదువుతున్నడు"

"ఏం చదువుతున్నాడు? "

"ఇంజనీర్"

"ఆడపిల్ల ఒక్కతేనా? "

"ఒక్కతే. నర్స్ ట్రైనింగ్ కాగానే పెళ్ళి చేసేస్తం"

"అప్పుడే? "

"ఇప్పటికి ఈ బతుకులు చాలమ్మ"

"ఎప్పుడన్న సాగరొస్తే మా ఇంటికి రా అక్క" అంది గంగ.

సరె అన్నట్టు తలూపింది సుశీల.

"మీ ఆయనేడి, ఆయన్ను చూడాలి"

"లారీ వెంట హైద్రాబాద్ పోయిండు"

"మరీ నేనొస్తా" అంటు లేచింది గంగ. సుశీల దర్వాజ వరకు సాగనంపింది. పోతుపోతు చేతిలో చేయి వుంచుకుంటు నడిచారిద్దరూ.

గంగ బస్‌డిపోకెళ్ళి, సాగర్ బస్సెక్కి కూర్చొంది. బస్సు కదిలింది సుబాస్ బొమ్మ దగ్గర్కి పోకముందే డ్రైవర్ పక్కకు ఆపుకున్నాడు. ఎదురుగా శవంతో ఊరేగింపు. కండక్టర్ దిగి, ఊరేగింపు దగ్గరికి వెళ్ళి వివరాలతో వచ్చి "పద రామగిరి నుండి మళ్ళీ గడియారం దగ్గర రోడ్డెక్కుదాం. కదిలేటట్టు లేదు" అన్నడు.

"ఇంతకు ఎవరు ఏంది" డ్రైవర్ ప్రశ్న.

"మర్రిగూడెం వైపు ఎన్‌కౌంటర్ జరిగిందట. ఓ చిన్న పాపతోసహా నలుగురైదుగురిని కాల్చి చంపిండ్రట. అందులో దివాకర్ అనే ఆయన్ను ఇక్కడికి పోస్టుమార్టం కోసం తీసుకొచ్చిండ్రట. పోస్టుమార్టం తరువాత ఆయన శవాన్ని ఊరేగింపుగా తీసుకెళుతున్నరు. గద్దర్, సినిమా నారాయణమూర్తివున్నారు. గద్దర్ పాటలు పాడుతున్నడు. చనిపోయినాయన గతంలో జననాట్యమండలిలో పనిచేసిండట. అదీ సంగతి' ' అని ముగించి బస్సును రివర్స్ తీసుకోవడానికి సంకేతాలిచ్చాడు కండక్టర్.

బస్సు రామగిరివైపు పరిగెత్తుతు వుంది. బస్సులో జనం రకరకాల తర్జన భర్జనలు చేస్తూవున్నరు. గంగ మౌనంగా చనిపోయిన వాళ్ళ గురించి ఆలోచిస్తూవుంది. చనిపోయిన వాళ్ళలో ఓ పాప వుండడం ఆమెలోని తల్లి మనస్సును కదిలించింది.

'తుపాకులను పడుతున్నది ఎవరు? '

'పేదలు బలహీనవర్గాల వాళ్ళే'

'చనిపోయేది? '

'వాళ్ళే'

'ఎందుకట? '

'అదంతే'

'ఏది ఏమన్న గాని, చంపటం చావటం సరియైంది కాదేమో'

ఈ లోపు బస్సు పెద్ద గడియారం దగ్గర మలుపు మళ్ళీ దేవరకొండ రోడ్డున పరిగెడుతూ వుంది. అంబేద్కర్ బొమ్మను దాటుతున్నప్పుడు గంగకు అంబేద్కర్ స్త్రీజాతి మేలుకోసం ప్రవేశపెట్టిన 'హిందు కోడ్ బిల్', దాన్ని వ్యతిరేకించినవాళ్ళు గుర్తొచ్చారు. ఒకవేళ ఆ బిల్‌ను అప్పుడే ప్రవేశపెడితె ఈ పాటికి ఎంత మార్పు వచ్చుండేదో అనుకుంది. అంతేకాదు బడుగు వర్గాలు ఈ రోజు ఓ మోస్తరుగనైన బతుకుతున్నారంటే ఆ మహానుభావుడు తల రాతలు మార్చి రాసినందుకే కదా? అనుకుంటూ వుంది. విగ్రహం కింది దిమ్మెకు 'బోధించు, సమీకరించు, వ్యతిరేకించు' అన్న పదాలు కనిపించినయి. దానిని అనుసరిస్తే ఈ చావులుండవు కదా అనుకుంది.

బస్సు నడుస్తునే వుంది.




సాగర్‌లోని మహిళామండలి ఆఫీసు ముందు మీడియా వాళ్లతో వచ్చిన జాన్‌సన్ కారు ఆగింది. లోపల మీటింగ్ హాల్లో జరగనున్న ప్రెస్‌మీట్ కోసం అంతా సిద్ధమవుతున్నరు. టేబిల్ మీద వివిధ ఛానెళ్ల మైకులున్నయి.

అంతకుముందే జాన్‌సన్ ఫోన్‌కాల్‌ను అనుసరించి సాదాసీదాగా తయారై వొచ్చి కూర్చుంది గంగ.

జాన్‌సన్ విషయాన్ని వివరిస్తు "ఈ రోజు మనమంతా గంగగారిని గొప్పగా అభినందిస్తున్నాం. ఎందుకంటే మేడమ్ చేస్తున్న సేవలకు ఐక్యరాజ్య సమితివాళ్లు 'ఉత్తమ సమాజ సేవిక' అవార్డును ప్రకటించడం నిజంగా ఎంతో ఘనం! ఒక సామాన్య తెలుగుమహిళ సాధించిన ఘన విజయం ఇది. ఈ విషయం తెల్సినపుడు, నేను చాల మురిసిపోయిన. మేడమ్ మాత్రం గుంభనంగా వుండిపోయింది.." అంటు ఓసారి ఆమెవైపు చూసాడు.

"నిండు కుండ తొణకదంటే ఇదే. ఆమెతోపాటు రిక్షా రాములుగార్కి ఓ టెంపో రాబోతుంది. ఇకనుండి శవాలను తరలించడానికి దాన్ని వినియోగిస్తారు. అట్లాగే గంగగారికి సహకరిస్తున్న బాలలకు చదువుకోవడానికి స్కాలర్‌షిప్‌లు ప్రకటించారు. ఇదంతా మేడమ్ సాధించిన ఘనతే! ఆమెవల్లే ఈ ఊరిపేరు జండాపైకెక్కింది. మన మధ్య నివాసముంటున్న ఓ పేదమహిళ సేవలను గుర్తించి, అవార్డును ప్రకటించడం బంగారానికి వన్నె అద్దినట్టుందని భావిస్తూ ముగిస్తున్నాను. మేడమ్‌కు మరోసారి అభినందనలు.. మీ అందర్కి వందనాలు"

అందరు కరతాళ ధ్వనులతో అభినందనలు తెలిపారు. గంగ కుర్చీలో నుండి లేచి అందర్కి చేతులు జోడించి తన అభివాదం తెల్పుకుని కూర్చుంది.

జాన్‌సన్ ఆమె చేతుల్లో పుష్పగుచ్ఛాన్ని వుంచిండు.

ట్రేలో కూల్‌డ్రింక్స్‌ను దుర్గ అందరికీ అందిస్తూ వుంది.

ఓ పత్రికా విలేఖరి గంగకు అభినందనలు చెప్పి, ఆమెను మాటల్లోకి దింపాడు. మీడియా వాళ్లందరు పెన్నులను నడిపిస్తున్నరు. టీవి చానల్స్ మైకులు ఎలాగో టేబుల్ మీద వుండనేవున్నవి.

"మనదేశంలో మనిషిని చూడగానే మరో మనిషి ముఖం చిట్లించుకోవటం కొందరిలో చూస్తం. మరికొందరిలో మౌనాన్ని చూస్తాం. ఎదుటి మనిషిని ప్రేమించేవాళ్లను తక్కువ చూస్తం. పెంపుడు జంతువులకు ఇచ్చేంత ప్రేమను తోటి మనిషికివ్వక పోవడం విడ్డూరమే కదా? కాని ఈ మేడమ్ అనాథ శవాలకు అంత్యక్రియలు చేస్తూన్నారు. అదెట్ల సాధ్యమో ఆమె మాటల్లోనే విందాం" అన్నాడా విలేకరి గంగవైపు మళ్లి.

ప్ర: గంగగారు, మీరేం చదివారు?

జ: ప్రాథమిక విద్య ఇక్కడే సాగింది. పేదరికంవల్ల చదువు ఆపేయవలసొచ్చింది. అంతేకాకుండా రొట్టె, బట్టకోసం తల్లిదండ్రులు కులవృత్తిలోకి దించ చూసారు. ఆ వృత్తి నాకిష్టం లేదు.

ప్ర: మనదేశంలో కులం ముందు పుట్టి తరువాతనే అన్నీ! అందుకని అట్లా అని

వుంటరు?

జ: ఎట్లన్న నేను పుట్టిన కులం అంత గౌరవంగా చూడబడేది కాదు కనుక నేను కాదన్నాను.

ప్ర: క్షమించాలి ఇంతకి మీదేకులం?

జ: సంచారకులం. మాది కూరలో కరి వేపాకు బతుకు.

ప్ర: మీకు ఈ అనాథల సేవారంగంలోకి రావాలని ఎట్లా అనిపించింది?

జ: మా ఊళ్లో ఓ సూర్యోదయాన బస్‌స్టాండులో ఓ యువజంట ఆత్మహత్య చేసుకుని చచ్చి పడివున్నరు. జనం చుట్టూర చేరి నిట్టూర్పులు వొదులుతున్నరు. నేను చూసి అయ్యో అంటు ఏడ్చిన. పోలీసులొచ్చి వాళ్ళ మధ్య పడివున్న ఉత్తరం చదివారు. 'మా చావుకు ఎవరు కారకులు కారు. అసలు ఈ లోకంలో బతికున్నప్పుడు ప్రేమను ఒప్పుకోని మీరు కనీసం చనిపోయినంకనేనా మమ్మల్నిద్దర్నీ ఒక్కచోటే ఖననం చేయించండి చాలు' అని రాశారు. అది చూడగానే బోరున ఏడిచాను. పోలీసుల అనుమతితో పోస్టుమార్టం తరువాత దగ్గరుండి ఆ మృత దేహాలను ఒకేచోట ఖననం చేయించాను. అప్పటి నుండి అనాథ శవాల ఖననం చేసుకుంటూ వచ్చాను. పోలీసులు, ఊరివాళ్లు సహకరిస్తూ వచ్చిండ్రు. నాటి నుండి నేటివరకు ఆ పని కొనసాగిస్తున్నాను. ఈ విషయంలో రిక్షారాములు, బడి మర్చిన పిల్లల సాయం ఎప్పుడు ఉంటూనే వున్నది. వాళ్లకు కృతజ్ఞతలు చెప్పుకుంటున్న. బడి మరచినవాళ్లను మళ్లీ బడిబాటన నడిపించాలనుకుంటున్నాను.

ప్ర: ఇప్పుడు ఆర్థిక పరిస్థితి మెరుగైన ట్టుంది? కారణం వివరించగలరా?

జ: స్త్రీకి సంపాదన లేక బలహీనురాలుగ మారిపోతుంది. ఆమెకు ఆలోచన లున్నా ఆర్థికంగా చేయూత కావాలి. అందుకు బ్యాంకులను ఆశ్రయించినం. ఈ జీగా తయారుచేసే కాకపొడి ఉత్పత్తిని ప్రారంభించినం. పంపిణి మొదలు పెట్టినం. అది విజయవంతమైంది. ఇప్పుడది అంతర్జాతీయంగ ఎగుమతి అవుతు వుంది. దాంతో మహిళ సాధికారత సాధ్యమైంది. దాన్ని చూసి మరొక కుటీర పరిశ్రమలను పెట్టుకుంటు వున్నరు. ఒకప్పుడు వొళ్లమ్ముకున్న కొందరు ఇప్పుడు మార్కెట్‌లో వస్తువులు అమ్ముతున్నరు. శ్రమిస్తే బట్ట, పొట్టకు కరువుండదు.

ప్ర: మగాడి వెనక ఓ స్త్రీ వుంటది అంటారు. మరీ మీ విజయం వెనక?

జ: నా వెనక ఒకరున్నరు. ఆయన సలహా, సహకారంతోనే ఈ పనులు చేస్తు వస్తున్నాను. ఆయనే మిత్రులు జాన్‌సన్. వ్యాపారంలోనే కాదు, ఇతర విషయాలలో కూడా మంచి సలహాదారు. నాకు ఈ అవార్డు రావటానికి వారే కారకులు.

ప్ర: సాదాసీదాగా జీవిస్తున్న మీరు ఇంతటి ప్రతిభను ఎలా సాధించగలిగారో వివరిస్తారా? మీకు ఆదర్శం ఎవరు?

జ: పుస్తకాలు చదువుతాను. జ్ఞానం పెంచుకున్నకొద్ది పెరుగుతుందే తప్పా నలుగురికి పంచినా అది తరగదు. పోతే నేను గొప్పదాన్ని అవునో కాదో నాకు తెలువదు. కాని నాకో గొప్పవ్యక్తి ఆదర్శ

### కొత్తగాలి...

**పరీక్షలు**
**అయిపోయాయి**
**పుస్తకాలు**
**కాళ్లని చుట్టేస్తున్నాయి**

– *హర్షవర్ధన్, సికింద్రాబాద్*

ముంది. ఆమే మదర్ థెరిస్సా. మానవజాతికి అంత సేవ ఆమె చేయంగ మన పరిధిలో మనమెందుకు చేయకూడదనిపించింది. అందుకే నా వొక్కగానొక్క కూతురు అదే మిషన్‌లో చేరుతున్నా నేను కాదనలేకపోయిన.

ప్ర: మీరొచ్చిన కులానికి, చేయబోయే మేలు ఏమిటో చెప్పగలరా?

జ: ముందు మా కులంవాళ్లలో మార్పు రావాలి. శ్రమిస్తాం. శ్రమ ఫలితాన్నే తింటాం అనే పద్ధతుల్లో బతుకు కొనసాగించాలి. సమాజంలోని నలుగురితో నడవాలి. వాళ్లు ఆ వృత్తిని మాని ప్రభుత్వం ప్రకటిస్తున్న పునరావాసాన్ని అందుకోవాలంతే - అంటూ ముగించిందామె.

"మేడమ్‌కు అవార్డు రావటంలో నేను చేసిందల్లా ఏంలేదు. ఆమె ప్రొఫైల్‌తో పాటు ప్రింట్ మీడియాలో వచ్చిన క్లిప్పింగ్స్ జతచేసి ఐరాసకు పంపానంతె" అంటు చేతులు జోడించి నవ్వుతూ చుట్టు చూసాడు జాన్సన్. అందరి కరతాళ ధ్వనులతో ఆనాటి సమ్మేళనం ముగిసింది. జాన్‌సన్ తన కారును స్టార్ట్ చేసి టూరిస్ట్ భవన్‌వైపు వెళుతువుంటే, అందరి వెహికల్స్ ఆయనను అనుసరించినయి.

అప్పటికి లంచ్‌టైం అయ్యింది. జాన్‌సన్ ముందే ఆర్డర్ ఇచ్చి, తనదైన శైలిలో అక్కడ విందు ఏర్పాటు చేసాడు. ఆ విందులో రిక్షారాములూ వున్నడు.

మహిళలకోసం అక్కడికే వంటకాలను పంపించగ కార్యాలయంలోనే, దుర్గ మరి కొందరు మహిళలు వడ్డనను చూసుకున్నారు. వాళ్లలో గంగ తల్లి, అక్కగూడ వున్నరు. నాటి వార్త విశేషాలు తెల్లారి పత్రికల్లో, ఛానల్లలోనూ వచ్చి దేశమంతా తెల్సిపోయింది.

మరునాడు ఢిల్లీనుంచి అభినందన ఫోను వచ్చింది. మోతి గంగ ఇష్టాగోష్ఠిగా మాట్లాడుకున్నరు. ముగింపులో 'తొందరలో ఢిల్లీకి పిలిపిస్తాను' అంది మోతి.

"సాయంత్రం జాన్‌సన్ హైద్రాబాద్ వెళ్ళడానికి ముందు గంగను, జమునను, దుర్గను ఇంటి దగ్గర దింపాడు. లోపలికి పోతువున్న గంగతో "మేడం వెళ్లొస్త" అంటు కారును మలుపుతుంటే "పోదురు గాని రండి" అంది గంగ.

"రండి రండి. నేనూ వస్తగా.. గిర్ని దగ్గర నన్ను దింపిపోరు? " అంది జమున.

"ఓకే తప్పకుండ" అంటు గేటులోకి అతను వస్తూంటే "అంత అర్జెంటుగా వెళ్ళాలా? " అంది గంగ.

అతను నవ్వాడు.

దుర్గ, జమున ముందు నడవగా ఆమె అతని పక్కమ్మటే నడుస్తూ "నాకీరోజు చాలా ఆనందంగా వుంది. వుండిపోగూడదు? " అంది అతని విశాలమైన చాతి వైపు చూస్తూ.

"మీరు పదండి" అంటూ కారు దగ్గరికెళ్లి లోపలవున్న షాంపేన్ బాటిల్ తెచ్చి ఆమెను గడపలోనే నిల్చోబెట్టి, బాటిల్‌ను ఓపెన్ చేసి పొంగించి "రండి" అంటు లోనికి ఆహ్వానించాడు.

ఆమె తలచుట్టు కొంగు కప్పుకుని లోపలికి నడవగా ప్రేమగా దగ్గర్కి తీసుకుని తల నిమిరాడు. దుర్గ, జమున వాళ్ళిద్దరిని తృప్తిగా చూస్తూ నిలుచుండిపోయారు.

"చూడు గంగా కులం అనే పుట్టుమచ్చ తోనే ప్రతిఒక్కరూ పుడతారు. నిజమే, అది మారదన్నావు. కాని మనిషి రంగునే మార్చేస్తున్న కాలం ఇది. మచ్చను మార్చడం పెద్ద ఇదేమి కాదు. దానికి కొంత టైం కావాలంతే!" అన్నాడు, ఆమె కళ్లలోకి ప్రేమగా చూస్తూ.

గంగ పెదాలమీద నవ్వు పూసింది.

జాన్‌సన్ కళ్లు మెరిసాయి! Ⓒ



# సామాజిక చైతన్య దీప్తి

నరేశ్ మెహతా

**జీవితాన్నే ప్రధాన వస్తువుగా స్వీకరించి, సామాజిక స్పృహను నిబిడీకరించి, చైతన్యదీప్తిని పరిఢవిల్లజేస్తూ అద్భుత కవితలు, నవలలు వెలయించిన నరేశ్ మెహతా భారతీయ సాహితీవేత్తల్లో అగ్రపంక్తిలో నిలుస్తారు. వస్తుస్వీకరణలో స్వీయ పార్శ్వంకంటే సృజనశీలతకే సమున్నత స్థానమిచ్చిన గొప్ప వినయ సంపన్నుడాయన. సంగీతంలో విశేష పాండితీగరిమగల మేధావి ఆయన. 1972-91 మధ్య ఆయన సృజించిన సాహిత్యాన్ని ఉత్కృష్టమైనదిగా పరిగణించి భారతీయ జ్ఞానపీఠ సంస్థ 1992లో పురస్కారాన్ని ప్రదానం చేసింది.**

నరేశ్ మెహతా 1922 ఫిబ్రవరి 15న మధ్య ప్రదేశ్‌లోని మాల్వా ప్రాంతం షాజాపూర్‌లో శుక్లా కుటుంబంలో జన్మించారు. తండ్రి పేరు బీహారీలాల్ శుక్లా. నరేశ్ జన్మనామం పూర్ణ శంకర్ శుక్లా. నరసింహగఢ్ సంస్థానాధీశ్వ రులు శుక్లా కుటుంబంపై గౌరవంతో నరేశ్ మెహతా అని నామకరణం చేశారు. చిన్నప్పుడే తల్లిదండ్రులను కోల్పోయిన మెహతా పెద తండ్రి పెంపకంలో పెరిగాడు. సంపన్నులు కానందున ఆయన బాల్యం ఇబ్బందులతోనే గడచింది. అయితే విద్యాబుద్ధులు బాగా అల వడ్డాయి. సంప్రదాయంపై ప్రత్యేకాభిరుచితో వైదిక సాహిత్యం అధ్యయనం చేశాడు. సాహి త్యాభిలాష ఏర్పడింది. కాశీనగరంలోని బనా రస్ హిందూ విశ్వవిద్యాలయంలో హిందీ సాహిత్యం అధ్యయనాంశంగా ఎం.ఏ. పట్టా అందుకున్నాడు. కేశవప్రసాద్ మిశ్రా,




విశ్వనాథ ప్రసాద్ వంటి ప్రసిద్ధ గురువులు లభించడం మెహతా అదృష్టమని చెప్పాలి. విద్యార్థిగా స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నాడు. వామపక్ష భావాలవైపు ఆకర్షితుడై కొంతకాలం కమ్యూనిస్టు పార్టీలో క్రియాశీలంగా పనిచే

శాడు. కార్మికోద్యమాల్లో ప్రత్యేక పాత్ర వహించాడు. కార్మిక సంఘం పక్షాన ఒక హిందీ వారపత్రికకు సంపాదకుడిగా పనిచేశాడు. ఆకాశవాణిలో ఉద్యోగిగా ఉన్నప్పుడు తన సృజనాత్మక ప్రతిభను ఆవిష్కరించగలిగాడు. సుప్రసిద్ధకవి శ్రీకాంత్‌వర్మతోపాటు 'కృతి' అనే సాహిత్య పత్రికకు సంపాదకత్వ బాధ్యతలు నిర్వహించాడు. ఉజ్జయినిలోని విక్రమ్ విశ్వవిద్యాలయం 'ప్రేమచంద్ సృజన పీఠం' సంచాలకుడిగా కూడా పనిచేశాడు. సాహితీ వ్యాసంగంపై విశేషాసక్తితో ఇతరోద్యోగాల పట్ల దృష్టి పెట్టకుండా రచనలకే అంకితమయ్యాడు. పురాణాలు, కావ్యాలు, శాస్త్రాలు దీక్షతో చదివాడు. అప్పట్లో వాడుకలో ఉన్న శైలికి భిన్నంగా మెహతా తనదైన విలక్షణ కావ్యభాషను, శైలిని రూపొందించుకున్నాడు. వస్తువరణంలో సైతం ఆయనలోని ప్రత్యేకత గోచరిస్తుంది.

మెహతా 1936లో కవిత్వం రాయడం ఆరంభించారు. తొలిరచన 'దూసరా సప్తక్' 1951లో వెలువడింది. దీంతో సాహితీలోకంలో ఉదయోన్ముఖ కవిగా ఆవిర్భవించి విశిష్ట స్థానాన్ని చేజిక్కించుకున్నారు. 1957లో తొలి కవితా సంపుటి 'బన్‌పాఖీసునో' హిందీ కవితా క్షేత్రంలో నూతన బీజాలు నాటింది. అభివ్యక్తిలో కొత్తపుంతలు తొక్కింది. 1961నాటి 'బోల్‌నేదో చోడ్‌కో'లో ప్రతీకాత్మకత వైభవం ప్రదర్శించారు. 'ఉత్సవా' గానయోగ్య రామణీయకత నింపుకున్న కృతి. కవిత్వాన్నే వస్తువుగా స్వీకరించిన సంపుటి 'అరణ్యా'. కవిత పాఠకుడికి మూడోకన్ను ప్రసాదిస్తుందంటారాయన. 'తాదాత్మ్య' అనే కవితలో ఆయన రాసిన పంక్తులు 'జబ్‌భీ మై/ ఫూల్ నదీయా ఆకాశ్‌పర్ కవితా లిఖ్‌తాహూ/తో వహ్ మా నవీయ ప్రకరణ్‌హీ హోతాహై'. ఖండకావ్యం 'సంశయ్‌కీ ఏక్‌రాత్' రాముణ్ని మానవుడిగా చిత్రిస్తూ, ఆయన అంతరంగంలోని మధనాన్ని ప్రతిభాన్వితంగా చూపారు. మరో ఖండకావ్యం 'మహా ప్రస్థాన్'లో ధర్మరాజును ముక్తికి ప్రతీకగా నిలిపారు. ఒక స్త్రీ వేదనామయ జీవితం, ఆమె ఆధ్యాత్మిక శేముషికి 'శబరి' ఖండకావ్యం అద్దం పడుతుంది. 'తుమ్ మేరా మౌన్ హో', 'పిచ్‌లే దినోం నంగే పైరోం', 'దేఖ్‌నా ఏక్‌దిన్' మొదలైన తొమ్మిది కవితా సంపుటాలు, ఐదు ఖండకావ్యాలను మెహతా రచించారు. ఆయన కవితా వైదుష్యానికి మచ్చుగా 'కోయీ హై' కవిత నుంచి కొన్ని పంక్తులు: నేను చిన్న

# చతుర ప్రవేశిక

## జులై చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాయగలరేమో చూడండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. జమున చెల్లెలు ఎవరు?
జ :
2. గంగ–నాయుడుల కూతురు?
జ :
3. గంగను ఇంటికి చేర్చిన పోలీసు ఎవరు?
జ :
4. ఢిల్లీ చేరిన గంగ ఆత్మీయురాలు?
జ :
5. కాకపాడికి గిరాకీ కల్పించిన విదేశీ?
జ :
6. నరేశ్ మెహతాకు జ్ఞానపీఠం వచ్చిందెప్పుడు?
జ :
7. స్వామర్ల శత్రువు ఏది?
జ :
8. 'ప్రబుద్ధాంధ్ర' పత్రికను నడిపినదెవరు?
జ :
9. సెకెండ్ బిల్ ఆఫ్ రైట్స్ కల్పించాలన్నది?
జ :
10. మాడపాటి షష్టిపూర్తి ఎప్పుడు జరిగింది?
జ :

పంపినవారి పేరు: ----------------

------------------వయసు (   )

చిరునామా: --------------------

--------------------------

--------------------------

పిన్‌కోడ్:          ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 082

చివరి తేదీ 18

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

విపుల విన్నోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.

యిల్లు కట్టుకున్నాను/ అతనేమో రాజమార్గం నిర్మించాడు/ నామ ఫలకంలో నేను ఇరుక్కుపోయాను/ అతను వీతరాగిగా ఏకాకిగా సాగిపోతున్నాడు/ సొంత యింటిపై మమకారం వదులుకుని/ రాజమార్గంలో వెళ్ళేందుకు ఎవరైనా సిద్ధంగా వున్నారా? / రాజమార్గానికి యివ్వవలసింది/ పేరుకాదు అంకిత భావం', 'ధూమకేతు ఏక్ శ్రుతి', 'డూబ్తే మస్తూల్', 'ఉత్తర కథా' (రెండు భాగాలు) నవలల్లో మానవతను, ప్రత్యేకించి స్త్రీల కష్టాలను అద్భుత శిల్పంతో వివరించారు.

'యహ్‌పథ్ బంధ్ థా'కు శ్రీధర్, సరో దంపతుల జీవన సమరం ఇతివృత్తం. 1963నాటి ఈ నవలలో స్వరాజ్య పోరాటం విలువలు, ఆదర్శాలు నేడు లుప్తమయ్యాయని రచయిత వ్యక్తం చేశారు. మెహతా నవలల్లో మకుటాయమానమైనది 'ఉత్తర కథా.' శివశంకరాచార్య యిందులోని ముఖ్యపాత్ర. బాధలన్నింటికీ కోరికలే కారణమని అతని భావన. గాయత్రి, దుర్గ, వసుంధర వంటి పాత్రల చిత్రణలో మెహతా కల్పనా ప్రాభవం వెల్లడవుతుంది. కథారచనలో కూడా మెహతా సిద్ధహస్తుడు. తథాపి, ఏక్ సంపత్తి మహిళా, జల్సాఘర్ అనే మూడు కథాసంపుటాలు, 'సుబహ్ కే గంటే', 'ఖండిత యాత్రాయే' మొదలైన నాలుగు నాటకాలు, 'సాధూన చలె జవాత్' అనే యాత్రా చరిత్ర, 'ఆధిరాత్ కోయీ దస్తక్ దెరహ హై' తోపాటు మరో నాలుగు గ్రంథాలు రాశారు.

నరేశ్ మెహతా కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు, సరస్వతీ సమ్మాన్, మధ్యప్రదేశ్ శిఖర్ సమ్మాన్, ఉత్తరప్రదేశ్ హిందీ సంస్థాన్‌వారి భారత భారతీ సమ్మాన్, మంగళాప్రసాద్ పారితోషిక్ వంటి పురస్కారాలు అందుకున్నారు. సాహితీరంగంలో ఎంతటి ఉన్నతోన్నత శిఖరాలు చేరుకున్నా మెహతా మూర్తీభవించిన వినమ్రత గల వ్యక్తిగా ఖ్యాతి గాంచారు. జ్ఞానపీఠ పురస్కారం స్వీకరిస్తూ చేసిన ప్రసంగంలో చివర వినిపించిన కవితలోని పంక్తులు: 'తెలిసో తెలియకో/ చేయూత నిచ్చిన వారందరూ/ వరేణ్యులే/ నావంటి అపాత్రుని సృజించినవారే'.

ఆయన 2000 నవంబరు 22న పరమపదించారు. భారతీయ సాహితీరంగాన్ని సుసంపన్నంచేసిన సృజనశీలుర్లో నరేశ్ మెహతా చిరస్మరణీయుడు.

**– గోవిందరాజు రామకృష్ణారావు**

# సై అంటే సై

**స్మితం**

పేరడీ చక్రవర్తి జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి, అబ్బూరి వరదరాజేశ్వరరావు ఓసారి బెజవాడలో చలంగారింట్లో కలిశారు. మాటల సందర్భంలో 'సభాపతి' శివశంకరశాస్త్రి విషయాన్ని వరద ప్రస్తావించారు.

అంతలో చలంగారు "సభాపతి శివశంకరశాస్త్రి గురించి మాట్లాడుతున్నారా? ఆయన నీగురించి చెప్పిన పద్యం గుర్తుందా? " అంటూ జరుక్‌శాస్త్రి వైపు కొంటెగా చూశారు.

"నీవు స్త్రీజాతియందు జనించు కతన... అని ఓ పద్యంలో సభాపతిగారు అన్నారు. అదేం జా



తయ్యా, విన్నావా? " అంటూ ఆ తర్వాత ఫెళ్లున నవ్వారు.

జరుక్‌శాస్త్రి పురుషుడు, పేరేమో స్త్రీ సంబంధి అంటూ సభాపతి శివశంకరశాస్త్రి ఎగతాళి చేసిన విషయాన్ని చలం మళ్లీ చెప్పి ఆటపట్టించారు.

వెంటనే జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి,-

"చాల సామ్యంబు కలదట సాహితీ స
భాధిపతికిని, మన రాసభాపతికిని
అర్థమెరుగని శబ్దమ్ము లతడు మోయు
తావి యెరుగని గంధమీతడు వహించు"

అంటూ బందరులో అబ్బూరి రామకృష్ణారావు 'సభాపతి'గారిపై చెప్పిన పద్యాన్ని ప్రస్తావించి బదులు తీర్చుకున్నారు.

రాసభాపతికి అంటే గాడిదకు, సాహితీ సభాపతికి చాలాపోలిక ఉంది. అర్థం తెలియని శబ్దాలను ఆ సభాపతి తన కావ్యాల్లో మోస్తాడు. పరిమళం తెలియకుండానే గంధపుచెక్కల్ని ఈ గాడిద మోస్తుంటుందని పై పద్య భావం.

దాంతో చలంగారు, అబ్బూరి వరద నవ్వాపుకోలేకపోయారు.

సాహితీమూర్తులు, సరస్వతీపుత్రుల సరదాలు-సరాగాలు ఇలాగే ఉంటాయి మరి!

# మనసున ఉన్నదీ...



★ పారిజాత పుష్పంలా మెరిసిపోతున్న కాజల్ ముఖచిత్రంతో 'చతుర సుమధురంగా ఉంది. చక్కని ప్రారంభంతో చంద్రలత నవల 'వాళ్లు.. వీళ్లు.. పారిజాతాలు' ఏకబిగిన చదివించింది. మొత్తానికి ఓ విభిన్న శైలిలో రూపుదిద్దుకున్న 'నిజ పారిజాతాలు' కథనాలు కదలింపజేశాయి. కాలాతీతం ద్వారా గొప్ప సాహిత్యం గురించి తెలుసుకుంటున్నాం. 'చతురంగం' పద సంపదను పెంచుకునేందుకు ఉపకరిస్తోంది.

– ***నేమాన సుభాష్***, శ్రీకాకుళం

★ 'వాళ్లు.. వీళ్లు.. పారిజాతాలు' ఒక ప్రయోగమనే చెప్పాలి. ఇలాంటి నవల నేటి మృగ స్థాయికి దిగజారుతున్న సమాజానికి ఎంతో అవసరం. పరువుహత్యల గురించి కథనాలు హృదయ విదారకంగా ఉండి కదిలించాయి. చతురకతలు బాగున్నాయి.

–***మోతి మోహనరంగా***, సూర్యాపేట్

★ మండుటెండలో తుషారంలా చిరునవ్వుల కాజల్ ముఖచిత్రంతో చతుర పసందుగా ఉంది. చంద్రలత ప్రయోగాత్మక నవల 'వాళ్లు.. వీళ్లు.. పారిజాతాలు' మమ్మల్ని చాలా ఆకట్టుకుంది. మంచినవల చదివిన ఆనందం కలిగింది. చతురకతలు బాగున్నాయి.

–***శ్రీకాళహస్తి వెంకటశేషగిరిరావు***, నెల్లూరు

★ చంద్రలత రాసిన జూన్ చతుర నవల చాలా గొప్పగా ఉంది. పారిజాతాలు ఎంతో విశిష్టమైన పువ్వులు. అలాగే సమాజంలో ఓ కుటుంబానికి పరువు కూడా ముఖ్యమే. అలాగని కన్నకూతురిని చంపడం మూర్ఖత్వం, అమానుషం. కాలంతోపాటు పెద్దలు కూడా మారాలనే సందేశాన్ని ఇచ్చారు.

– ***బి.సైదులు***, చండూరు, నల్లగొండ

★ జూన్ చతుర నవల ఆద్యంతం ఆర్ద్రంగా కవితాత్మకంగా సాగిపోయింది. పారిజాత కుసుమాలవంటి నీలూల జీవితాలు ఇలా కన్నవాళ్ల చేతిలో దారుణంగా బలికావాల్సిందేనా? అనే ఆలోచన రేకెత్తించింది. చంద్రలత పరిశోధనాత్మకంగా రాసిన ఈ నవల ఆద్యంతం మమ్మల్ని కళ్లనీళ్లు పెట్టించింది. చతురలోని ప్రతి శీర్షిక బాగుంటోంది.

– ***ఎన్.విజయలక్ష్మి***, ఒంగోలు

★ జూన్ నవల హృదయాన్ని కదిలించింది. నీలూ పాత్ర చిత్రణ చాలా బాగుంది. రెండు కుటుంబాల్లోను నీలూకు జరిగిన అన్యాయం 'పరువు' గురించిన చీకటి కోణాన్ని, అనాగరికత్వాన్ని విప్పిచూపింది. ప్రేమికులను దోషుల్ని చేసిన అక్కడి పెద్దలను ఎలా శిక్షించినా తక్కువే. ఇలాంటి ఎన్నో సామాజిక స్పృహగల నవలల్ని పాఠకులకు అందించాలని కోరుతున్నాం.

–***కందూరి వంశీకృష్ణ***, కూకట్‌పల్లి

★ నిన్నటినిజంలో కల్లూరి వెంకటనారాయణ, చిలుకూరివారి జీవిత సన్నివేశాలను పేర్కొన్న తీరు బాగుంది. జాషువా చతురోక్తులు బాగున్నాయి. వంగ కవితా కదన కాహళి సుభాష్ ముఖోపాధ్యాయ గురించిన జ్ఞానపీఠాలు నిజంగా జ్ఞానదాయకంగా ఉంది. అలాగే కొత్తగాలి కవితలు చాలా నచ్చాయి.

–***రామడుగు వెంకటేశ్వర శర్మ***, గుంటూరు

★ చంద్రలత నవల ఒకే విషయాన్ని చాలా కళాత్మకంగా చెప్పిన రెండు పెద్ద కథలా సమాహారం. ప్రస్తుత సామాజిక దురాచార నేపథ్యాన్ని కళ్లకు కట్టినట్లుగా వర్ణిస్తూ, పరువుహత్యల గురించి ఆర్ద్రంగా అక్షరీకరించారు. దీంతోబాటు కొన్ని యధార్థ సంఘటనలను 'నిజపారిజాతాలు'గా తెలియజేయడం సందర్భోచితంగా ఉంది. 'జిగిరి' కథ పూర్వాపరాలను సంక్షిప్తంగానే చక్కగా తెలియజేశారు.

– ***మంచాళ శ్రీలక్ష్మి***, విశాఖపట్నం



చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082
ఈ మెయిల్ :
vipula.chatura@eenadu.net

# హాయ్.. అమెరికా 4

## పెట్టుబడిదారీ వ్యవస్థ శాపమా?

**అమెరికా పెట్టుబడిదారీ విధానానికి పెట్టనికోట అని, దానికి ఆ దేశం అత్యున్నత ప్రతీక అనేది అందరికీ తెలిసిన నిజం. కమ్యూనిస్టులు, సోషలిజాన్ని ఇష్టపడే మేధావులు పెట్టుబడిదారీ విధానాన్ని ద్వేషిస్తారు. ఆ వ్యవస్థను మార్చాలని చాలామంది అమెరికన్లు కోరుకుంటున్నారనేది ప్రపంచంలో అనేకులకు తెలీదు. మనదేశంలోలాగే అమెరికాలో కూడా పెట్టుబడిదారుల వల్ల అసంఖ్యాక ప్రజలు తమ ఆస్తులని కోల్పోయి బజారున పడుతున్నారు. అమెరికాలో ఇళ్లు కోల్పోయి రోడ్లమీద దిక్కూమొక్కూ లేక నివసించే లక్షలాది 'హోమ్‌లెస్ పీపుల్' ఒకప్పుడు సొంతగూట్లో వెచ్చగా ఉన్నవారే. తర్వాతి కాలంలో పెట్టుబడిదారీ వ్యవస్థ వల్ల వారు ఉన్న గూటిని కోల్పోయి రోడ్లమీద జీవించాల్సిన దీనస్థితికి చేరుకున్నారు. షికాగోలోని ఓ ఫర్నీచర్ ఫ్యాక్టరీ బేంక్ అప్పులను తీర్చకపోవడంతో తలెత్తిన సమస్యను అక్కడి కార్మికులు ఎలా పరిష్కరించుకున్నారో తెలుసుకుందాం!**

ఇటీవల షికాగోలోని తలుపులు, కిటికీలు తయారుచేసే ఓ ఫ్యాక్టరీ బేంక్‌నుంచి తీసుకున్న అప్పు చెల్లించలేదు. దాంతో ఆ బేంక్ ఫ్యాక్టరీని స్వాధీనం చేసుకుని వేలం వేయాలనుకుంది. అయితే కార్మికులకు ఆ ఫ్యాక్టరీ గత నెల జీతాలు ఇవ్వలేదు. ఆ కార్మికుల జీతాలని ఫ్యాక్టరీని స్వాధీనం చేసుకున్న బేంకూ చెల్లించదు. పెట్టుబడీదారి అమెరికాలో ఇలాంటివి సర్వసాధారణమే. కాని ఆ ఫ్యాక్టరీ కార్మికులు తొలిసారిగా ఈ విధానంమీద చిన్న తిరుగుబాటు చేశారు. జీతాలు తమకి ముట్టేదాకా ఫ్యాక్టరీలోంచి బయటకి కదలమని అందరూ అక్కడే మకాం వేశారు.

ఫ్యాక్టరీ నష్టాలకు, యాజమాన్యం అప్పులకు తాము కారణం కాదని కార్మికులు నినదించారు. 'మేము మా కష్టానికి ప్రతిఫలం కోరి పనిచేశాం. ఫ్యాక్టరీ అప్పులు తీర్చకపోవడంతోగాని, దాని లావాదేవీలతోగాని మాకెలాంటి సంబంధంలేదు. అమాయకులైన మమ్మల్ని ఫ్యాక్టరీ అప్పుల కారణంగా బాధించడం అన్యాయం' అన్నారు.

ఈ రకం చర్య సోషలిజంలో సర్వసాధారణం తప్ప, పెట్టుబడిదారీ అమెరికాలో అపూర్వం. చట్టం ఎల్లప్పుడూ పెట్టుబడిదారుల వైపే మొగ్గు చూపుతుంది. కాబట్టి తమని పోలీసులు వచ్చి అరెస్టు చేసి తీసుకెళ్తారని తెలిసినా అక్కడి కార్మికులు చలించలేదు. ఈ సంగతి మీడియా ద్వారా తెలుసుకున్న స్థానికులు ఆ కార్మికులకు ఆహారం ఇచ్చి, తమ పూర్తి మద్దతుని ప్రకటించారు.

స్థానిక చర్చి ఫాదర్ కూడా వచ్చి, 'జీసస్ విధానాలకు, ఆ బేంక్ విధానాలకు పొంతన లేదు. జీసస్ బోధనలకి విరుద్ధంగా చేస్తున్నారు. కార్మికులకే చర్చి మద్దతు. ఇలా వందలకొద్దీ మూసేసిన ఫ్యాక్టరీల కార్మికులు నష్టపోవడం షికాగోలో ఎన్నోసార్లు చూసి బాధపడ్డాను' అని చెప్పారు.

ఆరు రోజులు ఆందోళన కొనసాగిన తర్వాత

ఇల్లినాయిస్ రాష్ట్ర గవర్నర్ ఈ ఉదంతాన్ని అమెరికా అధ్యక్షుడు ఒబామాకి తెలియజేశాడు. 'ఆ కార్మికులు కష్టానికి ప్రతిఫలం కోరుకోవడం తప్పు కాదు' అని కామెంట్ చేశారాయన. దాంతో ఒబామాకి సోషలిస్ట్ అని బిరుదు తగిలించారు. చివరికి ఆ వర్కర్స్ తమ ఉద్యమంలో గెలిచారు. వారికి తలా ఆరువేల డాలర్లను బేంక్ చెల్లించింది.

అమెరికా రాజ్యాంగంలో- ఫ్రీ ఎంటర్ప్రైజ్, కేపిటలిజం, లాభం అన్న పదాలే లేవు. అయితే నేడు అక్కడి సంపదంతా ఒక్కశాతం మంది గుప్పిట్లోనే కేంద్రీకృతమైంది. అక్కడి మధ్యతర గతివాళ్లు రోజురోజుకీ కార్మికులుగా మారిపోతున్నారు. వరుసగా రెండు నెలల జీతం అందకపోతే వారు వీధిన పడాల్సిన దుస్థితి.

పెట్టుబడిదారుల ఆయుధాలైన లే అవుట్, ఫోర్ క్లోజర్ అమెరికా కార్మిక వర్గానికి చీడగా మారాయి. ఎలాంటి కారణం లేకుండా ఉద్యోగులను తొలగించే అధికారం అమెరికాలో ఉంది. దాన్నే 'లే అవుట్' అంటారు. అక్కడి ప్రతి పరిశ్రమ విధిగా ఏటా కొద్దిమందిని పనిలోంచి తొలగిస్తుంది. ఉద్యోగులకు వారి సూపర్వైజర్లు ఎ, బి, సి, డి గ్రేడ్లు ఇస్తారు. ఓ గంట ముందు వచ్చి, గంట ఆలస్యంగా వెళ్తూ, ఇంటి వద్ద కూడా ఆఫీసుపని చేసేవారిని 'ఎ' గ్రేడ్, సమయానికి వచ్చి వెళ్లేవారిని 'బి' గ్రేడ్, సామర్థ్యంలో కాస్త వెనుకబడినవారిని 'సి', 'డి' గ్రేడ్లుగా పరిగణిస్తారు. దాంతో ఎవరికివారు 'ఎ' గ్రేడ్లో ఉండాలని రోజూ వచ్చి రెండు గంటలు ఉచితంగా పని చేస్తారు. ఇలా తమ ఉద్యోగస్తుల శ్రమని అక్కడి పెట్టుబడిదారులు కొల్లగొడుతున్నారు.

తమకింద పనిచేసేవారి జీవితాలను యాజమాన్యం ఇన్సూరెన్స్ చేసే పద్ధతి అమెరికాలో ఉంది. ఉద్యోగి మరణిస్తే కంపెనీకి నష్టం వస్తుందనే కారణంగా వారు ఉద్యోగుల మీద ఇన్సూరెన్స్ తీసుకుంటారు. ఇటీవల కేన్సాస్లోని ఓ వాల్పోర్ట్ ఉద్యోగి మరణిస్తే ఆ సంస్థకు పదిహేను లక్షల డాలర్లు ఇన్సూరెన్స్ కంపెనీ నుంచి అందాయి. ఆ ఉద్యోగికున్న సొంత బీమా వల్ల అతని భార్యకి వచ్చింది లక్ష డాలర్లే.

'నా భర్తకి గత పద్దెనిమిది ఏళ్లలో ఇచ్చిన జీతంకన్నా అతని మరణం వల్ల వాల్పోర్ట్ సంస్థకు ఇన్సూరెన్స్ కంపెనీ ఇచ్చినదే చాలా ఎక్కువ. ఇది చట్టరీత్యా సబబైనా నైతికంగా సరైనది కాదు' అని ఆ ఉద్యోగి భార్య టీవీ ఛానెల్ ఇంటర్వ్యూలో చెప్పింది. పెద్దపెద్ద కంపెనీల బడ్జెట్లలో ఉద్యోగుల మరణంవల్ల లభించే సొమ్మునీ ఆదాయంలోకి కలుపుకుంటారు.

ఇదిలా ఉండగా 2008లో సౌత్ కరోలినా రాష్ట్రంలో మైఖేల్మూర్ అనే అతనికి అమెరికా అధ్యక్షుడు రూజ్వెల్ట్ 1944 జనవరి 11న ఇచ్చిన ఇంటర్వ్యూ ఫిలిం లభించింది. అందులో ఆయన అమెరికన్లకు సెకండ్ బిల్ ఆఫ్ రైట్స్ ద్వారా ఈ కింది హక్కులు లభించాలన్నాడు.

★ చేసిన పనికి సరైన పారితోషికాన్ని పరిశ్రమలు, దుకాణాలు, గనులు, పొలాలు, రిక్రియేషన్ సెంటర్లలోని ఉద్యోగులందరికీ చెల్లించాలి.

★ ప్రతి అమెరికన్ కూడు, గూడు, గుడ్డ, వినోదాలకి సరిపడా సంపాదించుకోగలగాలి.




★ ప్రతి రైతు పండించేది కనీసం అతని కుటుంబం హాయిగా జీవించడానికి సరిపడాలి.

★ ప్రతి కుటుంబానికి తలదాచుకునేందుకు సరిపడా ఇల్లు ఉండాలి.

★ వైద్య సదుపాయం, చక్కటి ఆరోగ్యం కలిగివుండేందుకు ప్రజలందరికీ హక్కు ఉంది.

★ వృద్ధాప్యంలో ఉద్యోగంకోసం ఎగబడకుండా తమ పోషణ, వైద్యపు ఖర్చుల భయం తొలగి, హాయిగా బతకడమనేది వృద్ధ అమెరికన్ల హక్కు.

అయితే ఈ ప్రకటన చేసిన ఆరు నెలలకే రూజ్వెల్ట్ మరణించడంతో అది అటకెక్కింది. పై హక్కులన్నీ సోషలిజానికి చెందినవి. అమెరికన్లను కేపిటలిజం కేన్సర్లా కబళిస్తోంది.

**- డి.పద్మజ**

గతనెల పజిల్ పూరించి, అన్నీ సరైన సమాధానాలు రాసినవారిలో డ్రా ద్వారా ఎంపికైన విజేత

**వి. వి. సత్యనారాయణ శెట్టి,**

593, బైరాగి పట్టెడ,

తిరుపతి,

చిత్తూరు జిల్లా

పిన్: 517 501

వీరికి రూ. 150/- త్వరలోనే అందుతాయి.

## చతురంగం -3 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ల | త | | 2 నా | గా | 3 ర్జు | 4 న | 5 సా | గ | 6 రం |
| వం | | | మి | | 7 అ | నా | స | | గీ |
| గం | | 8 ద | ని | 9 వే | న | | | 10 హ | లా |
| | 11 సి | ధి | | యి | | 12 వి | 13 హా | రి | |
| | | | 14 వే | ప | మం | డ | లు | | |
| 15 తా | పీ | | 16 దం | డ | | 17 అ | డు | 18 గు | |
| లు | | 19 మీ | డ | గ | | | | 20 డు | నే |
| 21 సీ | 22 తా | రా | ము | లు | | 23 స | 24 లి | మొ | |
| 25 ము | ర | | | | 26 స | వ్య | సా | | 27 తో |
| 28 రా | మ | రా | జ్య | ము | | 29 ము | కం | దు | క |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. కె. సత్యనారాయణ, ఏర్పేడు, చిత్తూరు జిల్లా
2. ఆర్. నాగేశ్వరరావు, శ్రీకాకుళం
3. కె.వి. దుర్గామోహనరావు, హైదరాబాద్
4. వి. గంగరాజు, విశాఖపట్నం
5. వి. వెంకట సత్యవతి, విశాఖపట్నం
6. జి. సూర్యనారాయణ, బందలాయి చెరువు, కృష్ణా జిల్లా
7. సి.జి. శంకరరావు, హైదరాబాద్
8. జె. వసంత, హైదరాబాద్
9. యు.యు.యు, ఎమ్మిగనూరు
10. కె. రఘుపతి, సికింద్రాబాద్
11. టి. శశికళ, గుంతకల్లు
12. బి. కృష్ణవేణి, చెన్నై
13. కె.ఎస్. ఆచార్యులు, విజయనగరం
14. విశ్వనాథ గాయత్రి, విశాఖపట్నం
15. ఎస్. అబ్దుల్ అజీజ్, పెద్దమందడి, మహబూబ్‌నగర్ జిల్లా
16. టి. ఆర్. బాలకృష్ణారావు, రాజమండ్రి
17. లలిత దేవులపల్లి, ఉయ్యూరు, కృష్ణాజిల్లా
18. పప్పు కామేశ్వరరావు, భూపయ్య అగ్రహారం, తూ. గో. జిల్లా
19. ఎస్. విజయలక్ష్మి, ఒంగోలు

చతురంగం-3లో అడ్డం 15 తాతాజీ ఇంటిపేరు అని ఇవ్వగా చాలా మంది గుర్తించలేక పోయారు. 'తాతాజీ' అంటే తాపీ ధర్మారావు. 'దేవాలయాలపై బూతుబొమ్మలు ఎందుకు?' 'పెళ్లి - దాని పుట్టుపూర్వోత్తరాలు' వంటి రచనలతో ఆయన సుప్రసిద్ధులు

# చతురంగం - 4 ఆధారాలు

**అడ్డం**

1. విశ్వకథావేదిక (3)
3. త్రాసు..రాసులలో ఒకటి (2)
5. మందార మకరందాలు అందించిన భాగవత కవి (3)
7. శరీరం (2)
8. సింహమంటి కుర్రాడే అంటూ పాడిన బొద్దుగుమ్మ రివర్స్ అయింది (3)
10. పాశ్వాన్ మొత్తం పేరులో మొదటి రెండక్షరాలు (2)
11. శత్రువులు (3)
15. కుబేరుడి ముఖ్యపట్టణం (5)
17. 'ఉత్సవ్'లో శశికపూర్ పాత్ర, మృచ్ఛకటికం నాటకంలో విలన్ (4)
20. 'డ్రైవర్ రాముడు' లో ఎన్టీఆర్ వాహనం (2)
21. ఒక లోహం (2)
22. ... చేమంతీ ముద్దాడుకున్నాయిలే (2)
23. నీచుడు, మోసగాడు (3)
24. మనసులో అనుకోవడం (3)
25. భీముడు చంపిన రాక్షసుడు గజిబిజి (3)
26. భవిష్యత్తు (2)
27. అటు నుంచి జబ్బు (2)
28. ఉరిశిక్ష అమలు చేసేవాడు (3)
29. రవితేజ ఇటీవలి సినిమా (2)
30. సముద్రమే పాపం గజిబిజి (3)
31. ధృతరాష్ట్రునికి మంచి చెప్పబోయినవాడు గజిబిజి (4)

**నిలువు**

1. గరుత్మంతుని తల్లి (3)
2. 'చతుర'లో ప్రధానమైంది తిరగబడింది (3)
3. పాండురంగని మరాఠీ భక్తుడు, అంజలి.. అక్కినేని సినిమా (3)
4. పకృతి ప్రకోపం గజిబిజి (3)
5. మహేశ్‌బాబు హిట్ సినిమా (3)
6. స్త్రీలు మోజుపడేవి (3)
9. జనకమహారాజు నగరం (3)
12. కారుకన్నా వేగంగా షికారు చేసేది (3)
13. 'అంకురం'లో బాలీవుడ్ నటుడు (3)
14. రావణుడు (5)
15. గోర్కి గొప్పనవల (2)
16. 'చతుర'లో ప్రపంచ నవలలు పరిచయం చేసే శీర్షిక (4)
18. శుక్రాచార్యుని వద్ద మృతసంజీవని తస్కరించినవాడికి తలదీర్ఘం (3)
19. పాండవుల అజ్ఞాతవాసం తలకిందులైన ఈరాజు కొలువులోనే (4)
22. రాముడు ఈ సీతతో అశ్వమేధయాగం చేశాడు (3)
23. రామునికి ఎంగిలి పండ్లు ఇచ్చిన భక్తురాలు (3)
24. సొంత మనుషులు (3)
25. క్షేమం (3)
26. 'కాదంబరి' గద్యకావ్యం రాసిన సంస్కృత కవి (3)
28. జనరేషన్ తెలుగులో (2)
29. కొండవీడులో కొండ ఎగిరిపోయింది (2)

**నిబంధనలు**

1. చతురంగాన్ని అదే పేజీలో పూర్తిచేసి పంపాలి. 2. తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. 3. గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలింపబడవు. 4. ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. 5. ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. 6. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

**చతురంగం పంపాల్సిన చిరునామా :**

**చతురంగం** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ -082

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు ★ చతురంగం, చతురప్రవేశిక, కాప్షన్ మీదే, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం

# చతురంగం - 4

రూ.150/- బహుమతి

గడువు తేది : ఈనెల 18

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | 4 | | 5 | | 6 |
| | | | | 7 | | | | | |
| 8 | 9 | | | 10 రాం | | | 11 | 12 | |
| | | | 13 | | | 14 | | | |
| 15 | | 16 | | | | 17 | 18 కా | | 19 |
| | | 20 | | | | 21 | | | |
| | 22 | | | | 23 | | | | |
| 24 | | | | 25 | | | | 26 | |
| 27 జ | | | 28 | | | | 29 | | |
| | | 30 | | | | 31 | | | దు |

పంపినవారి పేరు: ----------------------------------------

వయసు (       ) చిరునామా : ----------------------------------

----------------------------------------------------------------

---------------- పిన్ : ---------- ఫోన్ : ---------------

ఆధారాలు, నిబంధనలు 129 పేజీలో...

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, Plot No. 95 & 96, Gandhinagar, Quthubullapur Village & Mandal, R. R. District., Hyderabad-500 037. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.

# కాప్షన్ మీదే - 31



ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు
నవ్వొచ్చే కాప్షన్ రాయండి. చక్కని బహుమతి అందుకోండి!
బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి, పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 18

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082
e-mail : vipula.chatura@gmail.com

ఉత్తమ వ్యాఖ్య :

పుటుక్కు జరజర... అరె! సామెత పూర్తిగా
చదవకముందే తాడు తెగి చేతికి వచ్చిందే!!

–సాధనాల నాగవర్ధని ,
నూజివీడు, కృష్ణా జిల్లా





## కాప్షన్ మీదే -30

బాగున్న మరికొన్ని కాప్షన్లు :

పదవీకాలం పూర్తయ్యే వరకూ
నన్నెవ్వరూ పడగొట్టలేరు!
ఒంటి'చేత్తో' నెట్టుకొచ్చేస్తా!
– కె.వి.లక్ష్మణరావు, మానేపల్లి, తూ.గో.జిల్లా

ఏం చేద్దాం మరి!
అభివృద్ధి చెందిన దేశం కదా?
మరొక చెట్టూ ఎక్కడా కనపడలా!?
– ఎ.వెంకటగోపి, సికింద్రాబాద్

ఓ 'ఉత్త'ముడా! ఇది కల అయితే మేలుకో!
నిజమయితే త్వరలో కోలుకో..
– టి.సింధూరదేవి, హైదరాబాద్

ఇంద్రజాలం పుస్తకం భలే బాగుందే.
చదువుతుంటే గాలిలో తేలినట్టుందే!
– బాలసుబ్రహ్మణ్యం,
balumoduga@yahoo.co.in

